

నాదెప్పుడో గుహల్లో పచ్చలారని రంగులతో చిత్రించి...

కె.గోపాలరావు సమర్పించు... అశ్వరాజ్ పిక్చర్స్ వారి...

# శ్రీ సత్యనారాయణ మహాత్మ్యం

మాటలు-పాటలు: సముద్రాల జూనియర్ · మ్యూజిక్: ఘంటసాల
ఆర్ట్: వాలి · డ్యాన్స్: వెంపటి · సహాదర్శకుడు: K.V. నందనరావు...

| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | స్క్రీన్‌ప్లే-పర్యవేక్షణ: | నిర్మాత: |
| --- | --- | --- |
| సి.నాగేశ్వరరావు | కె.గోపాలరావు | పి.సత్యనారాయణ B.A. |

NEGATIVE RIGHTS CONTROLLED BY:
VANIE FILM DISTRIBUTORS







వాణీ రిలీజ్.

REVATHI

ఈ సంచికలో



ముఖచిత్రం అభిసారికలు

చిత్రకారుడు వడ్డాది పాపయ్య



మీ "యువ"లో నెహ్రూ నిర్యాణ గాధను చక్కగా చిత్రించారు. ఆయన కోసం మీ "యువ"ను కొనక తప్ప లేదు. ముఖచిత్రం చూడగానే ఆయన ...మపడించా రన్న ఆలోచనే తట్టలేదు. సజీవంగా ఎదుట నిల్చినట్లు తోచింది.

— "పురాద్రి"

జూలై నెల సంచికలో "జీవప్రమాదం" అనే కథ హృదయాన్నే కదిలించి వేసింది. రచయితలకు నా ధన్యవాదాలు.

వాచస్పతిగారి, "పరిష్కారం" నన్నెంతో ఆకర్షించింది. అందుకు నా కృతజ్ఞత తెలియజేయుచున్నాను.

మిస్. జి. టి. సరస్వతి.
గజపతి నగరం

జూలై నెల ముఖచిత్రం (శ్రీనెహ్రూ) చాలా బాగుంది. "పరిష్కారం, చవితి చంద్రుడు" కథలు ఎంతో బాగున్నాయి. జూలై నెల యువలోని ప్రకటన చూసి ఎంతో ఆనందించాను. మంచి, మంచి, నవలలు ప్రచురిస్తా రని ఆశిస్తున్నాను. ఇంత మంచి కథలూ, కార్టూన్లూ పాఠకులకు అందిస్తున్న మీకు నా అభివందనలు.

యు. రజినీ కాంతారావు
హైద్రాబాద్-28

---

బంకిమ్‌చంద్ర ఛటర్జీగారి, 'రాజశేఖరుడు'
సంక్షిప్తనవల, శ్రీ వడ్డాది పాపయ్యగారి చిత్రాలతో,
వచ్చే సంచికలో వెలువడుతుంది

మీ కాపీ, యువ ఏజంటు దగ్గర రిజర్వ్ చేసుకోండి

— సంపాదకుడు.

ఈ నెల వడ్డాదిపాపయ్యగారి కాంతి దూత నెహ్రూగారి ముఖచిత్రాన్ని చూడగా దుఃఖంతో క్రుంగిపోయాము. నెహ్రూగారి జీవితచరిత్రను సమీక్షిస్తూ, వివిధమంత్రులతో నుండిన చిత్రముల ప్రచురణ ముదావహం. నవభారతనిర్మాత శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారికి అత్యంత శ్రద్ధాభక్తులతో భక్తాంజలిని సమర్పించు చున్నాము.

'దేవిచౌధరాణి' 'జీపుప్రమాదం' కధలు చాల బాగున్నాయి. కోదూరి కౌసల్యాదేవిగారి 'చక్రనేమి' సీరియల్ అన్ని రసాలతో నిండి, వాస్తవికతకు దగ్గరగా నడుస్తున్న ఒక మంచి నవల. నా అభిమాన యువను ఉత్తమ సాహిత్య పత్రికగా వెలువరిస్తున్నందుకు, సంపాదకులు చక్రపాణిగార్కి నా అభివందనములు.

కుందల మహంతి సన్యాసిరావు,
తుని.

మీరు జూలై నెల సంచికలో ప్రచురించిన శ్రీ బంకిమ్ చంద్ర చటర్జీ గారి 'దేవీ చౌధరాణి' సంక్షిప్తీకరణ నవల చాలా మనోజ్ఞంగా ఉంది. దానిలో ప్రఫుల్ల పాత్ర చాలా చక్కగా చిత్రీకరించి యుంది. చటర్జీ గారికి ప్రచురించిన మీకు మా కృతజ్ఞతాభివందనములు.

కొర్లపాటి రామచంద్రరెడ్డి,
అన్నవరం

# "యుగళాంగుళీయకం"

యువ జూన్‌నెల సంచికలో బంకిమ్ చంద్ర చటర్జీ రచన "యుగళాంగుళీయకం" ప్రచురించి, శిల్పం రీత్యా అది కథా, నవలికా, నవలా అన్న విషయం చర్చిస్తూ రచనలు పంపితే ఉత్తమ రచనకు బహుమతి ఇస్తామనీ, ప్రచురణయోగ్యమైన రచనలు ప్రచురిస్తామనీ తెలిపాం కాని పాఠకులనుంచి సరి అయిన రచన ఒక్కటీ రాలేదు

కథానికలో ప్రధానంగా కొద్ది సన్నివేశాలూ, ఒకే సంఘటనా ఉంటుంది, పాత్రలపరిణామం ఉండదు, సంఘటనపై పాత్రల ప్రభావం ఉంటుంది గాని, పాత్రలపై సంఘటనయొక్క ప్రభావం స్పష్టం చెయ్యబడదు, చిన్నకథ కొద్ది కాలానికి పరిమితమై ఉంటుంది

నవలికలో సన్నివేశాలూ, సంఘటనలూ కొంచెం హెచ్చుగానే ఉన్నప్పటికీ, అవన్నీ కొద్దికాలంలోనే జరుగుతాయి, పాత్రల ప్రవృత్తులలో కొద్ది మార్పులు కలిగినా అవి గాఢమైనవిగానూ, జీవితాన్నీ పూర్తిగా మార్చి వేసేవిగానూ ఉండవు

నవల పాత్రల విస్తృత జీవితాలను చిత్రిస్తుంది, వాటిలో కొన్ని శాశ్వత పరిణామాలను చూపిస్తుంది అవి జీవితం వెంబడి ప్రయాణించి కొన్ని గమ్యస్థానాలను చేరుకుంటాయి నవలకు కాలపరిమితి లేదు పాత్రలపై సంఘటనల ప్రభావం చిత్రిత మవుతుంది

పై లక్షణాలనుబట్టి యుగళాంగుళీయకం నవల అవుతుంది ...లో హిరణ్మయి జీవిత ఘట్టాలు అనేకం చిత్రించబడ్డాయి ఆమెకూ, పురందరుడికి మధ్య ప్రేమ ఏర్పడటమూ, జ్యోతిషాన్నిబట్టి వారి వివాహం పడకపోవటమూ, చాలా కాలానికి ఆమె వి...హం తెలియనివాడితో జరగటమూ, ఆమె ఆ భర్తకుకూడా దూరం కావడమూ, ఆమె పేదరికంలో పడిపోవటమూ, చివరకు ఆమె తన భర్తను కలుసుకుని, అతను తన చిన్ననాటి ప్రియుడని తెలుసుకోవటమూ — ఇవన్నీ హిరణ్మయి జీవితంలో పెద్ద పెద్ద సంఘటనలే పరిస్థితుల ప్రాబల్యం ఆ పాత్రపైన ఎంతైనా ఉంది అందుచేత "యుగళాంగుళీయకం"నవల

ఈ విధంగా రచనా శిల్పాన్ని వివరించటానికి బదులు కొందరు రచనలో మార్పులు సూచించారు రచనను మెచ్చుకున్నారు, లేక విమర్శించారు కాని మేమనుకున్న విధంగా రచనను గురించి ఒక్కరూ చర్చించలేదు అందుచేత పాఠకుల రచన లేవీ ప్రచురించదలచలేదు

# ప్రశ్నా వేదిక

ఈ శీర్షికకూడా మాకు చాలా నిరుత్సాహాన్ని కలిగించింది. దీనికిగాను వచ్చిన ప్రశ్నలు ఏమీ బాగాలేవు "సాహిత్యమునుగూర్చి వివరంగా చర్చించండి" అని ఒక ప్రశ్న। "ప్రతివస్తువును ఆకర్షించే శక్తి భూమి కున్నప్పుడు ఆకాశాని[illegible]కపోవటం ఆశ్చర్యమేనా?" అని మరొకప్రశ్న। "నేను నీ కోసం? మావారు నా కోసం? దేనికోసం ఎదురు చూస్తారు?" అని ఇంకొక ప్రశ్న। కొన్ని ప్రశ్నలు ఎగ్జామినేషన్ పేపర్లలో ప్రశ్నల్లాటివి "సమాధానం నాకు తెలుసుగాని, నీ కెంత తెలుసో చూస్తాం!" అన్న ధోరణిలో ఉన్నాయి కొన్ని ప్రశ్నల్లో సమాధానం ఇమిడే ఉంటున్నది "ఈ నాడు తెలుగు సాహిత్యంలో నవలలు దాదాపు వెలువరిస్తున్న వారంతా స్త్రీలేగదా దానికి కారణం అధికమైన తీరుబడి, ఉత్తమ వివేచనా శక్తులేనా?" ఔనని సమాధానం ఇవ్వమని మాకు ప్రోత్సాహం।

ఇలాంటి ప్రశ్నలతో ఈ శీర్షిక ఉపయుక్తంగా నడవదని తోచటంచేత దీనిని మానివేస్తున్నాము — సంపాదకుడు

---

# యువ

సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 10 ఆగస్టు 1964 సంచిక


కేంద్ర మంత్రిమండలిలో ఇద్దరు ఆంధ్రులు కేబినెట్ మంత్రి హోదాలో వుంటు ఆంధ్ర రాష్ట్రానికి మంచిరోజులు వచ్చినట్టే లెక్క. దానితోపాటు ఎస్ కె పాటిల్ రైల్వే మంత్రిగా నియమింపబడడం కూడా ఆంధ్రదేశానికి ఒక విధంగా మేలే

ఆంధ్ర దేశంలో ఎన్నికల సందర్భంలో పాటిల్ రెండుసార్లు ఆంధ్రదేశ మంతా పర్యటించారు ఎంతో సహజ సంపత్తి వుండికూడా అన్ని రంగాలలోనూ ఆంధ్ర దేశం వెనకబడివున్న సంగతి పాటిల్ గ్రహించారు. కాని, ఆంధ్రదేశానికి ఉపకారం చెయ్యడానికి ఆయనకు ఇదివరకు అవకాశం లభించలేదు. దానికి కారణం, ఇది వరకు ఆయన ఆహారశాఖ, రవాణాశాఖల మంత్రిగా వుండడం. ఇప్పుడు రైల్వే మంత్రిగా నియమింపబడ్డారు. ఆంధ్ర ప్రాంతంలో రైల్వే వసతులు సరిగా లేని సంగతి ఆయనకు తెలుసు రైల్వే వసతులు ఆంధ్ర ప్రాంతానికి సరిగా లేకపోవ దానికి కారణం యీ ప్రాంతమంతాకూడా మూడు రైల్వే జోనులలో వుండడం ఈ జోనులు మూడిటికీ ప్రధాన కార్యాలయాలు ఇతర రాష్ట్రాల రాజధానులలో

వున్నాయి. అయినా రాష్ట్ర ప్రభుత్వాల పలుకుబడి, యీ విషయంలో ఎక్కువగా కనపడుతుంది.

ఆంధ్ర రాజధాని అయిన హైదరాబాద్‌లోకూడా ఒక రైల్వే జోన్ ప్రధాన కార్యాలయం వుంటే, ఆ జనరల్ మేనేజరుకు ఆంధ్ర ప్రాంతపు రైల్వే అవసరాలు సమగ్రంగా తెలుస్తాయి. కొత్త లైనులు వెయ్యడంలో రాష్ట్ర ప్రభుత్వం చేసే సూచనలను అతడు సమర్థించగలడు. ఈ లోటు ఎన్నడో సరిపెట్టవలసింది. సర్దార్ స్వరణ్‌సింగ్ రైల్వే మంత్రిగా వున్నప్పుడు, ఆంధ్ర ప్రాంతానికి ప్రత్యేక రైల్వే మండలాన్ని ఏర్పాటు చేసేటందుకు ఆయన సుముఖతను వెల్లడిచేశారు. కాని పని జరగలేదు. కారణం, ఇది చాలా ముఖ్యవిషయమనీ, వేగిరించవలసిన విషయమనీ ఆయన అనుకోలేదు. ఎందుచేతనంటే, ఆంధ్రదేశం అంతటా ఆయన సంచరించలేదు.

సర్దార్ స్వరణసింగ్ తరువాత రైల్వే మంత్రిగా వచ్చిన శ్రీ దాసప్ప, ఆంధ్రలో ప్రత్యేక మండలాన్ని ఏర్పాటు చేయడానికి విముఖత చూపించారు. మైసూరుకు ప్రత్యేక మండలాన్ని ఏర్పాటుచేసి, దాని ప్రధాన కార్యాలయాన్ని బెంగుళూరులో పెట్టడానికి ఆలోచిస్తున్నారని; నిజమో, అబద్ధమో, ఒక వదంతి కూడా బయలుదేరింది. ఇంతలో, పాటిల్ రైల్వే మంత్రిగా వచ్చారు. ఆంధ్ర ప్రాంతానికి రైల్వే మండలం ఏర్పాటు చేస్తానన్నారు. ఇది చాలా సంతోషించవలసిన విషయం. ఈ మండలానికి ఆంధ్ర మండలం అని పేరు పెట్టనక్కరలేదు. దేశంలోని తక్కిన మండలాలకు భాషా ప్రాంతపు పేర్లు లేవు. ఆంధ్ర మండలానికి అలాటి పేరు అక్కరలేదు. ఇది తూర్పుకోస్తాన వుంది గనుకనూ, దక్షిణ, తూర్పు మండలాలకు మధ్యను వుంటుంది కనుకనూ, దీనికి మధ్య ప్రాచ్య మండల మని పేరు పెట్టవచ్చును. ఏ పేరు పెట్టినా, ఆంధ్ర రాష్ట్రం ఎల్లలన్నిటినీ యీ మండలంలో వుండేటట్టు చూస్తే, ఆంధ్ర రాష్ట్రంలో రైల్వేవసతులు బాగుపడడానికి అవకాశం వుంది.

వచ్చే అక్టోబరునుంచీ మదరాసునుంచి కలకత్తా, ఢిల్లీలకు వెళ్లే రైళ్ళూ, ఈ పట్టణాలనుంచి మదరాసు వెళ్లే రైళ్ళూ గుంటూరు మీదుగా వెళ్ళడానికి ఏర్పాటు జరుగుతుందని అధికారరీత్యా ప్రకటన జరిగింది. ఇదికూడా సంతోషించవలసిన విషయమే. అలాగే కాకినాడ పట్టణాన్నికూడా మెయిన్‌లైనులో కలిపినట్లయితే, ప్రయాణీకుల ఇబ్బందులు తగ్గడం కాకుండా, ఆ పట్టణాల ప్రాముఖ్యత కూడా హెచ్చుతుంది.

ఇంతకన్న ముఖ్యమైన అవసరం ఏమిటంటే, ఒంగోలునుంచి నాగార్జునసాగర్ మీదుగా హైదరాబాదుకు నేరుగా రైలుదారి వెయ్యడం. ఈపని యీనాడు ఆరంభించినా, పూర్తిఅయేటప్పటికి పదేళ్ళయినా పడుతుంది. పదేళ్ళనాటికి, నాగార్జునసాగర్ కాల్వల ద్వారా నీరు ప్రవహించి, ఆ ప్రాంతం అంతా సస్యశ్యామలం అవుతుంది. రైల్వేలకు ఆదాయం కొల్లలుగా వస్తుంది. కాని, పదేళ్ళనాటికి పూర్తి కావాలంటే. యీనాడే పని ప్రారంభం కావాలి.

కొత్తరైలుదారి నిర్మాణం జరగాలంటే, కేంద్రప్రభుత్వం పట్టుదలతో ప్లానును ఆమోదించాలి. ఈనాడు, రైల్వేమంత్రి ఆంధ్ర దేశాభ్యుదయాన్ని వ్యతిరేకించేవాడుకాదు. ఆంధ్రరాష్ట్రి ముఖ్యమంత్రిగా వుండి రాష్ట్రపరిపాలనలోని సమస్త వివరాలనూ, రాష్ట్రావసరాలను సమగ్రంగానూ తెలిసిన ఇద్దరు ఆంధ్రులు కేంద్ర ప్రభుత్వంలో వున్నారు. వీరిద్దరి హయాంలోనూ, ఆంధ్రదేశాభ్యున్నతికి ఎంతో కృషి జరగడానికి అవకాశం వుంది. వీరి కృషి ఫలించడానికి, ఆంధ్రరాష్ట్రంనుంచి ఎన్నిక అయిన పార్లమెంటు సభ్యులూ, ఆంధ్రప్రభుత్వమూ తగిన మద్దతు ఇవ్వాలి.



# చిత్రవార్తలు

సినీనటుడు శ్రీ ఎన్. టి. రామారావు ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డికి రు. 1,00,000 చెక్కును బెజవాడలో అగ్నిప్రమాదానికి గురియైన → వారి సహాయార్థం ఇచ్చారు.

రిహైన్ నదిమీద స్తంభాలు లేకుండా నిరాధారమైన వంతెన నిర్మించడానికి పశ్చిమ జర్మనీ ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు, కలిసి కట్టడనిర్మాణంలో అద్భుత ప్రయోగాలు చేశారు. నది మధ్యలో కలుసుకునే ఏర్పాటు గల ఈ వంతెన, నిర్మాణదశను పై ఫొటోలో చూడవచ్చు.





డా. సంజీవరెడ్డి స్టేట్ మ్యూజియం ఆర్ట్ పెవిలియన్‌కు హైద్రాబాద్ పబ్లిక్ గార్డెన్‌లో శంకుస్థాపన జరిపారు.





శ్రీ కృష్ణమాచారి న్యూఢిల్లీలో స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియావద్ద 'యూనిట్ ట్రస్ట్' యూనిట్లు కొని చెక్కును అంద చేస్తున్నారు.



'నెహ్రూ దృక్పథం మనగమ్యం' అనే ప్రదర్శనశాలకు న్యూఢిల్లీలో శ్రీ నందా ప్రారంభోత్సవం జరిపారు.

డా. రాధాకృష్ణ ఇందిరాగాంధిచే సమాచార రేడియోశాఖల మంత్రిణిగా న్యూఢిల్లీలో ప్రమాణస్వీకారం చేయిస్తున్న దృశ్యం.



# వసంత

## 'శ్రీచదరాం'

మూర్తి తన స్నేహ బృందంతో స్టేషనుకు చేరుకున్నాడు. రైలు రావడాని కింకా సుమారు ఓ అరగంట టైముంది. వారిలో ఓ స్నేహితు డన్నాడు, "మూర్తి ఈ వేళ్ళ వరకూ మన తోటిగుమస్తా. రేపటినుండి ఎకౌంటెంటు దొరగా రవుతున్నారు. దొరగార్కి కొన్నాళ్ళ తరువాత మనం జ్ఞాపక ముంటామా?" మరియొక స్నేహితుడు "కొన్నాళ్ళ తరువా తేమిట్రా అప్రాచ్యుడా! 'ఈ స్టేషను విడిచిపెట్టిన తరువాత నుండి' అనాలి. ఇది నా సవరణ" అన్నాడు.

"మన ఆరు సంవత్సరాల స్నేహం అంత క్షణాలమీద మరచిపోగలది గాదు. నే నెకౌంటెంటు నైనా ఆఫీసులో మాత్రమే! ఆఫీసు వెలుపల మీలాంటి వాడినే. మీరుకూడా నాలా డిపార్టు మెంటలు టెస్టు పాసయి ఎంత త్వరగా ఎకౌంటెంట్లు అవుతారా అని ఎదురు చూస్తానురా అబ్బాయిలు." అన్నాడు మూర్తి తన మిత్రులను ప్రోత్సహిస్తూ.

ఇంతలో రైలు ప్లాటుఫారంపై నిలబడింది. మూర్తి త్వరగా రైలుపెట్టె ఎక్కి జాగా చూచుకొని తన సామానంత బండిలో కెక్కించు కున్నాడు.

"మనవాడు బ్రహ్మచారి గాబట్టి ఈ స్వల్ప సామానులతో ఇంత తేలిగ్గా రైలెక్క గలిగేడు. అదే మనబోటి సంసారులైతే! మన సంసారం అందులోనూ శ్రీమతి గారి నిత్య కృత్యాల్లో అవసరమైన చీపురుకట్ట మొదలు రుబ్బు రోలు వరకూ కూడా లేకపోతే మన ట్రాన్సుఫరు మాట దేవు డెరుగు గాని డిస్మిస్ వరకూ వస్తుం" దన్నాడు ఓ స్నేహితుడు.

"వట్టిసామాను లేమిట్రా నాన్ సెన్సు! శ్రీమతి గారి నుండి చిట్టిపాప వరకూ ఈ రష్‌లో ఎగుమతి చేయడం అంత తేలిక గాదు" అన్నాడు మరియొక స్నేహితుడు. ఇంతలో గార్డు విజల్ ఇచ్చి పచ్చజెండా ఊపేడు. రైలు 'ఈ జనాన్ని మోయలేనో' యన్నట్లు ఏడ్పువంటి ఓ అరపు అరచి చాలా కష్టంగా కదిలింది. రైలు

మోషన్‌లో మూర్తి స్నేహితు లందరికీ మరోసారి కరస్పర్శ చేసేడు.

"క్రొత్త ఆఫీసులో ఛార్జి తీసుకున్న తరువాత పరిస్థితు లెలా గున్నవీ వివరాలతో ఉత్తరం రాయరా" అన్నాడు ఓ స్నేహితుడు. ఇంతలో రైలు ప్లాటుఫారం విడిచి పెట్టింది.

మూర్తి రైల్లో తన సీటులో కూర్చున్నాడు. అతనికి రైలు స్నేహికూ లింకా జతపడలేదు – రైల్లో బాతాఖానీకి. ఓసారి తన ఆరు సంవత్సరాల ఖర్గపూరు ఉద్యోగానుభవాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. తను బి. ఏ. పాసయిన తరువాత రైల్వే ఉద్యోగానికి ఖర్గపూరుకు వచ్చేడు. ఈ ఉద్యోగంలో డిపార్టుమెంటు టెస్టులు పాసయితే వెంటనే ఉన్నత ఉద్యోగానికి ప్రమోషను దొరుకుతుంది. ఈ అవకాశాన్ని మూర్తి సద్వినియోగం చేయదలచి ఉద్యోగంలో ప్రవేశించి, నాటినుండీ ఈ టెస్టులకు కావలసిన పుస్తకములు సంపాదించి చదువు ప్రారంభించాడు. ఆ ప్రవాసాంధ్ర పట్టణములో తెలుగు విద్యార్థులకు మాతృభాషలో విద్యబోధించేఉపాధ్యాయులరు దగుటవలన మూర్తి కొంతమంది విద్యార్థులకు ప్రయివేట్లు కూడా చెప్పవలసి వచ్చింది. ఇది కేవలం ప్రైవేట్ల వల్ల రాబడి మోజు కాదు మూర్తికి. తన దగ్గర చదువు కుంటా నన్న వాళ్ళను కాదనలేక మాత్రమే. మూర్తివద్ద చదువుకొని ఆంధ్రా యూనివర్సిటీ మెట్రిక్యులేషను పరీక్షకు వెళ్ళిన విద్యార్థుల ఫలితాలు బాగుండుట చేత మూర్తి ప్రయివేట్ల గిరాకీ చాలా హెచ్చుగానే ఉండేది. వాటితో పాటు మూర్తి ఈ ఆరు సంవత్సరాల్లో నూతన డిపార్టుమెంటు టెస్టులు పాసై తత్ఫలితంగా ఎకౌంటెంటుగా ప్రమోషను పొందేడు. ఇప్పుడు ఈ ప్రదేశాన్ని విడిచి బదిలీమీద మరొక స్థలానికి వెళుతున్నాడు. అచ్చట పరిస్థితులు ఎలా ఉంటాయో! వాస్తవానికి మూర్తి ఖర్గపురంలో తన ఆరు సంవత్సరముల అనుభవంతో ఓ విధంగా ఎడ్జష్టయ్యాడు. ఇప్పుడు మరొక చోటికి బదిలీ అంటే కొంచెం కష్టంగానే ఉంది అతనికి, గాని ప్రమోషను మానలేడు. అంతే గాదు, ఈ రేంకు వచ్చిన తరువాత ఒక చోట ఖాయంగా ఉంచరు. తరచు బదిలీలు చేస్తూనే ఉంటారు. ఈ ఊహల తరువాత ఇంకోటి జ్ఞాపకం వచ్చింది మూర్తికి. తల్లి దండ్రులు తన పెండ్లి ప్రసక్తి తెచ్చినప్పుడల్లా తన డిపార్టుమెంటు టెస్టు లయ్యేవరకూ తను పెళ్ళి చేసుకోనని నెట్టివేశాడు. ఇప్పుడు ఆ టెస్టుల అడ్డు తీరింది. అంతేగాదు, వాటి ఫలితంగా ప్రమోషను కూడా దొరికింది. ఇప్పుడు గృహస్తు అవడంలో అభ్యంతరం లేదు. ఈ ఊహతో మూర్తి కొంచెం అనుభవములేని ఉద్రిక్తం




పొందేదు; తెలియకుండా మనస్సు సిగ్గుపడింది.

2

ఉదయం సుమారు ఎనిమిదిన్నర గంట లయింది. రైలు బిలాస్‌పూర్ చేరుకుంది. మూర్తి ఓపిగ్గా నిరీక్షిస్తున్న తన గమ్యస్థానం చేరేదు. కంపార్టుమెంటు తలుపు తీసి ప్లాటుఫారం ఓ సారి చూచాడు. తనకు తెలుసున్న ముఖాలు ఏవైనా కనిపిస్తాయా అనే ఆశతో. పరాయి రాష్ట్రంలో అందులోనూ క్రొత్త ప్రదేశంలో అంత సులువుగా ఎవరు తటస్థిస్తారు ? డిష్ట్రిక్టు ఇంజనీరుకు ఒక ఉత్తరం మాత్రము వ్రాసేదు తను ఆవేళ మెయిలులో వస్తున్నట్లున్నూ, ఛార్జి తీసుకుంటున్నట్లున్నూ. అయితే మాత్రం ఇంజనీరు తను గురించి

నుకు వస్తాడా ? ఓ కూలీని పిలిచి తన సామాన్లన్నీ రైలులోనుండి ప్లాటుఫారం మీదికి దింపించాడు. ఇంతలో ఎవరో వ్యక్తి ముందు నిలబడి మూర్తి ముఖంలోకి చూచి చిన్న చిరునవ్వు విసరేదు, పలకరిస్తున్నట్లు వ్యక్తపరుస్తూ. ఆ నవ్వు అతనికి స్వతస్సిద్ధంగా వచ్చింది మాత్రం కాదు. మూర్తి ఆ వ్యక్తి ముఖంలోకి చూచాడు. మూర్తి గుండె కొద్దిగా హెచ్చుస్థాయిలో కొట్టుకోవడం మొదలు పెట్టింది. ఆ వ్యక్తేనా?...అప్రయత్నంగానూ తలవని తలంపు గానూ తారసిల్లిన ఆ చూడగానే మూర్తికి నాలేళ గిన ఓ సంఘటన జ్ఞా

మూర్తి 'శేఖరం' అనే గుమస్తాగారి ఇంట్లో ఆయన కుమార్తె 'వసంత' అనే అమ్మాయికి ప్రయివేటు చెప్పేవాడు. వసంతకు అప్పటికి సుమారు పదహారేండ్ల వయస్సు. ఆమె పసిడివన్నె గల్గి గులాబీరేకల వంటి లేత చెక్కిళ్ళు, తామరరేకల వంటి చక్కటి విశాల నేత్రాలు, ఏపుగా పెరిగిన ముంగురులతో ఆమె చాలా అందంగా ఆకర్షణీయంగా ఉండేది. అంద చందాలకి తోడుగా భగవంతుడు ఆమెలో తెలివితేటలూ, చలాకీతనం కొంచెం హెచ్చుపాళ్ళే కూర్చేడు. ఆమె ఎనిమిదవ తరగతి వరకూ స్కూలులో చదివింది. ఆ తరువాత ఆమె యుక్త వయస్కురాలైనతరువాత కారణాంతరాలచేత తండ్రి స్కూలు మాన్పించి ఇంట్లో ప్రయివేటు చదివించేవాడు. మూర్తి ప్రయివేటు చెప్పే ప్రావీణ్యత గురించి ఆ ప్రాంతంలో మారుమ్రోగే ఆ సమయంలో శేఖరంగారు మూర్తిని తన ఇంటికి వచ్చి తన కుమార్తెకు ప్రైవేటు చెప్పవలసిందిగా కోరి నియమించేరు. మూర్తి సాయంకాలం ప్రతి రోజు ఓ గంట వాసంతికి ప్రయివేటు చెప్పేవాడు. ప్రతీరోజు మూర్తి రావడం పాత పాఠాలు అడగడం, క్రొత్త పాఠాలు బోధించటం, లెక్కలు చేయటం ఆ తరువాత టైము ప్రకారము ముగించి వెళ్ళిపోతూ ఉండేవాడు. వసంత తెలివైనదగుటచేత పాఠాలు బోధించుటకు మూర్తికి హెచ్చు టైము పట్టేది కాదు. తన ఇంటి వద్ద ఇంకా చాలామంది విద్యార్థులు నిరీక్షిస్తుండటంచేత కాలాన్ని వృధా పుచ్చకుండా వసంత పాఠాలు ముగించి వెళ్ళిపోయేవాడు. వసంత తెలివి తేటలు జూచి మనస్సులోనే మెచ్చుకొనేవాడు. అంతేగాని ఆమె అందాన్ని కళ్ళారా చూచి ఆనందించిన పాపాన్నెరుగడు. గాని కొన్నాళ్ళ తరువాత మూర్తి వసంత ఇంటికి వచ్చేటప్పుడూ తిరిగి వెళ్ళేటప్పుడు దారిలో కొంతమంది స్ట్రీట్ రోమియోలు ఇతన్ని దెప్పుతుండేవారు ఇన్‌డైరెక్టుగా. ముందులో కొన్నాళ్ళు అర్థం చేసుకోక అర్థమైన తరువాత వాళ్ళతో పేచీ పెట్టుకోవడం ఇష్టంలేక మూర్తి తల వంచుకొని వెళ్ళిపోతూండేవాడు. ఆ మాటలు మూర్తికి ఇంకా జ్ఞాపమున్నాయి. "మంచి లక్కీ ఛేన్సురా వీడిది; ప్రైవేటు చెపుతున్నాడురా; అన్ని చదువులూ నేర్పుతున్నాడు రా? తిరిగి ప్రయివేటు ఫీజు కూడానుటా; 'నీవును బ్రహ్మచారివి, నేనును అవివాహితురాలను' అని శ్రీనాధుడు పార్వతీ కళ్యాణంలో వ్రాసినట్లు ఇద్దరు బ్రహ్మచారులేగా!" అని ఆ స్ట్రీటు రోమియోలు ఒకరి తరువాత మరియొకరు క్రమంగా ఒక్కొక్క చరణం పూర్తి జేసేవారు. ఈ మాటలు మూర్తి హృదయానికి ములుకుల్లా గుచ్చుకొనేవి. కాని ఏమి చేస్తాడు? వీళ్ళకు జడిసి ప్రయివేటు

యువ

చెప్పడం మాని వసంతను నట్టేట్లో విడవ లేదు గదా? ఓపిగ్గా రోజులు గడచి పోతున్నాయి. అప్పటికి సుమారు నెల రోజు లున్నాయి వసంత పరీక్షలు. మూర్తికి ఆరోగ్యం సరిలేక నాల్గు రోజులు వసంత ఇంటికి ప్రయివేటుకు వెళ్ళలేదు. ఐదవరోజు ఆఫీసునుండి తిన్నగా వసంత ఇంటికి వచ్చాడు. ఇల్లు తాళం వేసుంది. ప్రక్కింటావిడ వీధిలో నిలబడి ఉంది. ఆమెను అడిగేడు మూర్తి, ఏమండీ! శేఖరం గారు ఊరికి వెళ్ళేరా? ఎప్పుడు వస్తారో మీకు తెలుసా?"

"ఊరికి వెళ్ళారు నాయనా! ఇంక వస్తా రని అనుకోను. ఇంక వాళ్ళను మరచిపో!" అంటూ నిర్లక్ష్యంగా ఆమె ఇంట్లోకి వెళ్ళిపోయింది. అంతేగాదు ఆమె జవాబులో ఏదో హేళనకూడా వ్యక్తమయ్యింది. మూర్తి మనస్సు చివుక్కుమంది. కాని 'ప్రపంచము త న్నెందుకు అర్థం చేసుకోవడంలేదో, ఇంత గుడ్డిగా ఎందుకు ఆరోపిస్తుందో, తెలియక బాధపడ్డాడు. కనీసం శేఖరం గారి కుటుంబానికి తనప్రవర్తన పూర్తిగా తెలుసు. వాళ్ళయినా తనకు చెప్పకుండా ఎందుకు వెళ్ళిపోయారు? బహుశా వసంత తల్లిదండ్రు లేమైనా అనుమానిం చారా? అలా అనుమానించడానికి ఆస్కారం కలిగేటట్లు త నెప్పుడూ ప్రవ ర్తించలేదే? జవాబు లేని ఈ సమస్యను మనసులో చర్చించుకుంటూ ఇంటికి వెళ్ళి పోయాడు మూర్తి...' ఇదంతా కళ్ళకు కట్టినట్టు అయింది మూర్తికి. ఈయన ఆ శేఖరంగారే! వీ రెందుకున్నారు ఇక్కడ? తనగురించి స్టేషనుకు వచ్చారా లేక ఇంకేమైనా పనిమీద వచ్చి తన్ను చూడగానే పలకరించారా? ఈ ఊహలతో మూర్తి ఉక్కిరిబిక్కి రవు తున్నాడు.

ఆదే సమయంలో శేఖరం కూడా మనస్సులో ఏదో బాధపడుతున్నాడు. మూర్తిని చూడగానే గతించిన సంఘటన జ్ఞాపకానికి వచ్చింది. తనకుమార్తె వసం తకు మూర్తి ప్రైవేటు చెప్పేవాడు.కొన్నా ళ్ళతరవాత ఒక బహిరంగలేఖ వచ్చింది శేఖరానికి. అందులో మూర్తి వసంతలు ప్రైవేటు సాకుతో రోజూ కలుసుకొని ప్రణయ కలాపములు జరుపుతున్నట్లూ వెంటనే మేల్కొనకపోతే పిట్ట లెగిరి పోవచ్చని హెచ్చరికతో వ్రాసిఉంది. ఆవేళ శేఖరం తన భార్యను పిలచి మూర్తి వసంతల ప్రవర్తన గురించి ఆమె అభిప్రాయా న్నడిగేడు నిలదీసి. మూర్తి చాలా బుద్ధిమంతు డనీ వసంతని సరిగా కన్నెత్తయినా చూడ డనీ, తల వంచుకొనే పాఠాలు చెప్పడం ఆమె గమనిస్తున్నట్లు, మూర్తిని ఎల్లప్పుడూ ఓ కంటితో కనిపెట్టే చూస్తున్నట్లు, ఎట్టి చెడు ప్రవర్తనా లేనట్టు భర్తకు చెప్పింది. ఏమీ లేకపోతే తనకు ఉత్తరం ఎందుకు అలా వస్తుం దనీ, నిప్పు లేకుండా పొగ

రాదనీ, తనముందు ఎవరూ ఏమీ అనక పోయినా పరోక్షంగా లోకులు తన కుటుంబమును నీచంగా విమర్శిస్తున్నట్లూ భార్యను గర్జించాడు. ఆ కారణంచేత తన కుటుంబ గౌరవాన్ని దక్కించుకోవ డానికి కలకత్తా హెడ్డాఫీసుకు వెళ్ళి తనకు ఖడ్గపూరునుండి బిలాస్‌పూర్‌కు గంటలమీద బదిలీ ఏర్పాటు చేసుకొని వచ్చేశాడు. ఆ మూర్తే మళ్ళా ఇక్కడ దాపరించాడు. మళ్ళా తన కుటుంబ గౌరవం ఇక్క డేమౌతుంది? శేఖరం తల గిర్రుమంది. తలపై వేయి సమ్మెట దెబ్బలు కొట్టుతున్న ట్లయింది. అంతే గాదు. శేఖరాన్ని ఇంజనీరు క్రితంరోజు పిలిచి 'మూర్తి' అనే ఎకౌంటెంటు మరునాడు మేలులో వస్తున్నట్లూ, ఆరుగురు గేంగు కళాసీలను స్టేషనుకు తీసుకువెళ్ళి ఎకౌంటెంటు సామాన్లు జేర వేయించమనీ, వచ్చిననాడు మాత్రం మూర్తికి ఆంధ్రుడగుటచేత శేఖరం ఇంట్లో భోజన మేర్పరచమనీ చెప్పేడు. ఇంజనీరు పంజాబీ యగుటవల్ల తన ఇంట్లో భోజనం కంటే శేఖరం ఆంధ్రు డగుటవల్ల శేఖరం ఇంట్లో ఏర్పాటు చేస్తే బాగుండునని ఇంజనీరు ముందు రోజు ఆదేశించుటచేత ఏర్పాట్ల బాధ్యత శేఖరం నెత్తిమీద పడింది.

## 3

''మీరా ఇక్కడ ఎకౌంటెంటుగా వస్తున్నది? మూర్తి అంటే ఎవరో అనుకున్నాము! నేను డిస్ట్రిక్టు ఇంజనీరు ఆఫీసులో హెడ్‌క్లర్కుగా ఉన్నాను. ఇంజనీరుగారు మిమ్మల్ని రిసీవ్ చేసుకో డానికి పంపించారు" అన్నాడు శేఖరం.

"అవునండి నన్నే పోష్టు చేసేరు ఇక్కడ. రైల్వేక్వార్టరు నాకు ఏదైనా ఏర్పాటు చేసేరా?"

"ఎకౌంటెంటు గురించి ప్రత్యేకింప బడిన బంగ్లావుంది. నిన్న బాగు చేయిం చాము... ఓరేయ్! సత్యం, వెంక ట్రావు! మీరు సామాన్లు బాబుగారి బంగ్లాకు చేరవేయండి. ఇదిగో తాళంచెవి; మేము ఇంటికి వెళ్ళి వస్తాము."

''క్షమించండి. నా గురించి మీ రేమీ అనవసరపు శ్రమపడవద్దు. నేను హోటల్లో భోజనం చేస్తాను. కాస్త శుభ్రమైన హోటలు ఇక్క డేముందో చూపించండి చాలు" అన్నాడు మూర్తి.

"తీరిగ్గా హోటలు చూచుకుందాం. ఈ వేళ మా యింట్లోనే ఏర్పాట్లు గావింప బడ్డాయి" అన్నాడు శేఖరం. ఈమాటలు చాలా బలవంతంగానే పెదిమలనుండి జారేయి. ఏ వ్యక్తికి భయ పడి తాను మరియొక చోటికి వెళ్ళి పోయాడో ఆదేవ్యక్తి మళ్ళా అక్కడ దాపరించాడు. ఇది నిజంగా శేఖరానికి 'మానే పుండు రేగినట్లు' బాధ కలిగింది. శత్రువుతో ప్రప్రథమంగా మాట్లాడిన రీతిగానే మాట్లాడుతున్నాడు శేఖరం. నోరు అర్చుకు పోతోందికూడాను.




"ముందు రెస్టారెంటుకు వెళ్ళి కొంచెం కాఫీ త్రాగివద్దాం రండి" అన్నాడు మూర్తి.

సరే నన్నట్లు తల ఊపేడు శేఖరం. మూర్తి ముందు, వెనుక శేఖరం అనుసరిస్తూ రెస్టోరెంటులోనికి వెళ్ళారు, సామాన్లు కూలీలచేత పంపించివేసి.

బేరర్ వచ్చాడు 'ఏమికావాలి సార్ ?' అంటూ.

రెండుకాఫీలు తీసుకు రమ్మన్నాడు మూర్తి. బేరర్ కుకింగ్‌రూమ్‌లోనికివెళ్ళి పోయాడు కాఫీ కలిపి తేవడానికి. మూర్తి శేఖరంలు ఎదురూ బొదురుగా కూర్చొని మౌనంగా చూస్తున్నారు ఒకర్నొకరు.

మూర్తి మౌనాన్ని భగ్నం చేస్తూ "మీరు ఇక్కడ ఎన్నాళ్ళనుండి ఉంటున్నారు" అన్నాడు.

"నాల్గేళ్ళనుండి."

"ఇచ్చటవాతావరణంబాగుంటుందా?"

"చెప్పుకోతగ్గంత బాగా లేకపోయినా చెడ్డదికాదు."

"వసంత కులాసాగా ఉందా ? మెట్రిక్ పాసయిందా ? పెళ్ళి చేశారా ? ఏవూ రిచ్చేరు ? అత్తవారింట్లో ఉందా ? మీ ఇంట్లోఉందా ?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు మూర్తి.

"కులాసాగానే ఉంది మెట్రిక్ సెకండ్ డివిజన్‌లో పాసయింది. పెళ్ళి చేయడం, ఒక బిడ్డతల్లి గావడం, భర్త కర్మాగారంలో ప్రమాదంతో పోవడం అన్నీ జరిగిపోయాయి" అన్నాడు భగ్న హృదయంతో. తన హృదయంలో మాను పట్టిన గాయం రేగినట్లయింది, టాటా

కంపెనిలో అల్లుడు సూపర్‌వైజరు అని ఎంతో పొంగిపోయి హెచ్చు స్థాయిలో ఖర్చుచేసి పెళ్ళిచేశాడు కూతురికి. దుర దృష్టవశాత్తూ పెళ్ళయిన రెండవ ఏటికి ఒకబిడ్డ కలగడం, కూతురు వైధవ్యం పొందడంకూడా జరిగిపోయాయి. శేఖరం గుండెలు బరువెక్కాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. ఇంక మాట్లాడలేక పోయాడు.

ఎంతో సంతోషకరమైన జవాబులు వస్తాయనుకున్న మూర్తి ఈ జవాబులు విని నిలువెల్ల నీరైపోయాడు. అంతే కాదు. ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు. 'వసంత ఎంతో అందమైనది, తెలివైన దీను. ఆమెకు ఈ బాల్యవయస్సులోనే వైధవ్యమా ? ఇది నిజంగా భగవంతుని మాయా ? లేక ఆమె కర్మా ? అంత అందమైన ఆమె నుదుటకు పసుపూ కుంకుమా కొరతా ? ఇది కేవలం భగవంతుని ఈర్ష్యే! వసంత భర్త ఎవరో, ఎంతో అదృష్టవంతుడు. ఇంత అందగత్తె, బుద్ధిమంతురాలు, తెలివైనదీ భార్యగా పొందగల్గే వాడు నిజంగా అదృష్టవంతుడని ఊహించేవాడు మూర్తి, ఆమెకు చదువు చెప్పేరోజులలో. కాని మాయలేడిలా ముందుకు వచ్చిపారిపోయింది, ఆమెకు దాంపత్యఅసౌఖ్యం. విధి ఎంత బలవత్తరమైనదీ!' ఈ ఆలోచనలతో మూర్తిబుర్ర నిండిపోయింది.

ఇంతలో బేరర్ కాఫీ ట్రేతో తీసుకు వచ్చి ముందుంచాడు. ఇరువురకూ కాఫీ మీద మనస్కరించలేదు; కాని ఆర్డరిచ్చి వచ్చినతరువాత ఎలా త్రాక్కుండా ఉంటారు ? కాఫీ ఇరువురూ త్రాగుతున్నారేగాని దాని రుచి ఏమిటో ఎవరి జింహ్వాకూ అందలేదు. యాంత్రికంగానే కాఫీ త్రాగడం ముగించారు. శేఖరం బిల్లు ఇవ్వడానికి పర్సు తీయబోయాడు. మూర్తి ఆయన్ని వారించి తానే బిల్లుఇచ్చివేశాడు. ఇరువురూ రెస్టోరెంటునుండి బయటకు వచ్చారు.

"శేఖరంగారూ ! నన్ను క్షమించండి. నేను ఇప్పుడు మీ ఇంటికి రాలేను. మరొకరోజు లీజరు చూచుకు వస్తాను" అన్నాడు మూర్తి ఏదో మానసికాందోళన వ్యక్తపరుస్తూ.

శేఖరం మూర్తి ముఖవర్చస్సును బట్టి అతనిలోని బాధను గమనించాడు. ఇంక బలవతం చేయడంకూడా అంత మంచిపని కాదనుకున్నాడు.

"మీ కభ్యంతరం లేకపోతే కేరీయరుతో భోజనం పంపిస్తాను. ఏర్పాట్లు అన్నీ చేసియుండుటచేత అమర్చినవి వృథాగా పాడవుతాయి, మీరు కాదంటే."

"అలాగే కానివ్వండి. నన్ను నా క్వార్టరులో విడిచి మీరు వెళితే బాగుంటుంది, నాకు లొకేషన్ చూపించి."

"అలాగే వెడదాం."

ఇద్దరూ మూర్తి బంగ్లాకు వెళ్ళేరు. కళాసీలు సామాన్లు అమర్చుతున్నారు

బంగ్లాలో. మూర్తి దగ్గర శెలవు తీసుకొని శేఖరం తన ఇంటికి వెళ్ళిపోయాడు.

## 4

గడియారం 11 గంట లైనట్లు జ్ఞాపకం చేసింది. మూర్తి ఆఫీసుకు బయలు దేరాడు. ప్రయాణ బడలికచేత కాళ్ళు అలసటగా ఉన్నా ప్రమోషను మీద క్రొత్త ఆఫీసుకు వెళ్ళడంచేత ఉత్సాహం గానే పడుతున్నాయి అడుగులు. వెంట కళాసీ ఆఫీసుకు మార్గం చూపుతూ నడు స్తున్నాడు. పదిహేను నిముషాల్లో ఆఫీసు చేరుకున్నాడు మూర్తి. ముందుగా ఇంజ నీరుగారి ఛాంబరులోకి వెళ్ళి విష్‌చేసి తనని తాను ఇంట్రడ్యూస్ చేసుకున్నాడు.

ఇంజనీరుకూడా సంతోషాన్ని తెలు పుతూ కరస్పర్శ చేసి ముందుగా ఉన్న కుర్చీ చూపించి కూర్చోమన్నారు. కృత జ్ఞత తెలుపుతూ కుర్చీలో కూర్చున్నాడు మూర్తి. ఇంజనీరు కాల్ బెల్ నొక్కేరు. ప్యూను వచ్చి సెల్యూట్ చేశాడు. హెడ్ క్లర్కు శేఖరంగార్ని పిలవ మని ఆజ్ఞా పించారు.

"చిత్తం సార్!" అంటూ ప్యూను వెళ్ళిపోయాడు. మరుక్షణంలో శేఖరం లోనికి వచ్చి ఇంజనీరుగార్కి విష్ చేసి నిలబడ్డాడు. ఇంజనీరు శేఖరానికి మూర్తిని పరిచయం చేస్తూ "మీ రుదయం కలుసు కున్నారా?" అని ప్రశ్నించారు.

"మీ ఆదేశానుసారము ఉదయం స్టేషనుకు వెళ్ళి రిసీవ్ చేశాను. అంతే గాదు మూర్తిగారు నాకు చిరపరిచితులే" అన్నాడు శేఖరం.

శేఖరంగారు చాల మంచివా రని, అను భవ శాలు రని, ఆఫీసుపనిలో చాల సహాయకరంగా ఉంటా రని మూర్తికి శేఖరాన్ని గురించి చెప్పేరు ఇంజనీరు. శేఖరంగారి సహాయంతో ఆఫీసు వాతా వరణం చూసి మళ్ళావస్తా నని ఇంజనీరు వద్ద శెలవు తీసుకొని శేఖరంగారితో ఆఫీసు హాలులోనికి వచ్చాడు మూర్తి. శేఖరం హాలుమధ్యలో ఉన్న టేబులూ, కుర్చీ మూర్తికి చూపి "ఇదే మీ సీటు" అన్నాడు.

"దయచేసి గుమస్తాలు ఎవరెవరు ఏ ఏ సీటుల్లో ఉండేదీ, వాళ్ళపేర్లూ, పని వివరాలూ తెలియజేస్తారా?"

"నిరభ్యంతరంగా" అంటూ శేఖరం మూర్తిని ఒక్కొక్క గుమస్తావద్దకు తీసుకువెళ్ళి, వాళ్ళ పేర్లూ చేసే పని వివ రాలూ చెపుతున్నాడు. మూర్తి ఆ గుమస్తా లతో కరస్పర్శ చేసి వాళ్ళ సహకారాన్ని కోరుతూ తన సహకారం వాళ్ళకెప్పుడూ లభిస్తుం దని హామీ ఇచ్చేడు. అలా అందరి గుమస్తాల పరిచయానంతరం హాలులో ఓ మూలగా అమర్చి ఉన్న టైపిస్టు సీటుకి వెళ్లేడు. వీరుసమీపించ గానే లేడీ టైపిస్టు నిలబడి మూర్తి నుద్దే శించి "నమస్కారం మాష్టారు" అంది.

మూర్తి తన కళ్ళను తను నమ్మలేక

పోయాడు. అది నిజమా లేక ఏదైనా కలా అనిపించింది.

"ఈమె మీ వసంతగదండీ!" అప్రయత్నంగా మూర్తి పెదవులనుండి దొర్లి పోయాయి ఈ మాటలు.

"ఔను. మా అమ్మాయే!" అన్నాడు శేఖరం.

ఈమెను టైపిస్టుగా పనిచేయిస్తున్నారా?"

"అది ఆమె కోర్కె."

"మీరు కూర్చోండి" అన్నాడుమూర్తి వసంతతో.

మూర్తి, శేఖరం అచ్చటినుండి ఎక్కౌంటెంటు సీటుకు వెళ్ళేరు. మూర్తి తన కుర్చీలో కూర్చున్నాడు. శేఖరం ఆఫీసు విషయాలు కొన్ని ముఖ్యమైన స్టేటుమెంట్లు, బిల్లులు వాటిని నిర్వర్తించే గుమస్తాల స్వభావాలు తదితర విషయాలు కాస్త మూర్తికి వివరించాడు. ఆ తరువాత శేఖరం సీటుకి వెళ్ళి తనపనిలో నిమగ్నుడైనాడు. మూర్తి ట్రేలో ఉన్న కేసులు ముందుకు తీసుకొని పైనున్న కేసు చూడడం మొదలుపెట్టేడు. కేసు చాల పెద్దది. మొదటినుండి అన్నికాగితములూ స్టడీ చేయాలి. అందుకు వ్యవధీ ఓపికా రెండూ అప్పట్లో తక్కువగా ఉన్నందున ఆకేసు ఇంటిదగ్గర తీరికగా స్టడీచేద్దామని ఓ ప్రక్క పెట్టేడు. అదేవిధంగా పెద్ద కేసు లన్నీ తీరికగా స్టడీ చేయడానికి ఓ ప్రక్కనుంచి, చిన్నచిన్న కేసులు రొటీనుపేపర్సు సంతకాలు పెట్టి పాసు చేసేసాడు. ఆ తరువాత ఒక కేసు తీసుకొని స్టడీ చేయడం మొదలు పెట్టేడు. తన ఆలోచనలు ఆ కేసునుండి ఎక్కడికో ఎంతోదూరం పారిపోతున్నాయి. ఆ పారిపోతున్న ఊహలకు తటాలున అడ్డుతగిలింది వసంత విగ్రహం.

"తనదగ్గర చదువుకునే రోజుల్లో వసంత అపురూపసుందరి. అప్సరసలా ఉండేది. తెలివితేటలకు మేటి...గాని నేటి వసంత ఆ వసంతకాదు. భౌతిక అకారంమాత్రమే ఆమెది. ముఖంలో అప్పటికళలు లేవు. ఆ మిసమిసలాడే ఆమెలోని యౌవనసౌందర్యం నేడు మసిపూసిన మారేడుకాయలాఉంది. ఎంతో ఉత్సాహంగా త్రుళ్ళుతూండే వసంత నేడు ఏదో మౌనమూర్తిలా ఉంది. ఆమె విశాల నేత్రాలకు కాటుక దూరమైంది. ఆమె నుదుటికి కుంకుమబొట్టుకరువైంది. గులాబిరేకులవంటి ఆమె చెక్కిళ్ళకు పసుపు పూసుకొనే అర్హతలేదు. స్త్రీకి జన్మహక్కని రుజువు చేసే గాజులులేవు ఆమె చేతులకు. ఆమె జీవితమే మోడు అయింది, రెండు దశాంశముల వయస్సు

లోనే ఆమె నాల్గవదశలో అడుగిడి వైరాగ్యా న్నవలంభించవలసివచ్చింది. బాధ్యతా రహితంగాను గారాబంగా పెరిగే నాటి వసంతను నేడు ఒకవైపు సంసారబాధ్యతా రెండవవైపు ఉద్యోగ బాధ్యతా కావడికుండల్లా ఆమె భుజాన్ని వ్రేలాడుతూ భూమిలోకి కృంగదీస్తు న్నాయి. పాపంఈమెకుఒకబిడ్డఅనికూడా శేఖరంగా రన్నారే! ఆబిడ్డమీ దుండే మాతృవాత్సల్యాన్ని కూడా చంపుకొని గంటలకొలదీ ఆఫీసులో ఉండవలసిందే? బ్రహ్మఆమెలో సౌందర్యం, గుణగణాలు ఇమిడ్చి ఈ అయిదవ తనా న్నెలా లోపం జేశాడు? చిత్రకారుడు తను సృష్టించిన చిత్రాన్ని తానుచూసి మురిసి పోతాడు. ఇంకేమైనా లోపా లున్నా యా యని వెతికి ఆ లోపాలని సవరించడానికి ప్రయత్నిస్తాడు. కాని ఈ బ్రహ్మదేవుడు తనచేతుల్తో మానవులను సృష్టించి వాళ్ళకు ఏదో లోపాన్ని కావాలని కల్పిస్తాడు, మందమతివాడు. అందుకే "బ్రహ్మకు రిమ్మతెగు" లంటారు. "ఈ ఆలోచన లకు అవాంతరంగా ప్యూనువచ్చి "సార్! దొరగారు పిలుస్తున్నారు" అన్నాడు. మూర్తి ఊహాప్రపంచంలోనుండి వెల్వడి కంగారుగా లేచి ఇంజనీరు ఛాంబరులోకి వెళ్ళేడు.

"ఇది చీఫ్ ఇంజనీరు లెటరు. మనం బడ్జటు మోడిఫికేషన్సు పంపాలి. మరి నాల్గురోజులలో డేటాలుతీసుకొని జవాబు పంపించాలి. ఇది చాలా ముఖ్యమైనది. మీరు పెర్సనల్‌గా దాన్ని డిస్పోజు చేయా" అన్నారు ఇంజనీరు.

"అలానే సార్" అంటూ మూర్తి ఆ ఉత్తరం తీసుకొని తన సీటుకు వెళ్ళిపోయాడు. ఇంతలో గోడగడియారం ఐదుగంటలు కొడుతూ "ఇళ్ళకు పోవచ్చని" హెచ్చరించింది. ఆ హెచ్చరికతో చాలమంది గుమస్తాలు డ్రాయర్లకుతాళాలు బిగించి తమ సైకిళ్ళతాళాలు తీసి ఇళ్ళకు బయలుదేరేరు. బాధ్యతగుర్తించినవాళ్ళూ అర్జంటుకేసులు ఉన్నవాళ్ళూ లెక్కకు నలుగురో ఐదుగురో మిగిలేరు ఆఫీసులో. శేఖరం మూర్తివద్దకు వచ్చి ఈ వేళ్ళకు సరిపించండి పని. రేపు చూసుకుందాము. ఇప్పుడు మాఇంటి కెళదాము" అన్నాడు. ఇంజనీరుగారు జీపుమీద ఇంటికి వెళ్ళిపోయారు. వసంత తన సైపుమిషను అలమరాలో పెట్టించివచ్చి శేఖరంప్రక్క నిలబడింది.

"మీ ఇద్దరూ నడుస్తూండండి. నేను రెండుకేసులు డిస్పోజుచేసి వస్తాను."

"రేపటినుండి లెక్కలేనంతపనిచేయ వచ్చు. ఈ వేళకు కట్టిపెట్టండి. అలా

మా ఇంటికి వెళ్ళి అక్కడనుండి ఏ పార్కుకో వెళదాము'' అన్నాడు శేఖరం.

"బహుశా మనంటికి రావడం వారి హోదాకు తగ దనుకుంటున్నా రేమో'' అన్నది వసంత తండ్రితో.

"లేదు వసంతా! నా కలాంటి అభి ప్రాయం లేదు. నన్ను తప్పుగా అర్థం చేసుకోవద్దు" అంటూ లేచి వాళ్ళతో బయలుదేరాడు మూర్తి.

ముగ్గురూ శేఖరం ఇంటికి వెళ్ళారు. శేఖరంభార్య చిరునవ్వుతో ఆహ్వానించింది మూర్తిని. కుశలప్రశ్న లడిగి లోపలనుండి టిఫిను కాఫీ తీసుకొచ్చి టీపాయ్‌మీ దుంచింది.

"వసంతా! మీ పాప ఏదీ?"

ఇంతలో పాప వంటింట్లోంచి అమ్మమ్మ వండుతూన్న వేడి పకోడీలు తింటూ రెండు గుప్పిట్లతో కొన్ని పకోడీలు పట్టుకొని ఈ ముగ్గు రున్న హాలులోనికి వచ్చింది. వసంత పాపను చేతులలోకి తీసుకొని "అమ్మా మాష్టరు గారికి దణ్ణం పెట్టమ్మా!" అంటూ మూర్తిని చూపించి దణ్ణం పెట్టమని దగ్గరకు తీసుకొచ్చింది. పాపను మూర్తి తన చేతులలోనికి తీసుకొని పాపకు రెండు బుగ్గలమీదా ముద్దులవర్షం కురిపించాడు. "ఏదమ్మా పాపా! నా కో పకోడీ ఇవ్వవూ?"

"అబ్బా! నాదా!" అని వెనక్కు త్రిప్పుకుంది చేతుల్ని పాప.

"ఇంత చిన్న వయస్సులో తండ్రి దూరమై మూడోయేడు ఆ ముక్కుపచ్చ లారని బిడ్డకు, ఆమె పెద్దదయి, ఓ ఇంటి దయేవరకూ ఆమె ఎన్ని ఇక్కట్లు పడాలో? ఆమెను పెంచడానికి ఆతల్లి ఎన్ని బాధలకు లోనవ్వాలో? కనీసం కన్న తల్లయినా దిన మంతా చేరదీయడానికి చెంత నుండదే! ఎంత దురదృష్టవంతు రాలు. ఒక్కొక్కరి జీవితమే ఇలా ఎత్తు పల్లాలతో ప్రారంభిస్తుంది. వారు జీవిత గ్రమ్యస్థానా న్నెలా చేరతారు?" మూర్తి బుర్ర తిరిగిపోయింది ఈ ఊహలతో.

"బాబూ టిఫిన్ తీసుకోండి. కాఫీ కూడా చల్లారి పోతుం"దని వసంత తల్లి హెచ్చరించగానే మూర్తి ఊహలలో నుండి తేరుకున్నాడు. శేఖరం ఓ ప్లేటుతో పకోడీ మూర్తి కందించి మరియొక ప్లేటుతో తాను తీసుకున్నాడు. టిఫిన్ తిని కాఫీ త్రాగి సోఫాలో కొంచెం విశ్రాంతి తీసుకున్నారు. కొద్దినిముషాలు మౌనంగా గడిచిపోయాయి.

"వసంత జీవితం ఇంత స్వల్ప వ్యవధిలో అలా చీకటైపోతుం దని కలలోకూడా అనుకోలేదండీ."

"ఎవరి అదృష్టానికి ఎవరు కర్తలు నాయనా? పుట్టెడు ఆశలతో ఉంటే

మా ఆశలు నిరాశ జేసి దాన్ని అంధ కారంలోకి త్రోసి తాను స్వర్గానికి పోయాడు" అంది కళ్ళనీటిని కొంగుతో తుడుచుకుంటూ వసంత తల్లి.

"బిడ్డలను కన్నాముగాని వాళ్ళ అదృష్టాన్ని కనలేదుగా మనం. మన చేతులో ఏమీలేదు" అన్నాడు వైరాగ్యంగా శేఖరంగారు.

"ఆమె ఒక్కతే మీకు బరువై పోయిందా? ఆమెను పెంచలేకే ఉద్యోగములో చేర్చారా?" అన్నాడు ఏదో తెలియని బాధను వ్యక్తపరుస్తూ మూర్తి.

"నేను చిలక్కు చెప్పినట్లు చెప్పే వండి. నామాట వింటేనా? గత ఆరు నెలలనుండి ప్రతీ ఎడ్వర్టయిజుమెంటూ చూచి అప్లికేషనులు పెట్టుకుంది. ఆఖరుకు ఈబాధ భరించలేక మన ఇంజనీరుగారితో చెప్పి ఫిమేల్ కళాసీగా వేయించి టైపిస్టు ఖాళీలో పని చేయిస్తున్నాను; నా పలుకుబడిని బట్టీ ఇంజనీరుగారి మంచితనాన్ని బట్టీను. వాటికి సాయంగా మనఆఫీసులో టైపిస్టు ఖాళీ మూడు నెలలనుండి పడిఉంది. సర్వీసు కమిషనునుండి కేండిడేట్సు రావడంలేదు."

ఇప్పుడు నిజంగా తల ఖండించిన ట్లయ్యింది మూర్తికి, మెట్రిక్ పాసయిన వసంత ఫిమేల్ ఖళాసీగా ఉద్యోగం చేయడమా యని

"ఏం చేయమంటారు మాష్టారు. నా బ్రతుకే కారుచీకటై పోయింది. మావారు పోయేప్పటికి వారి సర్వీసు చాల తక్కువగుటచేత ప్రావిడెంటుఫండు చాల తక్కువ వచ్చింది. ఇన్సూరెన్సు ఐదారువేల రూపాయల కుందంటే వారి దగ్గరవాళ్ళు తమకు కూడా వాటా రావాలని పేచీకి వచ్చేరు. నా ఈ వయస్సులో భర్తను కోల్పోయి ఉండగా నా జీవితం ఇంకా ఎన్నో సంవత్సరాలు గడవాలి. అవి ఎలా గడుస్తాయని కనికరం లేకపోయింది వాళ్ళకు. కనీసం నా కసిగండైన బిడ్డనుజూచైనా వారికి జాలిలేక పోయింది. ఆ ఇన్సూరెన్సు సొమ్ములో వాళ్ళకు వాటా ఇవ్వని పక్షములో ఆసొమ్ము రాకుండా చేయడానికి కూడా వడిగట్టేరు. పైగా ఆసొమ్ము నేనూ మా నాన్నా వృధాగా పాడుచేసి ఆబిడ్డకు అన్యాయం చేస్తామని కూడా ఆరోపించారు. ఆఖరుకు కొందరు పెద్ద మనుష్యులద్వారా చెప్పించగా ఆసొమ్ము ఈ పాపపేరున బేంకులో వేసి పాప మైనారిటీ తీరిన తరువాత పాపకుహక్కు చెందేలా ఏర్పాటు చేయవలసివచ్చింది. నాన్న శక్తికి మించి నా పెళ్ళి చేసేడు. నా దురదృష్టవశాత్తూ నేను సుఖాన్ని పొందలేదు. వాళ్ళకూ సంతోషా న్నియ లేకపోయేను. నా పెళ్ళికి చేసిన అప్పులు నాన్న ఇంకకొన్ని తీర్చలేదు. నాన్న ఒక్కడి రెక్కల ఆదరువుపైన సమస్త

కుటుంబమూ బ్రతకాలి. అంతేకాదు. నా తరువాత నల్గురు చెల్లెళ్ళు. వాళ్ళకుకూడా తగిన విధంగా పెళ్ళిళ్ళు చేయాలి. నాన్న ఎన్నాళ్ళు కష్టపడి ఈ కుటుంబాన్ని పోషిస్తూ ఇవి తట్టుకోగలడు? అదేగాక నాకూ్కడా అస్తమానూ ఇంట్లో ఉండడానికి తోచడంలేదు. ఆఫీసుకు వెళితే కొంత కాలక్షేపం జరుగుతుంది. కనీసం నామానసిక బాధనైనా ఆఫీసులో నున్నంతకాలం మరచిపోగలను"

వసంత చరిత్రను తలచుకొని మూర్తి ఏదోబాధా, ఆవేదనా పొందేడు లోలోపల వసంత పెళ్ళి, ఆ తరవాత పురుడూ, తరువాత వైధవ్యం వరుస ఘట్టాలుగా మూర్తి కళ్ళముందు ప్రత్యక్ష మయ్యాయి. ఏదో తన ఆత్మీయురాలుకు, తన కుటుంబములోనే ఈ విపత్తు సంభవించినట్లుగా ఆందోళన చెందేడు. వాస్తవానికి శేఖరం గారింట్లోని సంఘటనైనా సంవత్సరాలు దొర్లిపోవడంచే ఆవిచారం వాళ్ళదృష్టిలో మంచి కొంత అడుగుబడింది, కాని మూర్తి దృష్టిలో ఈవేళే సంఘటన జరిగినట్లు బాధపడ్డాడు. అవును తన దృష్టిలోకి ఈ విషయం ఈవేళేగా వచ్చింది!

"ఈపూట ఇచ్చటే భోంచేసి మీ బంగ్లాకు వెళ్ళి విశ్రాంతి తీసుకుందురు గాని" అన్నాడు శేఖరం.

"వద్దండి, మీ రనవసరముగా నా గురించి శ్రమ తీసుకోవద్దు. నేను అలా టౌనులోకి వెళ్ళి ఏదైనా హోటలు శుభ్రమైంది వెతుక్కుంటాను."

"ఏమి నాయనా! ఓ పూట భోజనం పెట్టే తాహతే లేదా మాకు? లేక మా ఇంట్లో భోంచేస్తే ఏమైనా నా మొషీయా!" అంది శేఖరం భార్య.

"మీ రంత దూరంగా ఆలోచిస్తే వేనేం చేయలేను. మీ ఇష్టప్రకారం కానీయండి."

## 5

రోజులు గడిచిపోతున్నాయి. మూర్తీ శేఖరం, వసంతలు ప్రతి దినం ఆఫీసులో తమ ఉద్యోగరీత్యా కలసుకుంటున్నారు. గానిఏమిప్రత్యేకతలేదు. వసంతఉదయం పది గంటలకు టైపురైటరు ముందు కూర్చుంటే సాయంకాలం ఐదు గంటల వరకూ ఎంతో ఓపికగా పని చేస్తుండేది. గాని ఆమె టైపు చేస్తే ఉత్తరాలకు మూడురెట్లు ఉత్తరాలు టైపుకు వస్తున్నాయి. ఒక్క ఎస్టిమేటు స్టేటుమెంటు టైపు చేస్తుంటే ఆ అంకెలు టైపు చేసే టప్పుడు కళ్ళు చెమ్మగిల్లిన సమయం లేక పోలేదు. మూర్తి ఎకౌంటెంటుగా వచ్చిన తరువాత టైపుపని మరీ విపరీతంగా పెరిగిపోయింది.

"ఇంతకుపూర్వము ఎకౌంటెంటు పని చేయలేదూ? అప్పుడు టైపుకు ఇన్ని ఉత్తరములు ఉండేవి గావు. ఇప్పుడు వీరి హయాంలో టైపిస్టును వేధించుకు తినడానికి పూనుకున్నట్లుంది. ఆయన

మాటల్లో నేను ఉద్యోగం చేయడం ఇష్టం లేనట్లు కనబడింది. బహుశా నాకు ఊపి రాడకుండా పని కల్పిస్తే నేను భయపడి ఉద్యోగం మానేస్తాననో లేక పని సకాలంలో కాకపోతే చేతకాని దాన్నని ఇంటికి పంపొచ్చనో వారి ఉద్దేశం? అని ఆలోచింపసాగింది వసంత.

ఓపిగ్గా ఇంకో నాల్గు రోజులు గడిపింది. కాని ఆమె చేయవసిన పని తరగడం లేదు. నాడు ఐదు గంటలవరకూ టైపు చేసింది. ఆమె ఓర్పు సడలిపోయింది. ఆఫీసు పలచబడింది. చాలా మంది గుమస్తాలు ఇళ్ళకు వెళ్ళిపోయారు. మూర్తి ఏదో కేసు చూస్తున్నాడు తన సీటులో. వసంత మూర్తి దగ్గరకు ఎదురుగా వచ్చి టేబులు నాని నిలబడింది.

"క్షమించండి" మిమ్మల్ని డిస్టర్బు చేస్తున్నాను. మీరు వచ్చినప్పటినుండీ ఎంతో ఎక్కువ పని చేస్తున్నాను. టైపు చేయవలసిన కాగితములు తరగడంలేదు. నేను ఒక్క నిమిషంకూడా వృధా చేయకుండా పని చేస్తున్నాను. గాని నాకు తృప్తి లేదు. బహుశా అధికారులకు కూడా సంతృప్తి నీయలేక పోతున్నా



నేమో ! రాళ్ళవర్షంలా పడుతోంది మీరు సృష్టించే పని. దానికి తట్టుకోలేను. మీకు ఇష్టం లేకపోతే ముఖా ముఖీగా చెప్పండి. నేను ఉద్యోగం విరమించు కుంటాను.

మూర్తి చేతిలోని కేసు టేబులు మీద పెట్టి ఆమె ముఖంలోకి చూచాడు. ఆమె ముఖం వాడిపోయి ఉంది. కళ్ళు చెమ్మగిల్లేయి. కంఠం బొంగురిల్లింది, మాట్లాడుతుంటే.

"అలా కుర్చీలో కూర్చో వసంతా".

"థేంక్సు" కుర్చీలో కూర్చుని అంది. శేఖరం గారు ఇది చూచివచ్చి ప్రక్కన ఉన్న కుర్చీలో కూర్చున్నారు."

"ఇప్పుడు చెప్పండి. మీరు చెప్ప వలసిం దంతా."

"ఈ ఆఫీసుకు రెండు టైపిస్టుల పోస్టు లున్నాయి, కాని టైపిస్టులు లేరు. సర్వీసు కమీషన్‌కు రిక్విజిషన్ వెళ్ళింది. కాని మనుషుల్లేరు. నేను టైపు రైటింగు నేర్చుకొని ఉండడంవల్ల ఇంకా బాగా ప్రాక్టీసు చేసుకోవడానికి వీలవుతుం దనీ, తద్వారా ఆఫీసు పని కొంత అవడానికి అవకాశం ఉంటుందనీ మా నాన్న నాకు నచ్చచెప్పి చేరమన్నారు. అలాంటప్పుడు టైపిస్టుగానే ఎందుకు ఉద్యోగం వేయించ గూడ దంటే ఆ ఉద్యోగం వేయడానికి సర్వీసు కమిషనుకే హక్కు ఉంది గాని ఇంజనీరుకు పవరు లేదన్నారు. ఇంజ నీరుకు కళాసీలను భర్తీ చేయడానికే పవరు ఉందట. అందుచేత నన్ను ఫిమేలు కళాసీగా వేసి నాచేత టైపిస్టు పని చేయిస్తున్నారు. దానివల్ల కొంత నాకుకూడా లాభ మేమంటే టైపు పని నేర్చుకోవడం, గౌరవంగా టైపిస్టు పని చేయడం. కాని మీరు వచ్చిన తరువాత నుండి టైపు చేయవలసిన ఉత్తరాలు, స్టేటుమెంట్లుఅసంఖ్యాకమైపోతున్నాయి. ఈ పరిస్థితులలో ఇద్దరు టైపిస్టులు ఉన్నా ఈ పని చేయలేరు" అని తన ఆవేదన వెళ్ళగక్కింది వసంత.

"ఏమండీ శేఖరం గారు, ఈ విష యాలు నాతో ఒక్కసారీ చెప్పేరు గాదేం ? ఇద్దరు టైపిస్టుల ఖాళీ లు ఇన్నాళ్ళనుండి అలా ఉంటే ఎలా ఊరు కున్నారు."

"ఒక ఖాళీ సుమారు నాల్గు నెలల నుండి ఉంది. అపనే వసంత చేస్తుండేది. రెండవ ఖాళీ మొన్ననే, అయింది. ఆ టైపిస్టును మన ఇంజనీరుగారి వద్ద స్టెనోగ్రాఫరుగా ప్రమోట్ చేశారు.

"వసంతా ! నన్ను క్షమించు. నన్ను తప్పుగా అర్థం చేసుకోకు. వాస్తవానికి నా దగ్గరకు వచ్చిన కేసుల మీది డ్రాఫ్టు లను టైపుకై పంపుతున్నాను. అవన్నీ నీకు పని పెంచే ఉద్దేశంతో గాదు. ఏక్షన్ లేకుండా ఉన్న కేసులన్నీ రివ్యూ చేసి డిస్పోజు చేస్తున్నాను. అందువల్ల ప్రస్తుతానికి పని హెచ్చేగాని, తరువాత

తగ్గుతుంది. ఫ్యానును తీసుకువెళ్ళి మీ దగ్గర ఉన్న కేసు లన్నీ నా టేబులు మీదకు పంపించండి. రేపటి నుండి తగు మాత్రము డ్రాఫ్టులే మీవద్దకు పంపుతాను. ఈ వివరాలు నాకు మీరు చెప్పేవరకూ నాకు తెలియవు. ఇప్పుడు నా కళ్ళు తెరిపించారు. ఇక మీకు అంతశ్రమ కల్గించను."

శేఖరం అంతా వింటున్నాడే గాని ఏమీ మాట్లాడ లేకపోతున్నాడు. "కరవ మంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోప" మన్నట్టయిం దతని పరిస్థితి. ఓర్చి కష్ట ప డ మ ం టే కన్న కూతురు బాధ పడుతుంది. పని తగ్గించ మంటే 'కూర్చోబెట్టి జీత మిప్పించ దల చావా' అంటారేమో అధికార్లు. ఇది అతని క్లిష్టపరిస్థితి.

## 6

మరునాడు అరగంట ముందుగానే వచ్చాడుమూర్తి ఆఫీసుకు. తనటేబులుమీద టైపుకు ఎదురు చూస్తున్న కేసులు దగ్గరకు తీసు కొన్నా డు. చిన్న చిన్న ఉత్తరాలు గుమాస్తాలను "మేన్యూస్క్రిప్టు"లో ప ం ప మ ని, పెద్దస్టేటు మెంటులు స్టెనోగ్రాఫరును టైపు చేయ మని, మిగిలిన తగుమాత్రము వసంతను టైపు చేయమని సర్దేశాడు. దా ం తో వసంత నెత్తిమీదనుండి కొండను దించినట్లు తే లి క ప డి ం ది. గుమాస్తాలు మేన్యూస్క్రిప్టులు వ్రాయడానికి లోలోపల విసుక్కున్నారు. స్టెనోగ్రాఫరు తనకు పంపిన స్టేటుమెంట్లు మూర్తివద్దకు తీసుకు వచ్చి అవి తనపని కాదని వాటిని టైపు చేయుటకు తనకు వీలుపడ దని అభ్యంతరం చెప్పేడు. మూర్తి వానికి నచ్చజెప్ప ప్రయత్నించాడు. టైపిస్టులువచ్చేవరకూ కొంత శ్రమపడా లన్నాడు. ఆవిధంగా గుమాస్తాలుకూడా సాధ్యమైనన్ని చేతితో వ్రాయడంలో శ్రమపడుతున్నారు. ఫిమేల్ కళాసీ అయినా క్వాలిఫైడ్ టైపిస్టులా పని చేస్తున్నందుకు వ స ం త ను మన మందరం అభినందించా లన్నాడు. గాని ఈ మాటలు స్టెనో చెవి కెక్కలేదు. ఇంజనీరు ఆర్డరు లేకుండా తను ఆపని చేయదలంచలేదనిసీటుకువెళ్ళిపోయాడు. వెంటనేమూర్తి ఇంజనీరు ఛాంబరులోనికి వెళ్ళాడు. కుర్చీ చూపించి అందులో కూర్చో మన్నారు. మూర్తిని ఇంజనీరు.

"థాంక్సు సర్!" అని మూర్తి కూర్చున్నాడు.

"ఏవైనా అర్జంటుకేసు లున్నాయా?"

"అర్జంటు కేసులు గాదు గాని ముఖ్యమైన ఆఫీసు విషయం."

"ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగేడు ఇంజనీరు.

"మీ అభ్యంతరం లేక పోతే స్టెనోను ఓ పదినిమిషములు బైటకు పంపిస్తే ఒక ముఖ్య విషయాన్ని మీతో చర్చిస్తాను."

"ఓ యస్!...స్టెనో."

"యస్ సర్!" అంటూ స్టెనో వచ్చాడు.

"నేను మళ్లా పిలిచేవరకూ మీరు బయట ఆఫీసురూములో కూర్చోండి.

"అలానే సార్!" అంటూ బయటకు వెళ్ళిపోయాడు స్టెనో క్రోధంతో కూడిన ఓ కోరచూపు మూర్తిమీదికి విసిరి.

"మన ఆఫీసులో రెండు టైపిస్టు ఖాళీలు ఉన్నాయి. ఒక ఫిమేల్ కళాసీ చేత టైపిస్టుపని చేయిస్తున్నారు. ఈ విషయం మీకు తెలిసే యుంటుం దను కుంటాను "

"ఆ! ఆమె మన హెడ్‌క్లర్కు శేఖరంగారి కుమార్తె. నేనే ఎప్పా యింటు చేశాను. ఆమె చాలా మంచి అమ్మాయి. ప్రొద్దుటినుండి సాయం కాలంవరకూ తలెత్తకుండా పని చేస్తుం దని మన స్టేఫ్ చెపుతున్నారు. అందుకే ఇద్దరు టైపిస్టులు లేకపోయినా పని అయిపోతోంది. ఆమె దురదృష్టవంతు రాలు, మూర్తీ! మా పెద్దమ్మాయి ఉషను ఇంట్లో చూస్తుంటే ఈమె జ్ఞాపకానికి వచ్చి నాకు ఏదో ఆవేదనను కలిగిస్తుంది. మా ఉషకూడా అదే వయస్కురాలు. ఆమెకు ఇంకా మేము పెళ్ళి విషయమే తలంచలేదు. గాని ఈ వసంత బ్రతుకు చూడు! పట్టుమని ఇరవయ్యేళ్ళున్నాయో లేదో అప్పుడేపెళ్ళి, పిల్లతల్లి, వైధవ్యం! ఓ భగవంతుడా! పగవాళ్ళకు కూడా ఇలాంటి పరిస్థితులు కల్పించ కూడదు. అసలు మీ ఆంధ్రుల ఆచారా లలాటివి. చిన్నతనంలోనే పెళ్ళి చేసేస్తారు. వాటి పర్యవసానా లిలా పరిణమిస్తాయి.

వారు ఖర్గపురంలో వుండేటప్పుడు నేను ఆమెకు ట్యూషన్ చెప్పి మెట్రిక్ పరీక్షకు తయారు చేశాను. ఈ సంగతి మీకు తెలిసే యుండవచ్చు."

"శేఖరం గారు చెప్పిన జ్ఞాపకం."

"అదంతా విశ్మరించి ఆమెకు నేను అధికంగా పని సృష్టించినట్లు అభిప్రాయ పడుతోంది. నిజానికి కేసులు అన్నీ రివ్యూ చేసి డిస్పోజు చేస్తున్నాను. అది తాత్కాలికంగా హెచ్చుపని అవుతుంది! అదీగాక మామూలుగా మన ఆఫీసుకు ఇద్దరు టైపిస్టులను నియమించి నప్పుడు ఈ పనంత ఒక్కరైకు అసాధ్యమే! నిన్న సాయంకాలం ఆమె చాలా బాధ పడుతూ నాకు చెప్పింది – పని తగ్గించ లేకపోతే ఆమె ఒక్కర్తే పని చేయ లేనని.''

"మరి మార్గం!''

"సాధారణ ఉత్తరాలను గుమాస్తా లను మేన్యుస్క్రిప్టులో పంపమన్నాను. స్టేటుమెంట్సు స్టేనోను టైపు చేయ మన్నాను. మిగిలినవి తగుమాత్రం ఉంటవి. అవి ఆమెకు ఇవ్వవచ్చు.''

''అది బాగుగానే ఉంది. గుడ్ సజషన్!"

''గాని స్టెనో స్టేటుమెంట్సు టైపు చేయనన్నాడు, అతని పని కాదని.''




"చూడండి ! మీ కారు నిమిషాలమీద బాగవుతుంది."

"వీళ్ళేనా ఇంకా ఉన్నారా ?''

''ఉన్నారండి. కాని ఈ రోజు శలవు పెట్టారు.''

---

"మరెల్లా? వానికి రెండు పనులూ ఇవ్వగలమా ?" తెల్ల మొగం వేసేరు ఇంజనీరు.

''రూలు ప్రకారం మనం ఫిమేల్ కళాసీ చేత టైపిస్టుపని చేయించ కూడదు. ఇది ట్రేడ్ యూనియన్‌కు గాని. సెంట్రల్ లేబరు ఇన్‌స్పెక్టరుకుగాని తెలిస్తే మన పొజిషన్ చాలా డెలికేట్ అవుతుంది. అది అలా ఉండనివ్వండి. మనకు టైపిస్టు లేకపోవడం చేత కళాసీ చేత పని చేయిస్తున్నాంగదా ! ఈ పరిస్థితుల్లో స్టెనో కొంచెం అధిక శ్రమ తీసుకోవడంలో తప్పులేదు. ఆదే గాక మీరు నెలకు పదిహేనురోజులు లైనుమీద వెళతారు. ఆఫీసులో ఉన్నప్పుడు కూడా డిక్టేషనులు చాలా తక్కువ. మీరు చూస్తూనేఉన్నారు, స్టెనోకు పూర్తి పనిలేదని. అసలుమనకు టైపిస్టు రిలీవరు వచ్చేవరకూ ఇతనికి స్టెనో ప్రమోషన్ ఇవ్వకుండా టైపిస్టుగా ఉంచితే ఏమి చేయగలిగేవాడు ? అతని ఔన్నత్యానికేగా మీరు రిలీవరు లేకుండా ప్రమోషను ఇచ్చారు. ఆపాటి కృతజ్ఞత లేకుండా అతను ఎడ్మినిస్ట్రేషనుకు అవసర సమయంలో కోఆపరేట్ చేయకపోతే ఎల్లా?

"యూ ఆర్ కరక్ట్! స్టెనో ఈ అధిక పని చేయకపోతే టైపిస్టు వచ్చేవరకూ ఇతనిని రివర్టు చేసేస్తాను. రోగం కుదుతుంది. గాని నీవు ఎక్కౌంట్సు రిప్రెజెంటేటివ్వి ! వసంత చేత

ఖపిస్టుపని చేయించడంవల్ల ఎంప్లాయ్ మెంటు కండిషన్స్ ఇన్ ఫ్రింజ్ కావు గదా !"

"ఎందుకొక్కవండీ ! ఆ ప్రమాదం రాకుండా మనం ముందుగా మేల్కొ నాలి.''

''ఆమెను డిస్మిస్ చేద్దామా ?''

''మీరు ఆమెకు సహాయం చేయద ల్చస్తే నేను మార్గం ఆలోచిస్తాను నా కెందుకని మీరంటే బర్తర్ఫ చేయక తప్పదు. ఇందులో నా కేమీ ప్రత్యేకభి మానం ఇన్టరెస్టు ఆమెమీద ఉన్నట్లు అపార్థం చేసుకోవద్దు మీరు ఎలా చేయ దలిస్తే అలాగే చేయొచ్చు.''

"నా వల్ల అయ్యే పనైతే తప్పక ఆమెకు సహాయం చేస్తాను. కాని నాకు ప్రమాదం రానీయకు !"

''అలాగే సార్ ! ప్రస్తుతం పని నడవడం గురించి మీరు స్టెనోకి ఆర్డరు ఇవ్వాలి.

"తప్పకుండా !" అని కాల్ బెల్ నొక్కారు ఇంజనీరు.

"సార్ !" అంటూ ప్యూన్ వచ్చేడు.

"స్టెనోని పిలు.''

"చిత్తం సార్ !''

మరుక్షణంలో స్టెనో ప్రవేశించాడు.

స్టెనో నుద్దేశించి ''మనకు రిలీవింగ్ టైపిస్టు వచ్చేవరకూ నీవు ఎకౌంటెంటు ఇచ్చే స్టేటుమెంట్సు టైపు చేయడమే గాకుండా ఎక్కువ లేబరు చేయవలసి ఉంటుంది. అవసరమైతే లేట్ అవర్సు కూర్చొని పనిచేయాలి. స్టెనో పని, టైపిస్టుపనీ రెండూ చేయ డానికి నీ కేమైనా అభ్యంతర ముంటే రిలీ వింగ్ టైపిస్టు వచ్చేవరకూ నిన్ను టైపిస్టుగా రివర్టు చేస్తాను. స్టెనో లేకుండా నేను మేనేజ్ చేయగలనుగాని ఆఫీసు వర్కు సఫర్ అయితే నే ఒప్పు కోను. నీ ఉద్దేశ్య మేమిటో త్వరలో చెప్పు'' అన్నారు ఇంజనీరు.

స్టెనోకు పచ్చి వెలక్కాయ ముద్ద గొంతులో చిక్కినట్లు అయింది. ఎకౌంటెంటు దగ్గర చెప్పినట్లు రెండు పనులూ చేయనంటే రివర్టు చేస్తా నంటు న్నారు. రెండు పనులూ చేస్తానంటే తన ఓటమితో ఎకౌంటెంటు దగ్గర నామోషీ, స్టెనో అవడంవల్ల ఇంజనీరు వద్ద తనకు ప్రత్యేకస్థాన ముందని తనని ఇంజనీరుగారు బలపరుస్తా రనే ధైర్యం తోనే ఎకౌంటెంటుకు ఎదురు చెప్పేడు గాని కథ అడ్డం తిరిగింది. తల ఖండించిన ట్లయింది. గాని ఏమి చేయగలడు ?

"మీ ఆజ్ఞ సర్ ! మీరు ఏమి చేయ మంటే అదే చేస్తాను."

''మూర్తీ ! స్టెనోకు కొంత పని ఇచ్చి మేనేజ్ చేయండి "

"అలానే సార్ !" అంటూ మూర్తి తన సీటుకు వెళ్ళిపోయాడు.

శేఖరంగార్ని పిలిపించాడు మూర్తి. శేఖరంగారు వచ్చి మూర్తికి ఎదురుగా కుర్చీలో కూర్చున్నారు.

"కొన్ని అర్జంటు పన్లున్నాయి మీరు రేపు ఆదివారం ఆఫీసుకు రావాలి; మీకు వేరే అర్జంటు పనులేమీ ఇంటి దగ్గర లేకపోతే......"

"ఆఫీసు పనికంటే నండీ? తప్పక వస్తాను."

"పదిగంటలకల్లా ఆఫీసులో ఉండాలి. ఇంకో విషయం. మీ అందరులో ఉన్న ఎస్టాబ్లిష్మెంటు కేసులు అన్నీ ఏ అల మరలో ఉంటున్నవీ మీకు తెలుసు అను కుంటాను ఆ అలమర తాళాలు మీరు ఉంచుకోండి. ఎవైనా ముఖ్యమైన కేసులు హిస్టరీ షీట్లు మీకు ఎచ్చటున్నదీ తెలి యకపోతే ముందుగా గుమాస్తాల నడిగి తెలుసుకోండి."

"నా సెక్షనులోని అన్ని కేసుల వివ రాలూ నాకు బాగానే తెలుసు" అని శేఖరం తన సీటుకు వెళ్ళిపోయాడు. కాని తన సెక్షనులో అంత అర్జంటు పని ఏమున్నదానాడు అర్థంగాక తికమక లయ్యాడు.

## 7

ఆదివారం పదిగంటలకు ఆఫీసులో హాజరయ్యారు మూర్తి, శేఖరం

"శేఖరంగారూ! నాల్గవ తరగతి ఉద్యోగులు ఎంతమంది ఉన్నారని మన కిస్ట్రిక్టులో?"

"సుమారు ఆరువందల మంది."

"వాళ్ళందరి హిస్టరీషీటులు నా కివ్వండి. వాటిని చూడాలి."

శేఖరం హిస్టరీషీట్లు అన్నీ తెచ్చి మూర్తిబేబులుమీద ఉంచాడు.

మూర్తి ఒక్కొక్క ఫైలు పరిశీలించి ఓ ప్రక్క పెడుతున్నాడు. ఏమి పరిశీలి స్తుందీ శేఖరానికి అయోమయంగావుంది. అర్థం కాక తికమకలవుతున్నాడు. సాయంకాలం నాలుగంట లయ్యింది. మూర్తి అన్ని ఫైలులు చూచాడు. రెండు ఫైలులు ఓప్రక్క నుంచాడు. వాటిలో ఒకటి వసంతకు చెందినది. మరియొకటి జోషీ యను మరాటీ యువ కునికి చెందినది

"శేఖరంగారూ! ఈ రెండు ఫైలులు వేరే ఉంచండి మిగిలిన వన్నీ అలమ రలో ఉంచండి."

శేఖరం ఆ ఫైలు లన్నీ అలమరలో ఉంచాడు. ప్రత్యేకించబడిన రెండు ఫైలులూ కూడా అలమరలో ఓప్రక్క భద్రపరిచాడు. కాని వాటిలో వసంత ఫైలు ఉండడం అతనికి సన్పెన్సు ఎక్కువయింది. కాని వివరాలడిగే ధైర్యములేదు. వారిద్దరూ నాటికి ఆఫీసు ముగించుకొని ఇళ్ళకు వెళ్ళిపోయారు.

మరునాడు ఆఫీసుకు వచ్చిన తరు వాత ఇంజనీరు రాకకు ఎదురు చూచి, ఇంజనీరు వచ్చినవెంటనే మూర్తి ఇంజ నీరుగారి ఛాంబరులో ప్రవేశించాడు.

"గుడ్ మార్నింగ్ సర్ !"

"గుడ్ మార్నింగ్! అలాకూర్చో మూర్తీ" అంటూ ఎదురుగా నున్న కుర్చీ చూపించారు.

"థాంక్సు."

"నిన్న ఆఫీసుకు వచ్చి నాల్గవ తరగతి ఉద్యోగుల హిస్టరీ షీట్లన్నీ పరీక్షించానండి. మన దగ్గర ఉన్న నాల్గవ తరగతి ఉద్యోగు లందరిలో ఇద్దరు మాత్రమే మెట్రిక్ పాసయినవాళ్ళు. మనదగ్గర గుమస్తా ఖాళీలు చాలా ఉన్నాయి. ఆ ఖాళీలలో ఈ ఇద్దరకూ ప్రమోషన్ ఇస్తే బాగుంటుంది"

"మనకు పవర్సు ఉన్నాయా?"

"మనము గుమస్తాలను రిక్రూటు చేయలేము గాని నాల్గవ తరగతి ఉద్యోగులకు పరీక్ష జరిపి అర్హులకు ప్రమోషన్ ఇవ్వవచ్చు. దానికి రైల్వేబోర్డు ఆదేశం వుంది."

"అల్లాఅయితే పరీక్ష జరుపుదాం."

"పరీక్షకు కూర్చోదలచినవాళ్ళందరి దగ్గరనుండి ధరకాస్తులు తీసుకొని అప్పుడు పరీక్ష జరపాలి"

"వెంటనే అర్డరు సర్క్యులేట్ చేయించండి. పరీక్షకు కూర్చోదలచినవాళ్ళందరు ఫలానా తారీఖులోగా ధరఖాస్తులు ఇవ్వాడానికి పదిరోజులు టైమిచ్చి ఆ తరువాత పరీక్షకు మరో పదిరోజులు టైము పెట్టి తేదీలు నిర్ణయించి నోటీసులు జారీచేయండి."

"అలాగే సార్ !" అంటూ మూర్తి తన సీటుకు వెళ్ళిపోయాడు.

గుమాస్తాలుగా ప్రమోషనుకోరి పరీక్షకు హాజరుకాదలంచినవారు ఫలానా తారీఖులోగా ధరకాస్తు లీయవలెనని నోటీసు జారీచేయడమైంది. సుమారు నూరు ధరకాస్తులు వచ్చాయి. నిర్ణయించిన తేదీని వాళ్ళందరకూ వ్రాత పరీక్ష జరిగింది. ఇంజనీరు ఆ పేపర్లన్నీ దిద్దడానికి తనకు సమయం ఓపికా రెండూ లేవని అతి రహస్యంగా తనకుబదులు మూర్తినే చూచి మార్కు లివ్వమన్నారు. మూర్తి పేపర్లన్నీ దిద్దేడు. వాటిలో వసంత హెచ్చు మార్కులు సంపాదించింది. రెండవవాడుగా జోషీ వచ్చాడు. ఇంకో ముగ్గురు పాసుమార్కులు సంపాదించేరు. వసంతకు మొదటి మార్కు ఇస్తే ఆమెకు ప్రత్యేకాభిమానం చూపించినట్లు ఇంజనీరు అనుమానిస్తారేమో నని భయపడ్డాడు. పాసయిన ఐదుగురి పేపర్లూ ఇంజనీరు వద్దకు తీసుకు వెళ్ళేడు.

"సర్ ! అందరిలో పాసుమార్కులు పొందినవారు ఐదుగురే ఉన్నారు. వీరికి ఇంపార్షియల్‌గా నేను మార్కులిచ్చేను. గాని నేను పార్షియాలిటీ చూపినట్లు అపోహపడవచ్చు. అందుచేత ఈ ఐదు పేపర్లు మీరు ఓసారి చదివి నే నిచ్చిన మార్కు సరిగా నున్నాదీ లేనిదీ చూచి అవసరమైనచోట్ల సవరించండి."




"ఏం చేస్తున్నారు మీరా కుక్కని."
"ఎవడైతే పెద్ద అబద్ధం చెపుతాడో వాడు గెల్చుకుంటాడు కుక్కని."
"నేను మీ అంత పిల్లవాడప్పుడు ఒక్క అబద్ధంకూడా చెప్పలేదు."
"అయితే ఆయనకి ఇచ్చేయండిరా కుక్కని."

---

"మనము సిన్సియర్‌గా ఉంటేచాలు, ఒకళ్ళు ఏదో అనుకుంటా రని ఎన్నాళ్ళు భయపడతాం మూర్తీ!"

"నేను సిన్సియర్ అని నా మనస్సుకు తెలుసు. దేవునికి తెలుసు. కాని లోకానికి తెలియదండి?"

మూర్తినుండి ఇంజనీరు పేపర్లు తీసుకున్నారు. ముందు తక్కువమార్కులు పొందినవి చూచారు; వాటిలో మార్కులు వచ్చినంతసరుకు కనిపించలేదు. వీటిని ఓవర్‌వేల్యూ చేసినట్లుంది?"

"కొంచెం అలా చేయవలసి వచ్చిందండి. కనీసం ఐదుగురినైనా పాసు చేయాలనే ఉద్దేశంతో వాళ్ళకు కొన్ని హెచ్చుమార్కు లిచ్చి పాసుచేశాను. మీరు ఆమోదిస్తే పాసు చేయవచ్చు."

హెచ్చుమార్కులు పొందిన రెండు పేపర్లూ చూడడం మొదలెట్టేరు. అందులో రెండవస్థావం పొందిన పేపరు చూచినతరువాత "వేల్యుఏషన్ కరక్టుగానే ఉంది" అని మిగిలిన పేపర్లు తీసి పూర్తిగా చదివేరు.

"మీ వేల్యుయేషన్ ఈ పే ప రు లో సరిలేదు మూ_ర్తీ."

మూ_ర్తి ఆశ్చర్యపోయాడు. వసంత పేపరు ఇంజనీరు చూస్తున్నంత సేపూ మూ_ర్తి గుండెను హెచ్చుస్థాయిలో కొట్టు కున్నవి. ఇంజనీరు మాటలు విన్న వెంటనే కృంగిపోయాడు 'నిజంగా తను ఆమెకు అభిమానం చూపినట్లు ఇంజనీరు కూడా శంకిస్తున్నారా' అని కొంచెం ధైర్యం చేసుకొని "ఆమె వ్రాసిన వన్నీ రైటేనండి. తరువాత పేపరు మీరే సెట్ చేసేరు. ఇంకా అభిమానం చూపానని శంకిస్తున్నారా?"

"అభిమానం ఏమిటోయ్! ఆమె తెలివి తేటలను పాదం క్రింద అణచిపెట్టి నట్లు అణుస్తూ మార్కులు వేశావు. ఈ ఆన్సర్లకు ఇలా ఇవ్వవలసింది మార్కులు? నీ విచ్చిన మార్కులు చాలవు."

ముచ్చమట్లు పోసిన మూ_ర్తి శరీరం కా_స్త పంకాగాలికి చల్లబడింది. తేరు కున్నాడు.

"మొదటిమార్కు ఎలాగూ సంపా దించింది. ఇంక హెచ్చుమార్కు లిచ్చినా వాటివల్ల ఆమెకు ప్రత్యేకలాభం లేదు గదండీ!"

"ఇప్పుడు మనదగ్గర ఖాళీలు ఎన్ని ఉన్నాయి?"

"రెండు టైపిస్టుల ఖాళీలు, పది గుమ స్తాల ఖాళీలు ఉన్నాయి."

"వసంతను టైపిస్టుగా ప్రమోట్ చేసి మిగిలినవారిని గుమస్తాలుగా ప్రమోట్ చేద్దాం."

"అందర్నీ గుమస్తాలుగానే ప్రమోట్ చేయాలండి. పరీక్ష గుమస్తాఖాళీలకు జరిగింది గాన వసంతను టైపిస్టుగా ప్రమోట్ చేయలేము"

"ఆమెను టైపిస్టుగానే మనం ఉపయో గించిన బాగుంటుందేమో!"

"బాగానే ఉంటుంది. కాని ఆమెకు ప్రత్యేక పరీక్ష జరిపి టైపుస్పీడు చూచి టైపిస్టుగా పాసయితే టైపిస్టుగా ఎప్లాయ్ చేయవచ్చు.

వసంతకు జోషీకి మిగిలిన ముగ్గురకు వరుసగా గుమస్తాలుగా పాసయినట్లు ప్రమోషను ఇచ్చినట్లు ఆర్డరు జారీ చేయడమైనది. ఆర్డరు వెలువడిననాడు వసంత సంతోషం చెప్పనలవికాదు. మూ_ర్తి సహాయంతోనే తను ప్రమోషన్ పొందినట్లనుకుంది. ఆ మూ_ర్తి తనను ఉద్యోగంనుండి బర్తరపు చేస్తాడని శంకించినందుకు తన్ను తాను నిందించు కుంది. వెంటనే తన కృతజ్ఞతను సంతో షాన్ని వెల్లడిచేయడానికి మూ_ర్తివద్దకు వెళ్ళింది, చిరునవ్వుతో.

"కంగ్రాట్యులేషన్సు వసంతా."

"థేంక్సు. మీ మేలు ఎన్నటికీ మరువలేను. మీ దయవల్లే నాకా ప్రమో షను లభించింది"

"అలా మాట్లాడకు. అందులో నా ప్రమేయమేమీలేదు. మొదట నీఅర్హతను నీవు గుర్తించి ఆతరువాత ఇంజనీరు గార్కి నీ కృతజ్ఞత తెలుపుకోవాలి "

"ఇంజనీరుగార్ని చూడవచ్చాంండి."

"నిరభ్యంతరముగా !"

వసంత ఇంజనీరుగారి ఛాంబరులోనికి వెళ్ళి నమస్కరించి "థేంక్స్ సర్ ! మీ మేలు నా జన్మలో మరువలేను. నాకు ఒకదారి చూపినవా రయ్యారు."

"ఇందులో నే చేసిన దేముంది. నీ అర్హతను నీవు రుజువు చేసుకున్నావు. ప్రమోషన్ ఇచ్చే అవకాశం నాకు లభించింది. ప్రమోట్ చేశాను."

సంతోషంతో ఇంకేమీ మాట్లాడలేక ఉక్కిబిక్కిరైంది వసంత. ఇంజనీరు నుండి సెలవుతీసుకొని తన సీటుకు వెళ్ళిపోయింది.

ఆఫీసంతా గుసగుసలు చెలరేగాయి- వసంతకు ప్రత్యేకాభిమానం చూపినట్లు ఈ గుసగుసలు అస్పష్టంగా మూర్తిచెవికి చేరాయి. ఆదంతా లోకం పోకడని మాత్రం అనుకున్నాడు.

ఆఫీసునుండి ఇంటికి వెళ్ళినతరువాత శేఖరం ఇంట్లో అందరూ సంతోషంతో ఆనాడు ఓ పండుగగా భావించారు. వసంతా, ఆమెతల్లీ, తండ్రీ మూర్తి సహాయం చాలా ఉందనుకున్నారు. మూర్తిని వసంత లోలోన పొగిడింది. శేఖరం, ఆతనిభార్య బహిరంగంగా పొగిడేరు.

............

## 8

కొద్దిరోజులు గడిచాయి. మరల టైపిస్టు కొళీలకు అర్హత ఉన్నవారూ, టైపువచ్చినవారూ ధరకాస్తు లివ్వవచ్చని ఆర్డరు జారీ అయ్యింది. నిర్ణయించిన తేదీని ధరకాస్తుదారులకు పరీక్ష జరిగింది. అందు వసంత ఒక్కరే ఉత్తీర్ణురాలయ్యింది. పరీక్షకు హాజరైన మిగిలిన నలుగురకు టైపుచేయడమే తెలియదు. అయినా అదృష్టంమీద భరోసాతో పరీక్షకు హాజరయ్యారు.

ఈసారి వసంత టైపిస్టుగా సెలక్టయిన తరువాత గుసగుసల దుమారం ఆఫీసులో మరికొంత హెచ్చుస్థాయిలో రేగింది ఈ పరీక్ష లన్నీ వసంతకోసమే జరిగినట్లు వదంతి లేచింది.

వసంతను పిలిపించి "నీవు టైపిస్టుగా కూడా సెలక్టయ్యావు. ఇప్పుడు నీవు గుమస్తాగా ఉండదలంచినది లేక టైపిస్టుగా ఉంగదలంచినదీ నీ ఉద్దేశం తెలియజేయాలి" అన్నాడు మూర్తి.

"ఈ రెంటి తారతమ్యములు, భవిష్యత్తులు నా కేమి తెలుసండీ ? మీరే సలహా ఇస్తే బాగుంటుంది."

"ఒకరి సలహాలమీద ఆధారపడకు వసంతా ! ఇది నీ అభిరుచులను బట్టి ఉంటుంది. గుమస్తాగా ఉంటే నీకు మాన

సికంగానే పని ఉంటుంది. తోటి అందరి గుమస్తాలతోనూ చాలమట్టుకు కలిసి పని చేయాలి. సైపిస్టుగా నయితే యితరులతో సంబంధం ఉండదు. నీ పని నీవు చేసుకుంటూ ఓ చోట ఉండవచ్చు కొన్నాళ్ళ తరువాత నీకుఇష్టం లేకగాని లేకగుమస్తా పరుసలో ప్రమోషను వచ్చినా నీవు గుమస్తాగా రావచ్చు లేక షార్టుహేండు నేర్చుకుంటే స్టినోగ్రాఫరు కావచ్చు. సైపిస్టుగా నీవు ఒక యంత్రంలా పనిచేయాలి. శారీరకంగా కూడా శ్రమపడవలసి యుంటుంది. అందుచేత ఈ విషయాలు నీవు బాగా ఆలోచించి నిర్ణయించుకోవాలి. మీ నాన్నగారితో కూడా ఆలోచించి వారుఎలాచేయమంటేఅలాచేయి."

"మీ సలహా చెప్పేరుగాదు."

"నా సలహా నీకు సైపిస్టులెను బాగుంటుందని. అయినా వ్యక్తిగతాభిప్రాయమునుబట్టి నిర్ణయించుకోవాలి."

"మా నాన్నగార్ని కూడా సలహా చేస్తాను" అంటూతండ్రిదగ్గరకువెళ్ళింది.

శేఖరం వసంతలు పదినిముషాలు ఆలోచించారు. ఇద్దరూ ఏకగ్రీవంగా సైపిస్టులెను మంచి దని నిర్ణయించారు. శేఖరం మూర్తి వద్దకు వెళ్ళి వసంతను సైపిస్టుగా వేయమన్నాడు ఆ విధంగానే ఆర్డరు జారీచేయడం జరిగింది.

............

మూర్తి ఆఫీసుకు వస్తూ దారిలో ఓ తెలుగు సినీమా పోష్టరు చూచాడు. 'ఇక్కడకు కూడా తెలుగు సినిమాలు పాతబడిన తరువాత వస్తాయన్నమాట' అని మనస్సులో అనుకున్నాడు; మూర్తి ఆఊళ్ళో తన ఆరు నెలల జీవితంలో ఒక రోజూ సినీమాకు వెళ్ళలేదు. సినీమాలంటే అతనికి ఇష్టం లేకగాదు, సమయం, అవకాశం లేక; ఆ ఊళ్ళో సినీమా హాలు లెచ్చటున్నాయో కూడా తెలియదతనికి.

ఆఫీసులో శేఖరంగారు ఏవో ఆఫీసు విషయములు మాట్లాడుతూ తీరికగా కబుర్లు చెబుతూన్నారు.

"ఈ ఊళ్ళోకి తెలుగు సినీమాలు కూడా వస్తున్నాయండీ!" అన్నాడు మూర్తి ఆశ్చర్యంగా.

"వస్తాయి; చాల పాతబడి అన్ని చోట్లా ఆడిన తరువాత స్క్రేప్ అయ్యే ముందు ఇచ్చటికి వస్తాయి."

"ఏ పాతవో! తెలుగు సినిమా అంటూ ఇక్కడకు రావడం ఆశ్చర్యమే! ఈవేళ వస్తూ దారిలో పోష్టరు చూచాను."

"వెలుగునీడలు" సినీమా ఆడుతుందట. సినిమా ఎంత పాతదైనా మంచిదే ఏదో కాలక్షేపానికీ, రిక్రియేషనుకున్నూ. ఈ ఊళ్ళో సినీమా హాలు లెక్కడ ఉన్నవో నాకు తెలియదు. చెప్పకుంటే సిగ్గుచేటు."

"మీరు ఎప్పుడైనా టౌనులోకి వెళితే తెలుస్తుంది"




" నాకు ఇడ్లీ; నాకు పెసరట్టు; మినపట్టు; వాళ్ళకు తెచ్చినవి నాకూ తీసుకురా."

''రేపు ఆదివారం గదండీ ! మీకు ఇం కే ఎంగేజిమెంటూ లేకపోతే సినీమాకు వెడదాం. కొంచెం ముందుగా వెళ్ళి టౌను పూర్తిగా సరదాగా తిరిగి ఆ తరువాత సినీమాకు వెడదాం. ప్రోగ్రాం పెద్దదని ఏమైనా కంగారు పడుతున్నారా ? "

"అబ్బే ! అలాగే తిరుగుదాం'' అని శేఖరం తన సీటుకు వెళ్ళిపోయాడు ఎవరో గుమస్తా పిలువగా.

మరునాడుమధ్యాహ్నం రెండు గంటలకు మూర్తి శేఖరంగా రింటికి వెళ్ళాడు. వసంత చిరునవ్వుతో లోపలకు ఆహ్వానించింది మూర్తిని.

''మీ నాన్నగారు ఏరి ? "

"ఈ వేళ బిల్లులు పంపడానికి ఆఖరు తేదీ గదండీ ! ప్రొద్దుటే వెళ్ళారు ఆఫీసుకు. బిల్లులు తయారై ఆఫీసరు సంతకమయ్యేవరకూ ఇంటికి రాలేరు ''

'' సారీ ! ఈ విషయమే నాకు జ్ఞాపకంలేదు. కనీసం మీ నాన్నగారైనా నాకు చెప్పలేదు. నిన్న సినీమాకు వెడదామంటే సరే నన్నారు."

''మాటల మధ్య మీరు సినీమాకు వెడదా మంటే అలాగే నన్నారట. సాయంకాలం ఆదివారం పని చేయడానికి గుమాస్తాలను బుక్ చేసేటప్పుడు జ్ఞాపకం వచ్చిందట 'ఆదివారం ఆఫీసుకు రావా' లని. ఆ సంగతి మీతో చెబుదా మని చూస్తే మీరు ఇంజనీరుతో బిజీగా ఉన్నారట. తరువాత మా నాన్నగారు మరిచి పోయారు."

ఇంతలో శేఖరంగారి భార్య కాఫీ తీసుకువచ్చి మూర్తి కందించింది.

''మీతో సినీమాకు వెడదా మని వాళ్ళనాన్న అనుకున్నారట. గాని ఆఫీసుకు వెళ్ళవలసుండి వెళ్ళారు. వసంతకు టౌను బాగానే తెలుసు. మీ ఇద్దరూ టౌను చూచికొని సినీమా చూచిరండి."

''నేనుకూడా సినీమాకు వెడదామనుకున్నాను. మా నాన్నగారు లేక పోవడంతో తోడులేక ఆలోచిస్తున్నాను. మీరు వస్తానంటే నా కేమీ అభ్యంతరము లేదు'' అంది వసంత.

''మీ తల్లీ, చెల్లెళ్ళూ వస్తే కలసి రావడం మంచిదేమో !''

''మా అమ్మకు ఇల్లు చక్కబెట్టుకో డానికే తీరికఉండదు. ఇంక సినీమాలు కూడానా? చెళ్ళెళ్ళకు పరీక్షలు దగ్గర బడ్డాయి. ప్రయివేటు మాష్టరు వస్తారు ఇంక మా పాప వచ్చిందా దానిని బుజాన్ని వేసుకు మోయాలి. అది సినీమా చూడదు సరిగదా నన్నుకూడా చూడ నీయదు.

మూర్తికి ఆమెతో సినీమాకు వెళ్ళడం కొంచెం అసభ్యమేమో ననిపించింది. గాని వసంత సరదాపడి తోడు లేక సినిమాకు వెళ్ళడం విరమించుకుంటున్నా నన్నది అల్లాంటి పరిస్థితులలో ఆమెను వెంటబెట్టు కెళ్ళితే తప్పు లేదని తన మనస్సుకు సంజాయిషీ చెప్పుకున్నాడు. కాఫీ త్రాగిన అనంతరం కప్పు సాసరు టీపాయి మీదుంచి ''త్వరగా తయారై బయలుదేరు వసంతా !'' అన్నాడు మూర్తి.

వసంత లోనికి వెళ్ళి పావుగంటలో తయారై వచ్చింది. ఇరువురూ కలసి బస్సుస్టాపు దగ్గరకు వెళ్ళి పదినిముషాలు నిలబడేసరికి సిటీబస్సు వచ్చింది. ఇద్దరూ బస్సు ఎక్కారు.

''ఈవేళ మనం అదృష్టవంతుల మండీ" అంది చిరునవ్వుతో వసంత.

"ఏం?" అన్నాడు మూర్తి అర్థంగాక.

"ఈ ఊళ్ళో సిటీబస్సులు పేరుకు మాత్రం ఉన్నాయి. వాటిని ఓ నిర్ణీత సమయ మంటూలేదు. బస్సులో జనం నిండితేబయలుదేరుతుంది. లేకపోతేలేదు. ప్రొద్దుపొడిచిం లగాయతూ ప్రొద్దు కుంకే వరకుమాత్రమే ఇవి తిరుగుతాయి. ఆ తరువాత కనిపించవు అందుకే వీటిని ఎవరూ నమ్ముకోరు. టాంగాల కున్న గిరాకీ వీటి కుండదు. ఈ వేళ మనం ఎక్కువసేపు నిలబడ్నక్కర్లేకుండా బస్సు దొరికింది. అందుకే మన అదృష్ట మన్నాను."

"తిరిగివచ్చేటప్పుడు మనకు బస్సు దొరకదన్నమాట."

"టాంగా కట్టించుకోవాలి."

బస్సు రైల్వేకాలనీనుండి టౌనుకు చేరుకుంది. మూర్తి వసంతలు బస్సు దిగేరు. మార్కెట్టులో పెద్దపెద్ద దుకాణాలు చూచారు. కొన్ని దుకాణాల్లో కావ

లసిన వస్తువులు కొనుక్కున్నారు. గోలు (గుండ్రపు) బజారు చూచి, ముఖ్య వీధులు, కచేరీలు వగైరా లున్నచోట్ల పరికించేరు ఇంకా సినిమాకు గంటన్నర సమయ ముంది సినీమాకు దగ్గర్లో ఓ పార్కు ఉంది ఆ పార్కులోనికి ప్రవేశించారు మూర్తీ వసంతలు పార్కులో మూర్తిబుర్రలో చాలకాలంనుండిదాగున్న విషయం జ్ఞాపక మొచ్చింది ఎన్నోసార్లు మూర్తి ఆలోచించేవాడు 'తను వసంతకు ప్రయివేటు చెప్పేరోజులలో తనతోమాట వరుసకైనా చెప్పకుండా శేఖరంగారు బదిలీయై వచ్చివేయడానికి కారణమేమిటా అని ఈ ప్రశ్న ఆమెను ఎలా అడగడం, తనకు అనుమానం ఎలా తీరడం? నెమ్మదిగా సంభాషణ ప్రారంభించాడు మూర్తి.

"ఇంతదూరం వచ్చి ఉద్యోగం చేయడానికి నేనుఎన్ని జన్మల్లో పాపంచేశానో? మాతృదేశం విడచి, మాతృభాష మరచి, ఇలా జీవచ్ఛవంలా బ్రతుకుతున్నానంటే కేవలం పొట్టకోసమో లేక ఉద్యోగం కోసమో అర్థంకాక, ఉద్యోగం కోసం ఇంతదూరం వచ్చామనీ, ఇక్కడకు వచ్చాంగదా యని ఉద్యోగంచేస్తూ బ్రతుకుతున్నాం" అన్నాడు మూర్తి

"మీకీ ప్రాంతం నచ్చలేదా?"

"నచ్చటానికేముంది ప్రమోషను మీద వెళ్ళమన్నారు, వచ్చాను అంతే! మీ నాన్నగార్కి ఏ ప్రమోషనూ లేదే! ఎందుకు నచ్చినట్లు ఇంతదూరం?"

"మానాన్నగారు రావడానికి ఒక పెద్ద కధవుంది మానాన్నగారే కోరి నిమిషాల మీద బదిలీ చేయించు కున్నారు"

"ఏమిటి అంత గొప్పవిశేషం?" ఆశ్చర్యంగా అడిగేడు

"మీరు నాకు ట్యూషను చెప్పే రోజుల్లో ఎవరో తుంటరులు మన ఇరువురకు ఎదో సంబంధం పెరుగుతోందని ఆకాశ రామన్న ఉత్తరం వ్రాసేరు. దాంతో నిప్పులు త్రొక్కిన కోతిలా మా నాన్నగారు మాతల్లిని మన ప్రవర్తన ఎలాగుందని నిలదీశారు మాతల్లికి ఎట్టి అనుమానం లేదని చెప్పింది గాని ఆ అవమానంతో అక్కడ ప్రజలకు ముఖం చూపడానికి మనస్కరించక వెంటనే ఇచ్చటకు బదిలీ చేయించుకునారు!"

మూర్తికి గత నాలుగేళ్ళ క్రితం జరిగిన సంఘటనలు జ్ఞప్తికి వచ్చేయి వీధి తుంటరులు మూర్తి వెనుక ఎత్తిపొడుపు మాట లనడం ముఖ్యంగా శేఖరంగారికి బదిలీ యైనతరువాత శేఖరంగారి ప్రక్కింటావిడ నిర్లక్ష్యముగా ఇచ్చిన సమాధానం మూర్తి మెదడులో మెదిలాయి

"మీ నాన్నగారు మనలను శంకిచారా?"

"అప్పట్లో శంకించినా, ఇప్పుడు మీరు ఓ దేవుడనే వారు నమ్ముతున్నారు"

"నీ అభిప్రాయం?"

"నా ఉద్దేశ్యంలో అప్పుడూ ఇప్పుడూ గురువుగారే!"

'వసంతను భార్యాగా పొందగలిగే అదృష్టం తనకు లేదనుకున్నాడు మూర్తి వసంత అందచందాలు, తెలివితేటలు చూచి ఆమెను భార్యగా పొందే వారు నిజంగా అదృష్టవంతులనే ఊహించేవాడు అలాంటి అప్సరస నిజంగా తన భార్య అయితే ఆమె చరిత్ర ఏవిధంగా ఉండేదో? భగవంతుడు ఆమెను ఈర్ష్యతో చూచి పెళ్ళయిన మూడోఏడే ఆమెకు భర్తను దూరంచేసి పసుపు కుంకుమలకు కొరత చేశాడు ఆమె అందం బూడిదను బోసిన పన్నీరే! అయితే అంత అందం ఎందు కివ్వాలి భగవంతుడామెకు? ఎవరి కోసం ఆమె అందం? కనీసం ఆమె కూడా మానవమాత్రురాలేగా! పట్టుమని ఇరవైఏళ్లు లేవు ఇంతలో వివాహం, మాతృత్వం, వితంతువు కావడం అన్నీ జరిగిపోయాయి అయితే తన వాంఛలను చంపుకొని ఆమె శేష జీవితాన్ని గడపవలసిందేనా? ఈ ఊహలతో మూర్తి బుర్ర దిమ్మెక్కింది

సంధ్యకాంతులు వారిరువురి మీదా పడి వారికి వింత సౌందర్యాన్నిస్తున్నాయి సంధ్యా కిరాణాలు వారిరువురి ముఖాలపైబడి వసంతో త్పవమునాడు కుంకుమరంగు పులుముకున్న రాధాకృష్ణుల్లా గున్నారు పార్కులోని గులాబీ పూవులు వారిరువుర చూచి చిరునవ్వులు చిందుస్తున్నాయి వారి ఎదురుగా నున్న పోకచెట్టుమీది జంట పావురములు వారిని వెక్కిరిస్తున్నట్లు గోచరిస్తున్నాయి ఎంతోమంది దంపతులు వారిముందు పార్కులో ప్రకృతి సౌందర్యాన్ని అనుభవిస్తుంటే వారిరువురిలో ఏదో వెలితి కనిపిస్తోంది ఆ ప్రత్యేక వాతావరణం వారిరువురిలో ఏదో ఊహలను, వాంఛలను రెకెత్తించాయి, ఒకరి కళ్ళళ్ళోకి మరియొకరి తీక్షణంగా చూచుకున్నారు ఈ చూపులు వారి ప్రణయవీణను మీటిన ట్లున్నాయి కాని వారిరువురి మధ్య సంఘము, నియమాలూ అనే ఇనుపతెర అడ్డంగా పడింది ఇంతలో మూర్తి గడియారం చూచి "పదిహేను నిమిషాలే ఉంది సినీమా ప్రారంభించటానికి మనకు తెలియకుండానేసమయందొర్లిపోయింది ఇంక వెళదామా?" అన్నాడు

వసంత గుండెలు బరువెక్కి ఉన్నాయి ఏమి సమాధాన మివ్వాలో తోచలేదు అసలు మాట్లాడ్డానికి నోరు పెగల్చ లేని స్థితిలో ఉంది మౌనంగానే మూర్తిని అనుకరించింది



"మా ఆవిడే( ఒకే రకం కాయగూరను రోజు కో కొత్తరకం కూరగా వండుతుంది.."

"ఓష్...మా ఆవిడ నెలకి సరిపడే బియ్యాన్ని తెచ్చిపడేస్తే అదే బియ్యంతో పూట కో మోస్తరుగా అరవై రఖాలు అన్నం వారుస్తుందోయ్!"

---

మూర్తి సోఫాటిక్కెట్లు రెండు తీసుకొని వసంతతో హాలులో ప్రవేశించాడు. సినీమా ప్రారంభమైందిగానిఇరువురిదృష్టి ముందునున్న తెరమీదలేదు. ఏదో ఊహా ప్రపంచములో పరుగులెత్తుతున్నాయి. వారి దృష్టి బొమ్మమీద కేంద్రీకరించిన కొంత వ్యవధిలోనూ ఆ ఘట్టాలు వారి ఇర్వురకూ వర్తిస్తున్నట్లు భావించి, అనుకోకుండా ఒకరి మొఖంలోకి మరియొకరు చూచుకొనేవారు. వెంటనే వారు ఏదో తప్పుచేస్తున్న వాళ్ళలా గుర్తించి మళ్ళా ముఖాలను త్రిప్పుకుని తెరవైపు చూచేవారు. ఆ విధంగానే సినీమా ఆయిపోయింది. హాలునుండి బయటకు వచ్చారు.

"మనకు సిటీబస్సు లేనట్లుంది ఇంక టాంగాయే గతి అనుకుంటా" అన్నాడు మూర్తి.

"ఔనండి! టాంగా ఒకటి మాట్లాడండి."

మూర్తి టాంగా కుదిర్చేడు. ఇద్దరూ కూర్చున్నారు. టాంగా సాఫీగా సాగిపోతోంది, ఆ రాత్రి సమయంలో చీకటిని చీల్చుకుంటూ. కుదుపులకు మూర్తి వసంతల శరీరాలు తాకుతూ వున్నాయి. అలా తాకుతున్నపుడు వారిరువురిలో విద్యుచ్ఛక్తి ప్రవహించేది. తరచు అలా శరీరాలు తాకినప్పుడల్లా ముఖాలలోకి చూచుకుంటున్నారు. వారిరువురి కళ్లూ దాగుడు మూతలాడినట్లు వెంటనే దాక్కుంటున్నాయి. ప్రశాంత వరణం వారిని మరీ రేకెత్తిస్తోం

మూర్తి నిగ్రహించలేకపోయాడు. అప్రయత్నంగా తనచేయి వసంత నడుమును చుట్టి తన కౌగిలిలోకి లాక్కున్నాడు. వసంత ఆ క్షణం అతని కౌగిలిలో గత కొన్ని సంవత్సరాలనుండి ఎరుగని అనుభూతి అనుభవించింది. ఎన్నాళ్ళ తరువాత తనకు అదృష్టం లభించింది అని తనలోనే ఆశ్చర్యపోయింది. నిజంగా తను అలా మూర్తి కౌగిలిలో శాశ్వతంగా ఉండిపోవా లనుకుంది. ఈ అమూల్యావకాశానికి గాబోలు తాను అప్రయత్నంగా ఈ వేళ ఇలా వచ్చింది. తన పరిస్థితి ఏమిటి? తను ఒక హైందవ వితంతువు. తనకు ఒక కూతురుంది. ఆమె భవిష్య త్తేమవుతుంది? తనకు ఇంకా చెల్లెళ్లున్నారు. వారిమీద కూడా తన కళంకఛాయ పడుతుంది. తను చదువుకున్నదై యుండి కూడా ఇలా క్షణిక భౌతిక వాంఛలకు లోనై పోవడమే?" ఈ ఊహలు ఆమెను కర్కశంగా వెనక్కు లాగిన ట్లనిపించింది. స్పృహ తెచ్చుకుంది.

"మాష్టారూ! మనం భౌతిక వాంఛలకూ, ఉద్రేకాలకూ లొంగిపోవడం భావ్యంకాదు."

"నన్ను క్షమించు వసంతా! నిజంగా నేను ఉద్రేకానికి లోనై నీ పరిస్థితి గ్రహించకుండా నీకు మచ్చతెచ్చే పాపాని కొడిగట్టుకున్న నీచుడను" అని ఆమెను తన కౌగిలినుండి జారవిడిచాడు.

ఇంతలో "బాబూ! కౌన్సీగల్లీ" అన్నాడు. టాంగావాడు.

"కుడి చేతి మీదకు త్రిప్పు" అన్నాడు. హిందీలో.

టాంగా కొంత దూరం దొర్లింది. మూర్తి ఆపమన్నాడు. వసంత దిగిపోయింది.

"మీరుకూడా రండి. ఈ పూట భోజనం చేసి వెళ్ళుదురు గాని. హోటలులో ఇప్పుడు భోజనం ఉండదు" అంది వసంత. "నేను భోజనం చేయను. మీరు ఉండండి అని టాంగావాలాను పోనీయమని హెచ్చరించారు. టాంగా సాగిపోతుంది. వసంత ఆ చీకటిలో టాంగా ఆకారం కనిపించినంత దూరం చూస్తూ నిలుచుండిపోయింది. ఆ చీకటిలో టాంగా పొట్టలో ఇమిడిపోయిన మూర్తి ఆకారం దృష్టి కందకపోయినా ఊహించుకొనే అతనిని చూస్తోంది. టాంగా మరియొక సందు తిరిగింది. వసంత ఇంట్లో ప్రవేశించింది.

మూర్తి ఇంటికి వెళ్ళేడు. కాని ఆ రాత్రి తనకు నిద్ర పట్టలేదు. తాను ఏదో ఖూనీ చేసి వచ్చిన వాడిలా భయంతో కూడిన బాధ అనుభవించాడు. తన కళ్ళ ముందు వసంత శాంత మూర్తే నాట్యం చేసేది. తను వసంతను ప్రేమిస్తున్నాడా? పెళ్ళి చేసుకోగలడా? వసంత అంగీకరిస్తుందా? అంగీకరించని దైతే తన కౌగిలిలో ఇమిడి తనకు అంత ఆనందా



మయింది. లేతగుండెలో పాతుకుపోయిం దోరకం నిరాశ. చిట్టిగుండెలో చిట్ట చీకటి అలముకుంది.. సున్నిత హృద యంలో సుత్తిదెబ్బలు. చీకటిలాంటి జీవితం వెలుగుకిరణం కోసం తపించి పోయింది.

* * *

రామ్మూర్తి...

రమణిని ప్రేమించాడు...రమణి రామ్మూర్తి ప్రేమను కాదనలేదు. ప్రమాణాలు చేసుకున్నారు. ఒకర్నొకరు పవిత్రంగా అర్థం చేసుకున్నారు. కాని.. దానికి సంఘం వేసే సంకెళ్ళు?? అర్థం లేనివి! వ్యర్థ మైనవి:

సంఘాన్ని కాదన్నాడు—తండ్రిమాట కాదవకముందే!

తండ్రి తారాజువ్వలా లేచాడు.

కొడుకు 'రాకెట్'లా మరీ మీద కెగిరాడు.

చర్న లేచిన తండ్రి చప్పున క్రిందకు దిగాడు.

కొడుకు...ఛస్తే క్రిందకురానన్నాడు.

ఆస్థి చిల్లిగవ్వ యివ్వను - బెదిరించాడు తండ్రి.

నాకు దానిమీద ఆస లాసేలేదు— విదిలించాడు కొడుకు.

మరి లలిత కేంసమాధానం చెప్తావ్?

నేను లలితను పెళ్ళిచేసుకుంటా నని యెప్పుడూ అన్లేదు.

మేం అనుకున్నాంగా!

పెళ్ళి చేసుకొనేది మీరా? నేనా?

చదువు కని పట్నం పంపితే కొడుకింత ప్రయోజకు డౌతా డని యేతండ్రి మాత్రం ఊహించ గలడు గనుక?

'కొద్దిగా ఆలోచించు రామం...ఈ ఆస్తి...అంతస్థూ...అంత కు మిం చి నా మాటను కాదని నువ్విలా చేయటం న్యాయం కాదురా! ఫలానా ఆదిశేషయ్య గారి కొడుకు ఇలాటిపని చేశా డని పదిమంది ఫక్కున నవ్వుతారు. కన్న కొడుకుగానీ తండ్రికి నువ్విచ్చే గౌరవ మర్యాదలు యింతేనట్రా! లక్షణంగా లలితను పెళ్ళిచేసుకుని యీ ఆస్థితోపాటు యీ రెండు కుటుంబాల మనశ్శాంతికి వారసుడ వైతే మా క్కావలసిం దేముంటుంది చెప్పు.

పాషాణం కరగలేదు — మేఘం విడలేదు.

ఆదిశేషయ్యగారు అంత కు మిం చి మరి రెచ్చిపోనూలేదు - ఆయ నన్నది ఒక్కటే. "నా మీద లేని ప్రేమ...అనురాగం...గౌరవం కనీసం నా ఆస్థిమీద ఉన్నా నిజం చెప్పెయ్యరా — ఆస్థంతా నీ పేర వ్రాసి ఎటో వెళ్ళిపోతాను — లేదూ — నువ్వే యీ మమకారాన్ని... బంధాల్ని...త్రెంచుకుని నాకు దూరంగా వెళ్ళిపో."

అంతే.

రామ్మూర్తి ఆదిశేషయ్యగారి హృదయంమీద అడుగు వేసుకుంటూ వెళ్ళిపోయాడు — ఆదిశేషయ్యగారి హృదయం మూగగా యేడ్చింది. తనకు మించిన గౌరవ మర్యాదలు పొందాలని కొడుకులమీద ఆశల పెట్టుకునే తండ్రులకు — కొడుకులు చేసే యింతటి ఘన కార్యాలు ఎంతటి పరిణామాలకు దారి తీస్తాయో చెప్పలేం.

మందు లేని మనోవ్యాధికి గురి అయ్యారు ఆదిశేషయ్యగారు డాక్టర్లు జబ్బేం లేదన్నారు — కాని రోజురోజుకు సడలిపోతున్నా రాయన మానసిక గాయానికి కట్టుకట్టి మాన్పించగల డాక్టర్ నిర్లక్ష్యం చేసి వెళ్ళిపోయాడు వాడే తనకొడుకు — భార్యా వియోగంతో ఎర్పడ్డ గాయాన్ని తిరిగి రేపి వెళ్ళిపోయాడు యీ నాడు పుత్రవియోగం— యిన్నిటిమధ్య పూర్తిగా నలిగిపోయాడు కొడుకుకు కబురుచేయమని యెంతో మంది యెన్నో విధాల నచ్చజెప్పారు — ససేమిరా ఆయన ఒప్పుకోలేదు 'యిక వాడెప్పుడు వచ్చినా నా కోసం రాడని నాకు తెల్సు—నాకోసం తపించేవా డయితే నా మాటకు కట్టుబడి ఉండేవాడు — వాడిలో ఏదయినా పరివర్తన కలిగి ఒక వేళ కనీసం ఆస్థికోసం అయినా వాడం తట వాడొస్తే కొంతయినా ఆత్మశాంతితో చచ్చిపోతానుతప్ప ఉధృతంగా వచ్చిన దగ్గుతెరలవల్ల మాట్లాడలేకపోయారు ఆదిశేషయ్యగారు

తనకుగా తాను తన కొడుకు నాహ్వానించటాని కాయన మన స్సంగీకరించ లేదు

* * *

ఉన్నడిగ్రీ పందపాతిక రూపాయల ఉద్యోగాన్ని సంపాదించి పెట్టింది రామ్మూర్తికి — రమణితో కాపురం పెట్టాడు — కొత్తకాపురం కొత్తకుండలో నీళ్ళలా తియ్యగా సాగిపోయింది. రెండేళ్ళు గడిచినా తండ్రికొడుకుల మధ్య రాకపోకలు ఉత్తరప్రత్యుత్తరాలు లేవు ఆదిశేషయ్యగారు చావుబ్రతుకుల్లో ఉండగా 'ఊళ్ళోవా రెవరో రామ్మూర్తికి కబురు చేశారు — రామ్మూర్తి వెళ్ళాడు — ఏదోరకమైన పరివర్తనతో తన్నాహ్వానించకుండానే తన కొడుకు వచ్చా డని మరణశయ్య మీద ఆదిశేషయ్యగారు కొద్దిగా తృప్తిపడ్డారు లలితా, మేనమామ రాజయ్యగారుకూడా వచ్చారు

రామ్మూర్తి లలితను చూచి గతుక్కుమన్నాడు

"నేను నీకేం అన్యాయంచేశాను బావా, కనీసం నీ పెళ్ళికి నన్ను పిలవనైనాలేదు " లలిత మాటలకు ఆశ్చర్యాన్ని మించి మరీసిగ్గుతో కృంగిపోయాడు రామ్మూర్తి మౌనంగా తల మరోప్రక్కకు తిప్పుకున్నాడు రాజయ్యగారు యేమీ జరగనట్టే ప్రవర్తించారు ఆదిశేషయ్యగారు రామ్మూర్తినీ ..లలితనూ ఒకచోట చూసి కంటతడిపెట్టారు ఆ తడి అరకమునుపే యీ లోకాన్ని శాశ్వతంగా విడచిపెట్టి వెళ్లనూ వెళ్లిపోయారు రామ్మూర్తి చేతుల మీదుగానే ఆదిశేషయ్యగారి అంత్యక్రియలు జరిగాయ్ ఆదిశేషయ్యగారు తన ఆస్థిలో సగం తిరుపతి దేవునికీ మిగిలింది లలిత పేరన వ్రాయించినట్టు యింటి లాయరు వెల్లడిచేశాడు

రామ్మూర్తి ఆవిషయం గురించి యేమీ కలుగజేసుకోలేదు.

'మామయ్య నా పేరన వ్రాసిన ఆస్థి ఎప్పటికయినా నీదే బావా అవసరం అవ్వించిన్నాడు ఒక్క ఉత్తరంముక్క వ్రాస్తే స్వయంగా వచ్చి నీ కందజేస్తాను

లలిత మాటలకు సమాధానం చెప్ప లేదు రామ్మూర్తి అక్కణ్ణుంచి బయట కెళ్ళి పోయాడు రాజయ్యగారు కూతురి విశాల హృదయానికి మనసులోనే మెచ్చుకున్నారు ఇంటికి తాళం పెట్టి మర్నాడు ఎవరి దోవన వా రెళ్లి పోయారు

రమణికి నెల తప్పింది, నెలలూ విండాయ్ తొలికానుపు కష్టమైపోయింది రమణి దక్కలేదు పసి గుడ్డు 'కేర్' మంది రామ్మూర్తి కంతా అంధకారమై పోయింది హృదయమంతా బరువెక్కి పోయింది అంతా శూన్యం అంతా చీకటి యెంత నిర్దయగా నన్ను శిక్షి స్తున్నావ్ భగవాన్...' నా బ్రతు కేం కావాలి? ఏమైపోవాలి, అంతటి నిరాశ లోనూ ఏదో కాంతి కిరణం పాప కేర్ మంది మళ్లీ రమణి అత్మకు శాంతి ప్రశాదించు భగవాన్ మిగతా కార్య క్రమం అంతా జరిగేవేళకు లలితా రాజయ్యగారూ వచ్చారు. రామ్మూర్తి చంటిపిల్లాడిలా వెక్కి వెక్కి యేడ్చాడు 'చూడు లలితా నా కెంత అన్యాయం చేసి వెళ్ళిపోయిందో రమణి కాగు . ఆమె ప్రతిబింబాన్ని నాకు విడచిపెట్టి యే శాంతిలోకానికో తరలిపోయింది.. "

లలిత ఓదార్చబోయింది ఏందుకో ఓదార్చలేదు

ఓదార్పు దుఃఖాన్ని ద్విగుణీకృతం చేస్తుం దనేమో?

రాజయ్యగారికి దుఃఖంతో నోరు పెగ ల్లేదు. పక్కకు తిరిగి కళ్లొత్తుకున్నారు

అంతకు తప్ప యేం చేయలేక పోయారు

అందరిలాగే పుట్టిపెరిగి, మట్టిలోకల్సి పోయింది రమణి కాని . జీవితంలో చవి చూడవల్సిన ఎన్నో కష్ట సుఖాల్ని. అభిరుచుల్ని పూర్తిగా అను భవించకుండా వెళ్ళిపోయింది

రాజయ్యగారు అర్జంటు పన్లుండటం చేత లలితను అక్కడ వదలిపెట్టి వెళ్ళి పోయారు లలిత పిల్లను సంరక్షిస్తూ వీలైనంతవరకూ రామ్మూర్తి మనస్సును మార్చడానికి .. గతాన్ని మరిపింప జేయడానికి ప్రయత్నిస్తోంది లలిత వచ్చి నెల్లాళ్ళయింది మధ్యలో రాజయ్యగారు రెండు మూడు సార్లు వచ్చి వెళ్ళారు

చూడు బావా! పాప ఎలా చూస్తూందో,

ఎలా చూస్తేనేం లలితా ఆ చూపుల్ని చూసి పొంగిపోయే తల్లికి, ఆ ఆనం దంతో వరద గోదావరిలా పరవళ్ళు త్రొక్కే మాతృమూర్తి కా అదృష్టం లేకపోయాక " యేవో జ్ఞాపకాల

బాధతో అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయాడు రామ్మూర్తి. లలిత కంతా అయోమయ మనిపిస్తోంది. రామ్మూర్తి సరిగా తిండయినా తినటంలేదు. రాత్రిళ్లు నిద్రపోడు – నిద్రపోయినా కొద్దిక్షణాల్లో ఏవో పలవరింతలు. ఒకరోజు రామ్మూర్తి భోజనం చేస్తూ కంచంలో వేలుతో పిచ్చి



గీతలు గీస్తున్నాడు. "మరికొంచెం పెరుగు అన్నం తినకపోతే నామీద ఒట్టే...కొద్దిగా యీ పులుసు వేసుకుని చెప్పండి ఎలా ఉందో. అలా కొత్తిమీర చూస్తే ఆముదం త్రాగినట్టు పెడతారేం

ముఖం'' అనే రమణి యీరోజు తన పంక్తిన లేదు - యికెప్పుడూ ఉండదు

'బావా !'

ఉలిక్కిపడి లలిత ముఖంలోకి చూశాడు

"యేమి టాలోచిస్తున్నావ్ "

సమాధానంగా ఒక్క బరువు నిట్టూర్పు విడిచాడు

ఆ నిట్టూర్పులో అర్థం లలితకు తెల్సు ఆ బాధ ఎంత దారుణమైందో ఆమె ఊహించగలదు "నువ్విలా నీ మనస్సును పాడుచేసుకోవటం యేం బాగులేదు బావా విజమే - నువ్వన్నిటి కంటే ఆధిక్యంగా భావించుకునే రమణి నీకు లేకుండా పోయింది ఆ బాధ నీకంటే వెయ్యి రెట్లుగా మా హృదయాల్ని బ్రద్దలు చేస్తోంది "

అంత బాధలోనూ ఆశ్చర్యపడ్డాడు రామ్మూర్తి

గతాన్ని జ్ఞాపకంచేసి నిన్ను బాధించాలని కాదు బావా ఒక్క దానికి సూటిగా సమాధానం చెప్పు నీమీదే ఆశలు, అనురాగాలు పెంచుకుని జీవితానికో పరిధిని నిర్ణయించుకున్నాక నువ్వు కాదన్ననాడు నా హృదయం ఎంతలా చితికిపోయిందో-అంతకు రెట్టింపుగా నీమీద ప్రేమాభిమానాలు పుట్టుకొచ్చాయ్ ఎందుకో నిన్ను ద్వేషించాలని, నువ్వు మోసం చేశావని అనిపించలేదు నా ఆశలు ..నా కలలు గగనకుసుమా లయినా - బాధవిపించింది, ఏ రెండు నిముషాలో నని ఖచ్చితంగా చెప్పగలను ఆ తర్వాత నాబాధను సానుభూతిగా నీ సంతోషాన్ని నా సర్వస్వంగా మార్చుకున్నాను నన్నొక పిరికితనం వెంటాడింది బావను నేను సుఖపెట్టగలనో లేనో అని నిన్నన్నివిధాలా సుఖపెట్టే భార్య నీకు లభించిన్నాడు అంతకంటె సంతోషించాల్సిన విషయం మరొకటి లేదనే భావించాను అందుకే నాన్నతోనూ, మావయ్యతోనూ నిక్కచ్చిగా ఆ విషయన్నే చెప్పాను యిప్పుడు చెప్పు బావా, గతాన్ని పదిరెట్లుగా ఊహించుకుని బాధపడటమా ప్రస్తుతానికి అనుగుణ్యంగా హృదయాన్ని మార్చుకుని భవిష్యత్తును బాగు చేసుకోవటమా ? ఎందులో ఉందంటావ్ తృప్తి

మధ్యలోనే చెయ్యి కడుక్కుని లేచి పోయిన రామ్మూర్తిని ఏ మనటానికీ తోచక అలా చూస్తూ ఉండిపోయింది లలిత

సాయంత్రం రాజయ్యగారు వచ్చారు చాలా చీకటిపడే వేళకుగాని రామ్మూర్తి యిల్లు చేరలేదు భోజనాలయ్యాక వాకిట్లో కూర్చున్నారు ముగ్గురూ పాప ప్రశాంతంగా నిద్రపోతూంది, వీళ్ళగొడవ తన కేం పట్టనట్లు

'ఓ నెల్లాళ్ళు శెలవుపెట్టి అక్కడికి వచ్చెయ్‌వోయ్ కాస్త విశ్రాంతి తీసుకో

వచ్చు రాజయ్యగారి మాటలకు ఆలో చిస్తూ ఉండిపోయాడు రామ్మూర్తి

'ఏం బావా?'

'సరే' అన్నాడు రామ్మూర్తి ఆ గొంతులో బాధ స్పష్టంగా వినిపిస్తోంది

మర్నాడు పదిగంటల కాఫీసు కెళ్ళి శెలవు కాగితం యిచ్చేసి పన్నెండు గంటలకు తిరిగివచ్చాడు

మూడు గంటలకు పాపతో సహా నల్గురూ బయటపడ్డారు

నెల్లాళ్ళూ యిట్టే గడిచిపోయినట్టని పించింది రామ్మూర్తికి. అక్కడున్న నెలరోజుల్లోనూ లలిత రామ్మూర్తిని మామూలు మనిషిగా తయారు చేసింది వెనకటి నిరాశ...దైన్యం రామ్మూర్తిలో యిప్పుడు లేవనే చెప్పాలి- నవ్వుతాడు, నవ్విస్తాడు, వాటి వెనుక ? ఏమో మరి!

పాపను యిక్కడే వదిలెయ్ బావా వారం వారం వచ్చి చూసివెళ్ళవుగాని లలిత మాటలకు కాదనలేకపోయాడు పైగా అదీ మంచిదే. త నేం చెయ్యగలడు కనుక ? పైగా ఉద్యోగం

తప్పక రావాలి సుమా ప్రతి వారం- మరోసారి హెచ్చరించింది లలిత

'అలాగే'. . రామ్మూర్తి ఆ వేళే బయల్దేరాడు

ఇంటి కొచ్చేసరికి తిరిగి గతం అంతా లావాలా పొంగింది శూన్యం చీకటికెరటాల్లాంటి ఆలోచనలు రమణి- రమణి కదిలికలు ఎన్నో ఎన్నెన్నో ...రామ్మూర్తిని పిచ్చివాణ్ణి చేస్తున్నాయ్. మౌనం - ఎవరితోనూ మాట్లాడడు - ఎప్పుడూ ఏదో పరాకు తోటి గుమా స్తాలు ఎంతోమంది ఎన్నోవిధాల ప్రయ త్నించారు లాభం లేకపోయింది

యెవరో యిల్లు మార్చేయమని అన్నారు మొదట్లో యిష్టపడలేదు స్నేహితుల బలవంతంమీద యిల్లు మార్చక తప్ప లేదు శేషాద్రి మేష్టారింట్లోకి మారి పోయాడు మార్పు కొంత శాంతి కలి గించినా, ఆలోచనలకో అంతంటూ ఉండేదికాదు మొదట్లో రెండుమూడు వారాలు పాపను చూసివచ్చేవాడు ప్రతి వారం వెళ్ళి - తర్వాత తర్వాత రెండు వారాలకో. .నెలకో - యే రెణ్ణెల్లకో వెళ్ళేవాడు

ఒక్కోరాత్రి యింటిదగ్గర కూర్చుని భవిష్యత్తు గురించి తీవ్రంగా ఆలోచించే వాడు తన భవిష్యత్తేం కావాలి ? తనను తనే ప్రశ్నించుకునేవాడు నిజానికి ఎవ రికీ అంతుపట్టని ఆలోచన అది - అయినా దానిగురించే ఆలోచించేవాడు

'తనేంచేయాలి? ఇరవై ఎనిమిదేళ్ళు తనకు పూర్తిగాలేదు మిగిలిన జీవిత మంతా ఎలా గడపాలి? తిరిగి వివాహం ..' ఈ ఆలోచన రావటంతో ఎందుకో నిలువునా కంపించిపోయాడు

నిత్యం ఎవరో ఒకరు రామ్మూర్తిని అదే విషయమై నచ్చజెప్తారు తను కాదనడు ఔనని అంతకంటె అనడు

విర్లిప్తమైన ఓ నవ్వే అతను చెప్పే సమాధానం లేకపోతే అదీ ఉండదు వినన ట్టూరుకుంటాడు యింటికి వచ్చి తిరిగి ఆవిషయంమీదే ఆలోచిస్తాడు

సంవత్సరం అయిపోయింది రమణి పోయి పాప లలిత దగ్గరే పెరుగు తోంది తనకు తోచినప్పుడోసారి వెళ్లి చూసివస్తున్నాడు చివరి కొక ఆలోచన వచ్చి రక్కున ఆగిపోయాడు రామ్మూర్తి 'లలితనే వివాహం చేసుకుంటే? లలిత కాదంటే? గతాన్ని త్రవ్వి తనను దెప్పి పొడుస్తే? అంతకంటె చిత్రవధ మరే ముంటుంది పాప యింతకాలం లలిత చేతుల్లోనే పెరిగింది లలితే పాపకు తల్లి కావాలి .ఆ మాతృత్వం నిజం కావాలి కనీసం పాపకోసమైనా లలిత ఒప్పుకుం టుంది ఒక నిర్ణయానికొచ్చిన రామ్మూర్తి అదే విషయాన్ని ప్రస్తావిస్తూ లలితకూ ..రాజయ్యగారికీ ఉత్తరాలు వ్రాశాడు

ఉత్తరం అందుకున్న రాజయ్య గారు లలిత దగ్గర ఆ విషయాన్ని కదిపారు, లలిత యిష్టం లేందే ఆ యింట్లో యేపనీ జరగదు అలా లలిత యిష్టంమీద జరిగే యేపనయినా రాజయ్య గారికి తృప్తిగానూ సహజంగానూ ఉంటుంది అందుకే కూతుర్ని పిలిచి అడిగింది

"ఏమిటి నీ ఉద్దేశం?''

"క్షమించండి నాన్నా నాకు బావమీద ఆ ఉద్దేశం లేదు"

కూతురు సంగతి తెల్సిండీ నిర్ఘాంత పోయారు రాజయ్యగారు

"సరే నీ యిష్టం - బావకు జవాబు వ్రాయనా?"

''నే వ్రాస్తాలే నాన్నా"

"సరే - అయినా ఒక్కసారి ఆలో చించి - నీ కేదిమంచిదని తోస్తే అలా చెయ్యమ్మా ''

''అలాగే నాన్నా."

* * *

లలిత దగ్గర్నుంచి వచ్చిన ఉత్తరాన్ని ఆతృతగా చదవటం మొదలెట్టాడు రామ్మూర్తి

''బావా!

ఇలా వ్రాస్తున్నందుకు క్షమించు- పిడుగుపాటు కేర్పడిన వెలితిని పిడు గుల్తో పూడ్చడం అసాధ్యం ఆ శూన్యాన్ని ఆ అగాధాన్ని మరో మట్టితో పూడ్చాలి .. సానుభూతి . వాత్సల్యం అభిమానంలాటి మట్టితో మన యిద్దరి పట్ల మన కుండవల్సిన అభిప్రాయాలకు అదొక్కటే మార్గం నా కున్న అభిప్రాయం అది ప్రేమాభి మానాల్ని పంచియిచ్చే సోదరిగా నీ హృదయంలో నాకు స్థానాన్నిస్తే అది చాలు బావా

బావా ఒక్కమాట - నువ్వెలాగూ పెళ్ళిచేసుకోవాలని సంకల్పించుకున్నావు




కనుక... తిరిగి ఆ అభిప్రాయాన్ని చంపుకోకుండా... నీ ఆదర్శాల కనువైన అమ్మాయిని పెళ్ళి చేసుకో. కనీసం నా యీ కోరికైనా మన్నించు బావా... ఉంటాను.

లలిత''

ప్రపంచం అంతా గిర్రున తిరిగినట్లయింది. కాలం స్థంభించి పోయినట్లుంది. కోపం... ద్వేషం... అసహ్యం... తో వణికి పోయాడు రామ్మూర్తి. ఏమిటిలా తన జీవితంతో దేముడు చదరంగం ఆడుతున్నాడు. యెందుకీ కఠిన పరిక్షలు? నేవేపాపం చేసాను భగవాన్' వాపోయాడు రామ్మూర్తి...

మరో పది రోజుల్లో లలిత పెండ్లి శుభలేఖ వచ్చింది. పెళ్ళికుమారుడు యింజనీరు ... ఎందుకో రామ్మూర్తి తనతో పోల్చుకున్నాడు...తనొక చిన్న గుమస్తా...అతను యింజనీరు. తన లాటి నలుగురు గుమస్తాల జీతం ఆయన కొక్కడికి...పైగా అధికారం... హోదా ... అప్రయత్నంగానే అనుకున్నాడు, 'నువ్వెంత అదృష్టవంతురాలివి లలితా.' ఆ మాటలకు తనే ఆశ్చర్య పోయాడు. అక్షణంలో లలితం టే రామ్మూర్తికి ద్వేషంలేదు. కోపంలేదు. ఏదో జాలి, సానుభూతి, రెండు కన్నీటి బొట్లు శుభలేఖమీద రాలాయ్. అవి దుఃఖాశ్రువులు కాదు. ఆనంద బాష్పాలు- పెళ్ళి రెండ్రోజు లుందనగా రాజయ్యగారు వచ్చారు.

"ఆరు వారాలుగా అసలు రావటం మానేశేవేం ?"

జవాబు చెప్పలేదు రామ్మూర్తి.

"అన్నీ నీకు తెల్సు-నేను చెప్పవల్సిన వాణ్ణి కాదు. విధివిలాసాన్ని మనం కాదనలేం. యెలా జరగవల్సినవి ఆలా జరిగిపోతూనే ఉంటాయ్... మనలో మనం తాత్కాలికమైన ద్వేషాలు పెంచుకోవటం..."

''మామయ్యా''

"నీ బాధ నాకు తెల్సు రామం.. నీ చేతిమీదుగా రెండు అక్షింతగింజలు వేసి తన నాశీర్వదించమని లలిత తన మాటగా నీతో చెప్పమంది."

రామ్మూర్తి హృదయం చలించిపోయింది. "అలాగే మావయ్యా. సంతోషంగా వస్తాను. హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తా."

రాజయ్యగారి హృదయం తేలికపడింది. రామ్మూర్తిని స్వయంగా తీసుకుని మరీ వెళ్ళారు.

లలిత పెళ్ళయిపోయింది.

"పాపను నాతో తీసుకు వెళ్ళిపోతాను మావయ్యా."

'మిష్టర్ రామ్మూర్తీ!' లలిత భర్త కేశవమూర్తి పిలుపుకు అటు తిరిగాడు రామ్మూర్తి...

'లలితతోనే పాపనీ ఉండనీండి, కొంతకాలం..తర్వాత తీసుకెళ్దురుగాని..'

జవాబు చెప్పలేకపోయాడు రామ్మూర్తి.

కేశవమూర్తి రామ్మూర్తిని అహ్వానించాడు తనింటికి. రామ్మూర్తి వెళ్లాడు.

"చూడు బ్రదర్! లలి తంతా నాకు తెలియజేసింది. మిగిలిన జీవిత మంతా యిలా నిస్సారంగా గడిపేకంటే... యేదో ఒక నిర్ణయాని కొచ్చి తిరిగి మీ యింటి దీపాన్ని వెలిగించుకోవల్సిన బాధ్యత యెంతయినా నీకుంది. కనీసం పాపకోసం అయినాసరే ..."

మౌనంగా ఊరుకున్నాడు రామ్మూర్తి... కేసవమూర్తి దగ్గర... లలితదగ్గర శెలవు తీసుకుని బయట పడ్డాడు.

మరో ఆరు మాసాల తర్వాత రామ్మూర్తికి శేషాద్రిమాస్టారమ్మాయి రుక్మిణితో వివాహ మయింది. లలిత, కేశవమూర్తి, రాజయ్య గారూ కూడా వచ్చారు.

"ఇదిగో బావా నీపాప ... మావారు పేరు కూడా పెట్టేశారులే...ఉషాబాల. బాగుందికదూ..."

బొద్దుగా...ముద్దుగా రమణిపోలికల్లో ఉంది ఉషాబాల. హృదయానికి బలంగా హత్తుకున్నాడు."నారమణి ప్రతిబింబాన్ని నాకు వప్పజెప్పావ్...చూడు లలితా... అంతా దాని పోలికే" రామ్మూర్తి కంఠం బాధతో వణికింది. ఉషాబాలను వదిలి వెళ్ళటం లలితకూ బాధనిపించింది. బాధగా భర్తముఖంలోకి చూసింది.

'ఇంకో ఆర్నెల్లలో నీకూ ఓ ఉషాబాలో, ఉషాబాలుడో వస్తాళ్లే' నెమ్మదిగా లలిత చెవిదగ్గర అన్నాడు కేశవ



మూర్తి. లలిత సిగ్గుగా ముడుచుకుపోయింది.

'ఉత్తరాలు వ్రాస్తూండుబావా. ఏం రుక్మిణక్కా నువ్వుగూడా.'

'చూద్దాం' రుక్మిణి నిర్లక్ష్యం అందర్నీ ఆశ్చర్యపర్చింది. రామ్మూర్తి

'కించ పడ్డాదు కదలిపోయారు లలితా, కేశవమూర్తీ...

రాజయ్యగారు కూడా ఆ సాయంత్రం వెళ్ళిపోయారు

*　*　*

రుక్మిణి కాపురాని కొచ్చిన యీ ఎని దేళ్ళ రామ్మూర్తి జీవితంలో నూ రామ్మూర్తి సుఖం కంటె నరకమే ఎక్కువగా అనుభవించాడని చెప్పవల్సి వస్తుంది భర్త తన మాట కెదురు చెప్పకూడదు తనను స్వతంత్రంగా తిరగనివ్వాలి తనెంత చెప్తే అంతగా ఆ యింట్లో జరగాలి తన అనుమతి లేనిదే యిటున్న చీపురుపుల్ల అటు పెట్ట డానికి వీల్లేదు యిదీ రుక్మిణి వరుస ఇక ఆ యింట్లో 'ఉషాబాల' జీవితం ఒక సమస్యగా పరిణమించింది నలుగురిలో తనలా కల్సి తిరగ కూడదు యిరువై నాలుగ్గంటలూ వెట్టిచాకిరీ చేస్తూ యింటిని అంటిపెట్టు క్కూర్చోవాలి సరియైన తిండీ, బట్టలకు నోచుకోలేదు ఉషాబాల. రామ్మూర్తి భార్య మాట కెదురు చెప్పడు, చెప్పలేదు, యంత్రంలా పని చేసుకుంటూ పోతోంది ఉషాబాల

ఓనాడు ముచ్చటపడి రెండు జడలు వేసుకుంది ఉషాబాల

'నీ పాడు మొహానికదొక్కటే తక్కువ ముడిచుట్టుకో చాలు' అంటూ దగ్గరుండి జడను ముడి వేయించింది రుక్మిణి

అప్పుడప్పుడు లలిత వచ్చి ఉషా బాలకు అర్ధరూపాయి యిచ్చేది పువ్వులు కొనుక్కోమని . . తను కొనుక్కోవటానికయినా ఆ యింట్లో స్వతంత్రం లేదు ఆ డబ్బులు ఓచోట భద్రంగా దాచేది

ఎవరో అమ్మాయి ఎర్రటి రిబ్బను జడకు కట్టుకుని వెళ్తూంటే దాని మీద తనకు మనస్సు పుట్టింది రిబ్బన్ల అబ్బిని పిలిచి ఓరిబ్బను కొనుక్కుంది.

'యెక్కడిదే నీకది' రుక్మిణి అదలింపు

'అణా యిచ్చి కొన్నానమ్మా

'నీకు డబ్బు లెక్కడివి?'

మాట్లాడలేదు ఉషాబాల

'దొంగతనంకూడా చేస్తున్నావా ... ఆచెంపా యీచెంపా వాయించింది. 'పుట్టి తల్లిని పొట్టబెట్టుకున్నావ్ యీ దొంగ బ్రతుకు బ్రతక్క పోతే చావరాదూ' ఒక్క మొట్టికాయ మొట్టి వెళ్ళిపోయింది రుక్మిణి

నీతోపాటు నన్నూ తీసుకు వెళ్ళ కుండా యెందుకు వదిలేశావమ్మా అని వెక్కి వెక్కి యేడుస్తూండగా రామ్మూర్తి వచ్చాడు

'ఎప్పుడూ ఏడుపుముఖం నువ్వూ. నా కగుపించకు పో' అని కసిరాడు. దానితో ఉషాబాల మరీ ... మరీ ... యేడ్చింది

కన్నతండ్రే ఇంత కఠినంగా ప్రవర్తిస్తుంటే పిల్లల గతేంకావాలి ?

తనకడుపు యిన్నాళ్ళకు ఫలించబోతున్న రుక్మిణిలో ఉషాబాల మీదున్న ద్వేషం ద్విగుణీకృతం కాజొచ్చింది ఫలితంగా ఆమె బ్రతుకా యింట్లో మరీ దుర్భరమైపోయింది

రుక్మిణి ప్రసవించింది

మగపిల్లవాడు పుట్టాడు

ఇటు రామూర్తికీ, అటు రుక్మిణికీ సంతోషాని కవధుల్లేకుండా పోయింది

యిలా సతమతమౌతున్న ఉషాబాల యేనాడూ ఎవరితోనూ ఏమీ చెప్పేది కాదు లలితకు కూడా చెప్పేదికాదు

ఉషాబాలకు పద్నాలుగేళ్ళొచ్చాయ్

వయస్సుతో బాటు కోరికలూ పుట్టటం ప్రకృతి సహజం

కాని .

తనంతట తాను ఎలా చెప్పుకోగలదు ? ఏమని చెప్తుంది ? ఆయింట్లో గోడు విన్పించుకొనే దెవరు ?

తను బట్టలుతక్కపోతే యిల్లు ఊడవకపోతే బూజులు దులపకపోతే తనను మందలించే వాళ్ళు ఉన్నా రాయింట్లో తను కడుపునిండా తినకపోతే అడిగేవాళ్ళు లేరు పైగా పోతులాగ తింటానికి తప్ప యెందుకూ పనికిరావని సవితల్లి రుక్మిణి దెప్పిపొడుస్తుంది

"నాకూ అందరిలా ఓ మాంగల్యం ఉంటే. భర్తతో కాపురం చేస్తూంటే "

అంట్లు తోమటం ఆపేసి ఏమిటలా రోడ్డువైపు చూస్తున్నావ్ నీ మొగు డెవడూ అక్కడ లేడులే

రుక్మిణి పొలికేకతో తియ్యటి ఆలోచనలుకూడా చెదరిపోతాయ్. .తన కా యింట్లో ఆలోచించుకోటానికైనా హక్కు లేదన్నమాట

ఆ రోజు రామ్మూర్తి, రుక్మిణి, బాబు సినిమా కెళ్తున్నారు

ఉషాబాల కెంతో ఉత్సాహం కల్గింది త నింతవరకూ సినిమా ఎలాఉంటుందో చూడలేదు తననూ తీసుకవెళ్తే.

ఉత్సాహా న్నాపుకోలేక అడిగేసింది 'నేనూ వస్తానమ్మా సినిమాకి'

'నీ మొహానికదొక్కటే తక్కువ వెళ్ళు' గర్జించింది రుక్మిణి.

యింత సంతోషమూ చప్పున చల్లారిపోయింది ఓ మూల కూర్చుని వెక్కి వెక్కి యేడ్చింది వాళ్ళు సినిమా కెళ్ళి పోయారు.

ఉషాబాలలో ఏదో చైతన్యం, తెగింపు కల్గుతోంది, యిప్పుడిప్పుడే_ ఒంటరితనంలో ఆలోచనలు తన తెగింపును మరీ సమర్థించాయ్ యెవరికీకాని త నీయింట్లో ఉంటేనేం ? లేకపోతేనేం ? తనను గురించి బాధపడేవాళ్లు లేనప్పుడు త నెందుకు బ్రతికి ? చచ్చిపోవటమా ?

హేయ మవిపించింది మరెలా? ఏం చేయాలి? ఎక్కడికి కెళ్ళాలి?

'లలిత పిన్ని' మెరుపులా మెదిలింది

అక్కడికి కెళ్తే

పరిణామా లెలా ఉంటాయో? ఏమైనా సరే

తనను సానుభూతితో అర్థం చేసుకునే వాళ్ళెవరయినా ఉన్నా రనుకుంటే అది 'లలితపిన్ని' ఒక్కతే

యీ ఆలోచన రాగానే గుండె రాయి చేసుకుంది దాచుకున్న డబ్బు తీసుకుంది మూడుమైళ్ళ దూరంలో ఉన్న లలిత యింటికి రిక్షాలో బయల్దేరింది యేదో మొండితనం ధైర్యం ఆవహించిం దామె హృదయంలో

రిక్షావాణ్ణి పంపేసి యింట్లో అడుగు పెట్టింది ఒంటరిగా వచ్చిన ఉషాబాలను చూసి నిర్ఘాంత పోయింది లలిత కొద్ది క్షణాల క్రిందట ధైర్యం అంతా నీరుగారి పోయింది బావురు మంటూ పిన్ని ఒడిలో తల దాచుకుంది ఉషాబాల విషయాన్ని తెల్సుకున్న లలితకు రామ్మూర్తి మీద తెగ విద్వేషం యేర్పడింది యిలా కన్నకూతుర్ని చిత్రహింసకు గురిచేస్తా దని ఊహించే ఉంటే యేనాడో తను కొంత జాగ్రత్త పడేది లలిత తల నిమురుతూ మందలించింది ఉషాబాలను 'చాలా తొందర పడ్డావు ఉషా ఉత్తరం వ్రాస్తే నే నొచ్చేదాన్నిగా పోనీ నె నొచ్చినప్పుడు ఎప్పుడూ ఆ విషయమే చెప్ప లేదు యిలా చెప్పా చెయ్యకుండా వచ్చేస్తే లోకానికి కళ్ళులేవు ఉషా లోకంవరకూ యెందుకు? అయిన వాళ్లే నిందలు వేస్తారు

ఒళ్ళు జలదరించింది ఉషాబాలకు అప్పటిగ్గాని తను చేసినపని యెంతటి దారుణ పరిణామాలకు దారి తీస్తుందో ఊహించలేక పోయింది వెక్కి వెక్కి యేడుస్తూ ఉండిపోయింది

'లే ఉషా భోజనం చేద్దువుగాని '

ఉషాబాల లేచింది ముఖంకడుక్కొని వచ్చి భోజనందగ్గర కూర్చుంది

లలిత మరీమరీ కొసరి వడ్డిస్తూంది యింతటి ఆప్యాయతతో త నొక్కనాడు ఐనా ఆ యింట్లో భోజనం చేసిందా? మధురానుభూతి పొందింది యీ నాడు పిన్ని బలవంతంగా తనచేత తినిపిస్తోంది తన జీవితంలో యీ రోజు మర్చిపో లేనిది

భోజనం చేశాక యిద్దరూ వాకిట్లో కూర్చున్నారు

'బాబాయ్‌గారు లేరా పిన్నీ?'

కేంప్ కెళ్ళారు. రెండ్రోజుల వరకు రారు పోయి పడుకుందాం రేపుద యాన్నే యింటి కెళ్దాం '

'పిన్నీ!'

'నేనూ నువ్వూ కలిసే వెళ్దాంలే నే చెప్తాగా '



"ఆ వెళ్ళే ఆయనతో ఆ బొమ్మ నువ్వు వేశానని చెప్పావో డొక్క చీరేస్తాను ఆ బొమ్మకు వెయ్యి రూపాయ లిచ్చాడు ఆయన "

కొంత ధైర్యాన్ని చేజిక్కించుకుంది ఉషాబాల

యిద్దరూ నిద్ర కుపక్రమించారు

* * *

ఉదయం ఎనిమిదిగంటలకు ఉషా బాలతో యిల్లుచేరిన లలితను చూసేసరికి రామ్మూర్తి రుక్మిణీకూడా నిశ్చేష్టు లయ్యారు. ఒక్క క్షణంసేపు రుక్మిణి ముఖం అప్పటికప్పుడే జేవురించింది ప్రక్కన లలిత లేకపోతే ఉషాబాల గతి ఏ మయ్యేదో!

"రాత్రి యెనిమిది గంటలకు మా వారూ నేనూ వచ్చాం బావా మీరు సినిమా కెళ్ళారు ఆయన తప్పనిసరిగా యిక్కణ్ణుంచి మరోఊరు వెళ్ళవల్సి వచ్చింది. ఆ రాత్రికిరాత్రే నన్నిక్క డుండిపొమన్నారు అయన వెళ్ళి పోయారు కాని యింటిదగ్గర పిల్లల్ని ఒంటరిగా వదిలేసివచ్చాం నా ధ్యాసంతా అచే ఉంది మనస్సు నిలువలేదు ఒంట రిగా వెళ్ళలేక ఉషను తోడు తీసుకెళ్లాను క్షమించు బావా "

రామ్మూర్తి కేం చెప్పటానికి పాలు పోక మౌనంగా ఊరుకున్నాడు రుక్మిణి మూతి విరిచి లోపలి కెళ్ళిపోయింది

ఉషాబాల గండం గడిచినట్లు బరువుగా నిట్టూర్చింది లలితకు మనస్సులోనే వెయ్యిదణ్ణాలు పెట్టుకుంది

ఆ మధ్యాహ్నం ఉషాబాల లలిత ప్రక్కనే కూర్చుని భోజనం చేసింది అయిష్టంగానే రుక్మిణీ భోజనం చేసింది వాళ్ళతోనే

నాలుగ్గంటలకు కాఫీ లయ్యాక అంది లలిత, 'అలా పార్కు కెళదామా బావా '

'ఏం రుక్కూ '

'నేను రాలేను. మీరు వెళ్ళండి ..'

లలిత రామ్మూర్తి బాబును తీసు కుని పార్కువైపు నడిచారు దారిలో ఎవరూ ఏం మాట్లాడుకోలేదు బాబు తనలో తనే యేదో గొణుక్కుంటూ మురిసి పోతున్నాడు పార్కు చేరాక యిద్దరూ ఓ మూలగా గడ్డిమీద కూర్చున్నారు బాబు విపరీతంగా గోల చేస్తుంటే

రామ్మూర్తి గట్టిగా కసిరాడు బాబు బిక్క మొహం వేసుకుని లలిత ఒళ్ళో చేరాడు

"నా మీద నీ కింకా కోపం పోలేదా బావా" లలిత మొదలుపెట్టింది గడ్డిలో వేళ్ళతో గీస్తూ

"నీ మీద నా కెందుకు లలితా కోపం ? ను వ్వేం చేశా వని ?"

కొద్ది క్షణాలు మౌనంగా ఊరుకుని తర్వాతఅంది లలిత 'నీ పెళ్ళికొచ్చినప్పు డొకటన్నావ్ గుర్తుందా బావా '

'ఏమి' టన్నట్టు లలిత ముఖంలోకి చూశాడు రామ్మూర్తి

'నా రమణి ప్రతిబింబాన్ని నాకు వప్ప జెప్పావ్ చూడు లలితా అంతా దాని పోలికే' అన్నావు గుర్తుందా బావా

'లలితా' ఒక్కసారి రామ్మూర్తి ముఖం అంతా కళాహీనమై పోయింది గతం అంతా కళ్ళముందు మెదిలింది యేదో వెలితి కన్పించింది యేదోతప్పు చేయరానితప్పు చేశాడు తను హృదయం బరువెక్కిపోయింది

'ఆ ప్రతిబింబాన్నేనా బావా నువ్వు యిప్పుడు అన్యాయం చేసేది '

'లలితా!' గొంతు గాద్గదిక మైంది శరాఘాతం తిన్నట్టుగా ఐపోయాడు రామ్మూర్తి

'ఉష గురించి నువ్వే పట్టించుకోక పోతే ఆ లేతహృదయం ఏమైపోతుందో ఆలోచించు బావా '

'లలితా!' యీమారు రామ్మూర్తి కళ్ళలో నీళ్ళు స్పష్టంగా లలిత కంట బడ్డాయ్ 'చాలా అన్యాయం జరిగి పోయింది లలితా ఉషకు యేవో గడ్డు తెరలక్రింద పడిపోయి నా రమణికి అన్యాయం చేస్తున్నాను నా రమణి ప్రతి బింబాన్ని నరకయాతనకు గురిచేశాను నా కళ్ళు తెరిపించావ్ నువ్వు నిజంగా నా పాలిట దేవతవు లలితా '

'బాధపడకు బావా మావయ్య నాపేర వ్రాసిన ఆస్థి ఉందిగా అది ఉష పెళ్ళికి వినియోగిద్దాం నా మాట కాదనకు '

'నీ యిష్టం నీ యిష్టం వచ్చినట్లే చెయ్యి లలితా ఉషకు నిజమైన మాతృ మూర్తివి నువ్వే '

'పద బావా చాలా ఆలస్యమైంది యింటికి పోదాం '

యిద్దరూ లేచారు

* * *

"ఎంత నంగనాచివే రాత్రంతా యే మొగుళ్ళకోసం తిరిగావో తిరిగి, తిరిగి కొంపచేరితగుదునమ్మా అని దాన్ని వెంటబెట్టుకొచ్చావ్, కప్పిపుచ్చుకోవడా నికి నిత్యం నిన్ను చూస్తూనే ఉన్నాను యెప్పుడూ ఆ చూపులు రోడ్డుమీదే

'అమ్మా' సహించలేక పోయింది ఉషాబాల.

'ఎవరే నీకు అమ్మ నీ యమ్మ యేనాడో చచ్చింది సిరిగల తల్లివి పుట్టిన్నాడే తల్లిని చంపేశావ్ ఈ యింటి పరువు ప్రతిష్టను మంటగలప

డానికి దాపురించావ్ శనిలా ఈ యింటిని పట్టుకు పీడిస్తున్నావ్. .చావు ' జుత్తు పట్టుకుని రుక్మిణిని బలంగా తోసిన విసురుకు తూలిపడబోయిన ఉషాబాలను అప్పుడే గుమ్మంలో అడుగుపెట్టిన లలిత గభాల్న పట్టుకుంది రామూర్తి యీ దృశ్యాన్ని చూసి సహించలేపోయాడు కోపంతో నిలువునా కంపించిపోయాడు రుక్మిణి గొంతు మేఘగర్జనలా ఉంది రామూర్తికి 'ఏం యింకా ఆ నెంగనాచిని యింట్లో పెట్టుకుని '

అంతే

చెంప 'ఛెళ్ళు . ఛెళ్ళు' మంది

లలిత వారించబోయింది – రుక్మిణికి తగలవల్సిన దెబ్బ లలిత చెంపను ఛెళ్ళు మనిపించింది–

రామ్మూర్తి నిర్ఘాంత బోయాడు— తన తొందరపాటుకు బిడియపడ్డాడు చిన్నగా నివ్వింది లలిత – ఫరవాలేదులే బావా – నువ్వు మరీ ఆవేశపరుడవు – యెంత తోస్తే అంతే బావా రుక్మిణక్క కడుపుతీపి తెలియనిది కాదు కొంచెం ఆవేశపరురా లంతే – అంత కంటే అమాయాకత్వం అంటేనే మంచిదేమో? ఆడపిల్ల బరువా మెకు తెలియంది కాదుగా—తనపెళ్ళి కెంత కష్టపడ్డారో— యెంత ఆతృత పడ్డారో తనకూ తెలుసు. కన్నకూతురైనా పవితికూతురైనా ఎదిగిన ఆడపిల్లను ఒకసమిష్టి కుటుంబంలో ఉంచుకోవటం యెవరికిమాత్రం గౌరవం? . పోతే. సానుభూతిని ప్రేమనూ పంచియిచ్చిన మూర్తిగా... తన పిల్లను ఒక అయ్యచేతిలో పెట్టాలనే బాధ్యత ఎప్పటికీ తప్పదు అంతేకదూ అక్కా–

రుక్మిణి కొద్ది క్షణాలు మాట్లాడలేక పోయింది – ద్రవిస్తున్న హృదయంతో కన్నీరు కార్చింది మౌనంగా వెళ్ళి ఉషాబాలను గాఢంగా కౌగలించుకుంది – మూగమనసులు కన్నీళ్ళు కార్చాయ్. మ మ తా ను రా గా ల్ని ఒ ల క బో సు కున్నాయ్ రామ్మూర్తి హృదయం పులకించింది లలిత కళ్ళు కాంతితో మెరిశాయ్ దూరంగా ఎవరివో పెళ్ళి బాజాలు .

మరో పదిహేను రోజులనాటికి రామ్మూర్తి యింట్లోనూ విన్పించాయ్ పెళ్ళి బాజాలు– ఉషాబాల సిగ్గుతో పెళ్ళి పీటలమీద ముడుచుకుని పోయింది – లలిత అందర్నీ ఆహ్వానిస్తూ సందడిగా తిరుగుతూంది – కేశవమూర్తి అక్షింత లందరిచేతుల్లోనూ పోస్తున్నాడు – పిల్లలంతా ఓ మూల చేరి గోల చేస్తున్నారు– రామ్మూర్తి శూన్యంలోకి చూస్తున్నాడు– రమణి ఆశీర్వదించడానికి వచ్చిందోలేదో అని . రుక్మిణి అల్లుణ్ణి చూసి మురిసి పోతోంది—మంత్ర ఘోషలో మాంగల్యం ఉషాబాల మెడ నలంకరించింది

ఉషాబాల—నునుసిగ్గుల మధిర గ్రోలి తేలిపోతున్న ఉషాబాల – భర్తతో తరలి పోతోంది అత్తింటికి









"ఏవండోయ్ — దొంగ లెవరూ కనిపించకపోతే అలాగే వచ్చేప్పుడు వంటింట్లో ఆల్మారాలోంచి ఓ రెండు సున్నుండలు పట్రండి !"




కాంతయ్యకి జీవితం కొంత ఖుషీ గానే వెళ్ళిందనీ (అలానే వెళ్తుందనీ కూడా) చెప్పాలి. అతనికి చిత్రాంగి లాంటిదే అయినప్పటికీ చెప్పినమాట వినే భార్య దొరికింది. ఊరికే వెర్రికావుకా సేయకుండా ఆవిడతనికి చక్కగా గడుసుగా ముగ్గురే పిల్లల్ని కనిచ్చింది. ఆడా మగా మగా — ఆదీ వరస; అమ్మాయి సావిత్రి కొంచెం వెర్రిబాగుల్ది కాని మగపిల్లలిద్దరూ సిసింద్రీల్లా ఉంటారు. సావిత్రి ఎల్లప్పుడూ ఏవేవో పుస్తకాల్చదువుతూ ఏదో లోకంలో ఉంటుంది. పదహారేళ్ళే అయినప్పటికీ బాగా పొడవుగా ఉంటుంది. తెలిసినవాళ్ళు ఆపిల్లని

అమాయకురా లంటారు తెలియనివాళ్ళు ఆ మరీ పెద్ద బేలకళ్ళుచూసి వెర్రి దను కుంటారు

అన్నదమ్ముల పంపకాల్లో కాంతయ్య వాటాకి అయిదెకరాల పొలమూ, ఓ పదె కరాల మావిడితోటా, (కేటాయింపుగా) ఓ చిన్నయిల్లూ వచ్చేయి. నలభయ్యేళ్ళ పాటు అతనిజీవితం హాయిగా నడిచి పోయింది. పొలం రెండుపంటలు పండు తుంది. మావిడితోట ప్రతీయేడు విరగ కాస్తుంది. ఇల్లు చిన్నదే అయినప్పటికీ పెద్ద పెరడుంది. అందులో మంచినీళ్ళ నుయ్యుంది. పేకాటా, పిట్టలవేటల్లో సుఖంగా కాలం గడిపేడు కాంతయ్య.

తరువాత, అంటే రెండేళ్ళ క్రిందట పండులో పురుగు ప్రవేశించినట్టు కాంత య్యలో ఓ రోజున మంచిముహూర్తాన్న లాభంయెడల దాహం ప్రవేశించింది. అత నో రోజు మధ్యాహ్నం నిద్రలేచే సరికి వీధిలోంచి పెద్ద బాండు మేళపు సందడి వినిపించింది. ఏ(వి(టో అని చూస్తే— వీరిగాణ్ని ఊరంట ఊరేగిస్తు న్నారు, కారుమీద.

వీరిగాడికి, లోగడ, సందుచివర చిన్న ఇనపకొట్టుండేది. సైజుకి వాడు దమ్మిడి అంత మనిషి. మొన్న మొన్నటి దాకా వాడి విలువకూడా దమ్మిడీనే. వాడు ఆ ఇనపకొట్టుని ఇనుపమిల్లు కింద మార్చి ఇంకా పెద్దదిగా పెంచుతున్నాట్ట. అమె రికా ఐరోపాలు వెళ్ళొచ్చేట్ట. అందు గురించి ఇప్పుడు కారెక్కి బజార్లో బాజాల్తో ఊరేగుతున్నాట్ట అలాగే వెంకడుగాడు, సుబ్బడుగాడు, సూరిగాడు, వెర్రిగాడు, వెధవగాడు, వెధవ చచ్చుగాడు, చచ్చు పెద్దమ్మగాడు! అందరూ కూడా మేకుల్లా బిగిసిపోయి తాటిచెట్లల్లా పెరిగిపోయి మర్రిచెట్లల్లా విస్తరించుకు్కూర్చున్నారు. వాళ్ళంతా శ్రీరామచంద్రులూ సత్యహరిశ్చంద్రులూ కారని కాంతయ్యకి తెలుసు. వాళ్ళంతా ఎలా పెద్దవాళ్ళయారో అతను వెంటనే టోగట్టాచేసి తెలుసుకున్నాడు. దాన్తో అతనికి మెలకువొచ్చింది, కన్నువిడింది. బుర్రలో దమ్మిడీ ఎత్తుబుద్ధీ,మాయా గల ప్రతివాడూ సంతలో చవటగాళ్ళని పట్టిగ్గా దోచుకు తింటూంటే తను చేతులు ముడుచుకొని పెరట్లో కూర్చుండి పోవడం నచ్చిందికాదు కాంతయ్యకి. కాంతయ్యా కూడా ఊళ్లో ఉన్నాడు, సంతలోని లాభాల్లో కాంతయ్య వాటా కాంతయ్యకి రావాలి, ఎందుకురాదో,ఎలారాదోఅతనూ చూస్తాడు.

అందుచేత ఈ రెండేళ్ళనుంచీ – పద్ధె నిమిదేళ్ళ కుర్రాడికి స్త్రీవాంఛ పట్టు కున్నట్టు – కాంతయ్యకి ధనవాంఛ పట్టు కుంది. అతి అర్జంటుగా డబ్బులు గుంజేసి లాభాలు పిండేసి మూటలు కట్టేసి మేడ ల్లేపేసి మహల్స్ కొనేసి మహాభాగ్య వంతు ణ్నయిపోదా మనే కోరిక ఇప్పు డతణ్ని దెయ్యం పట్టుకున్నట్టు పట్టు



''ఏమేవ్! ఇప్పుడే ఖీమాచేసివస్తున్నా! నాకు ఏదైనా ప్రమాదం సంభవిస్తే యాభయ్ వేలు వస్తయ్."

''నా బతుక్కి అంత అదృష్టంకూడానా!"

కొంది. డబ్బూలాభం! డబ్బూలాభం! అదే ఇప్పు డతని ధ్యేయం.

"లాభం" అనేమాట ఇంట్లో అన్ని సార్లు వినడం వల్లనే 'లాభం అంటే ఏమిటీ' అనే ఆలోచన పట్టుకుంది సావిత్రికి. ఆ ప్రశ్న చాలా సింపుల్ ప్రశ్నే కాని దానికెవరూ సరైన సమాధానం అమెకి చెప్పలేక పోయేరు. వాళ్ళ అమ్మ నడిగితే ఆమె ఖచ్చితంగా జవాబు చెప్పింది.

''రెండువేల కట్నానికి నీకు రెండు లక్షల మొగుడొస్తే అది మనకి లాభం, అదే లాభం అంటేను. తెలిసిందా?"

సావిత్రికి తెలియలేదు. ఆ విధంగా తల్లి ఫేలయితే తండ్రి బోధపర్చడానికి ప్రయత్నం చేశాడు.

"కిందటేడు ధాన్యం రూపాయి క్కుంచెడు చొప్పున కొన్నావా? కొని కుంచె డ్రెండూౕపాయల కమ్మేవా(? రూపాయిలాభం ఒచ్చిందికద!అదేలాభం! అంతేమరింకేంలేదు."

"ధాన్యానికి రూపాయి తీసుకున్నావు. కాని మరి ఆ రెండోరూపాయి ఎందుకు తీసుకున్నావు?''

"ఒట్టినే తీసుకున్నాం! అదీసంగతి!" అంటూధాన్యంకొనుక్కున్న చవటగాణ్ణి

తల్చుకొనితల్చుకొని నవ్వేడు కాంతయ్య
ఆ నవ్వుచూసి సావిత్రికి భయంవేసింది
బళ్ళో మాష్ట ర్నడిగితే
"లాభనష్టా ల్లెక్కల్చేస్తున్నావుకదా!
ఆపాటి తెలీదా ఇంకాను?'' అన్నా
డతను.

ఎంద రెన్ని తాత్పర్యాలు చెప్పినా,
సావిత్రి నెత్తికి మాత్రం ఎమీ ఎక్క
లేదు.

ఇంతలో మొన్న ఈమధ్యే బావ
వచ్చాడు; అతనిపేరు సత్యమూర్తి.

ఆ కుర్రవాడి తల్లికి పసుపూ కుంకం
కింద ఓ ఎకరం ఇస్తా నన్నాడు ఆమె
తండ్రి. ఇవ్వకుండా చేసినవాడు కాం
తయ్య. అక్కకి తను నష్టం కలుగజేసి
నందుకు అక్కయెడలా ఆమె పిల్లల
యెడలా చాలా కోపం ఉంది కాంతయ్యకి;
లేళ్ళంటే పులికి కోపం ఉన్నట్టు.

"సత్తిగాడికి" చదు వబ్బలేదు. దుర్గ
పూర్లో "వడ్రంగి వెధవపని'' చేసుకు
బతుకుతున్నాడు. అటువంటి పని చేసు
కొంటూ అందులోకూడా ఆ కుర్రాడు
కిఫాయితీగా బతగ్గలగడం కాంతయ్య
కోపానికి రెండో కారణం. ఆ వడ్రంగి
బావ్వైనకాతల వెర్రిదాన్లా సావిత్రి తిరగ
డం కాంతయ్య కోపానికి మూడో
కారణం.

ఇంటి కొస్తున్న మేనల్లుణ్ని, "ఎన్నా
ళ్ళురా సెలవూ?'' అని అడిగేడు
కాంతయ్య.

"సెలవు నెల్లాళ్ళు మీ ఇంట్లో ఉండ
డం మూణ్నాళ్ళు" అన్నాడు సత్య
మూర్తి

ఆ కుర్రాడివి మేనమామకిలాగే పెద్ద
కళ్ళు అతను చురుగ్గా వాలా హెచ్చరిగ్గా
రెపరెపలాడుతూ ఉంటాడు. నిక్కర్లో
(లేక పట్లాంలో) చొక్కా టక్ చేసుకు
తిరుగుతాడు. అతనిచేతులు రాళ్ళలాగా,
మాటలు చాకుల్లాగా ఉంటాయి. రాతిలో
చకచకా మలిచిన బొమ్మలా ఉంటా
డతను.

వచ్చినరోజు మధ్యాహ్నమే పెరట్లో
ఓ వార సాలలో నాలుగు పెద్ద దేవదారు
పెట్టెలు చూసేడు సత్యమూర్తి. వర్షపు
తుంపరికి తడిసీ, వాలుఎండకి ఎండీ
అవి బాగా ఎరుపెక్కి ఇంకొన్నాళ్ళకి
నలుపుదౌలు తెచ్చుకోబోతున్నాయి.

"సాల్లో పాకేజి పెట్టె లున్నాయి
మాంవాం" అన్నాడు సత్యమూర్తి.

"అవును. ఉన్నాయి'' అన్నాడు
మాంవం.''

"నాల్రూపాయలిస్తాను ఇచ్చేస్తావా?"

భోంచేసి వాలుకుర్చీలో కూర్చున్న
కాంతయ్యకి అల్లుడి మాటల్లోని వెటకారా
నికి కోపం వచ్చినప్పటికీ ఆ కోపం
కనపణ్నివ్వకుండా, టూకిగా.—

"ఇవ్వను'' అన్నాడు.

స్తంభం వారన నిలబడి బావనీ
నాన్ననీ అటూఇటూ మాస్తోంది సావిత్రి

''ఏం ? లాభం చాల్దా ? '' అని సాగదీసేడు సత్యమూర్తి

"ఆవును చాల్దు'' అన్నాడు కాంతయ్య

''నేను లాభంకోసవేఁ బతుకుతాను. నువ్వేకాదు. ఎవడేఁ వనుకున్నా నాకు లక్ష్యంలేదు'' అనేభావం కాంతయ్య మాటల్లో వ్యక్తావ్యక్తంగా వినిపించింది.

"నాకోసం కాదు మాఁవయ్యోయ్! ఇనపకొట్టు రామంగాడికి ఇచ్చేస్తాను, ఎంతకైతే ఇస్తావో చెప్పేయ్!" అన్నాడు సత్యమూర్తి.

"పన్నెండైతే పట్టుకెళ్ళమను'' అన్నాడు కాంతయ్య.

"పొయ్యిలో పెట్టినా కాలవవి బేడా పరక పెట్టెలికి నీకు పన్నెండు రూపాయలా ? కావాలా ? '' అంటూ నవ్వేడు సత్యమూర్తి. ఆ మాటకి తనుకూడా నవ్వాలా వద్దా అని ఆలోచిస్తూ నిలబడిపోయింది సావిత్రి.

''అవి చెదపట్టిపోయి చెడిపోయినా సరే కాని లాభానికి తప్ప అమ్మను'' అన్నాడు కాంతయ్య, సిగరెట్టు ముట్టిస్తూ, ఆ తరవాత పుల్ల పారేస్తూ పొగవదుల్తూ "ఏ వెధవో ఒచ్చి కొనుక్కోక పోడు. అందాకా వాట్నలా ఉణ్నీ. నష్టఁ వేం లేదు.'' అన్నాడు.

"నష్టఁవెందుకు మాఁవయ్యా? లాభం ఒచ్చేట్టు నే చూస్తాకదా ! అన్నాడు సత్యమూర్తి సరదాగా నవ్వుతూ మర్నాడు.

మధ్యాహ్నం మూడుగంట లయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది పరుపంతా చెమటతో తడిసిపోడంతో కాంతయ్యకి మెలకు వొచ్చింది. మధ్యాహ్నం ఒంటిగంటకి బాగా భోంచేసి వచ్చి, గది తలుపు లన్నీ బిడాయించుకొని మంచం మీద వాలడం కాంతయ్యకి అలవాటు. నలభై రెండేళ్ళ జీవితంలో పాతికేళ్ళ అలవాటది. అతను పడుక్కొనే గదికి ఒకటే ద్వారం, ఒకటే కిటికీ. ఆ కిటికీ తరుచు మూసే ఉంటుంది. ఒకవేళ తెరిచినప్పటికి కూడా గదిలో చీకటి కొంచెం తగ్గినట్టుండే కాని కొంతగా అయినా వెలుగుమాత్రం లోనికి వచ్చినట్టుండదు. ఆ గది వేసవికాలంలో అతి వెచ్చగా ఉంటుంది, చలికాలంలో అతి చల్లగా ఉంటుంది.

కాళ్ళమీంచి ముఖందాకా కప్పుకున్న దుప్పటి పక్కకి తీస్తూనే. పొడుం పట్టు ఎక్కించేడు కాంతయ్య. ఇరవయ్యేళ్ళ అలవాటది. పొడుంపట్టు ఎక్కించేక బద్దకంగా అలా పడుక్కొని సుఖంగా డబ్బుగురించి ఆలోచించసాగేడు. రెండేళ్ళకిందటివరకూ అతనికి ఆడవాళ్ళ గురించి ఆవిధంగా ఆలోచించడం సుఖంగా ఉండేది. ఇప్పుడైనా ఆడవాళ్ళు అతనికి అక్కర్లేకపోలేదు కాని డబ్బుతో వస్తేనే వాళ్ళతనికి కావాలి ''వేచ్చపుఁరు భాగోతపు రోజులు ఎత్తికట్టేసేం, చవుఁ

రది తెచ్చుకుంటేనే దీపం వెలిగిస్తాను. లేపోతే పొమ్మను.'' అంటా డిప్పుడు, కాంతంగురించి డబ్బు విదిలింపు పూర్తిగా బంద్‌చేసేశా డతను.

కొంతసేపు అలా ఆలోచిస్తూఉండగా కాంతయ్యకి ఏవో చప్పుళ్ళు వినిపించేయి. అది డబ్బు చప్పుడు కాదు. పెరట్లోంచి కాబోలు ఆ చప్పుడు వస్తోంది. ఆ ఇంట్లో అటువంటి శబ్దాలు అతనెప్పుడూ విన్లేదు.

''ఏఁవిఁటి చెప్మా?''

అనుకొంటూ లేచి పెరటి వరండాలో కెళ్ళి అక్కణ్ణించి నిలబడి చూసి, పనస చెట్టు నీడని హడావిడి చేస్తూన్న మేన ల్లుణ్ణి ''ఏంట్రా చేస్తున్నావ్ సత్తిగా?'' అంటూ కేకవేసి ప్రశ్నించేడు కాంతయ్య.

ఆ పనసచెట్టుకింద కాంతయ్యా ముగ్గురు పిల్లలూ బావగారి వడ్రంగి పని వైపు కళ్ళప్పగించి చూస్తున్నారు.

తండ్రి వేసిన ప్రశ్నకి,–

''టేబిల్సు! టేబిల్సు!'' అని సమా ధానం చెప్పింది సావిత్రి.

''టేబిల్సూ, స్టూల్సూ, పీటలూను!'' అని కాంతయ్యా పెద్ద కొడుకు, పన్నెం డేళ్ళవాడు కేకవేసేడు.

కాంతయ్యా రెండో కొడుకు, ఎనిమి దేళ్ళవాడు, తండ్రి గొంతుక వినగానే, అతి సంతోషంగా ముఖంపెట్టి, అతి రయ్యిఁమని పరిగెట్టుకొచ్చి, తండ్రి కాళ్ళని కౌగలించుకొని తలెత్తి తండ్రి ముఖంలోకి చూస్తూ నవ్వుతూ! ''బావ! బల్లలు! బల్లల్చేస్తున్నాడ్నాన్నా బావ!'' అని, అద్భుతమైన ఆనందంతో అమె రికా వెళ్ళివచ్చిన ఆదిమవాసుల్లా చెప్పి వెంటనే అర్జంటుగా మళ్ళీ బావదగ్గిరికి పారిపోయి హడావిళ్లో పడిపోయేడు.

చెట్టు నీడని అరుగుదగ్గిర దేవదారు పెట్టెలు చెక్కలు చెక్కలుగా విడిపో యున్నాయి. కొన్నింటికి చిత్రికపట్టడం పూర్తయింది. వాటిలో కొన్ని పచ్చగా పాళాబంగారంలా ఉన్నాయి, మరికొన్ని రాగి కలిపిన బంగారంలా ఉన్నాయి. అరుగుమీద ఓ చెక్క దాపుపెట్టి సత్య మూర్తి చిత్రికపడుతున్నాడు. రాళ్ళమీద కూర్చున్న పిల్లలు చీటికీ మాటికీ లేస్తు న్నారు. తుక్కు పోగు చేస్తున్నారు: బల్లల్ని నిమురుతున్నారు; అదేమి టిదేమి టని ప్రశ్నిస్తున్నారు; రంపాన్ని పట్టుకు తిప్పుతున్నారు; సాఫవుతూన్న బల్లచెక్కవైపు బంగారంగా మారు తూన్న ఇనుముని చూసినట్టు చూస్తు న్నారు.

కాంతయ్య మొదట ఆశ్చర్యపోయేడు! తరవాత సంతోషించేడు; ఆ తరువాత కోప్పడ్డాడు.

''నాతో ముందు చెప్పొద్దురా?'' అని మేనల్లుణ్ణి కసిరేడు.

''అత్తతో చెప్పేను మాఁవాఁ'' అన్నాడు సత్యమూర్తి.

ఎండాకాలం. మధ్యాహ్నం మూడు దాటింది. ఎండ ఇంకా చల్లారలేదు.



సత్యమూర్తి తొడుక్కున్న బనీను చెమటతో బాగా తడిసిపోయింది. ఫంట్లాం మీద కూడా చెమటబొట్లు ఇంకుతున్నాయి.

"ఎందుకూ అవన్నీ ఇప్పుడు?" అన్నాడు కాంతయ్య.

"మావఁకి అల్లుడి ప్రెజెంటు" అన్నాడు సత్యమూర్తి."

కాంతయ్య చిరునవ్వు నవ్వేడు ఆ నవ్వులో అనురాగంతో అభిమానంతో కూడిన పంతోషం కంటె ఆశతో కూడిన సంతోషం ఎక్కువుంది. అతనా సమయంలో మూర్తీభవించిన 'స్వార్థం'లో ఉన్నాడు. తండ్రిని ఆ క్షణంలో చూసిన సావిత్రి ఎందుకోగాని జడుసుకొంది. ఆమెకి ఏదో జ్ఞాపకం వచ్చినట్టనిపించింది, ఏదో ఎవరో ఎక్కడో?

మర్నాటి ఉదయం పది గంటలకల్లా నాలుగు టేబిల్సు మూడు స్టూల్సు, ఆరు పీటలూ తయారయేయి వాటికి చక్కటి రంగుకూడా వేస్తానన్నాడు సత్యమూర్తి 'చూద్దాం' అన్నాడు కాంతయ్య

పెరట్లో అంతా చల్లగాఉంది,దక్షిణం నుంచి చల్లగాలి మెల్లగా వీస్తోంది. దేవ దారు సామాగ్రి, ఇంటికొచ్చిన గొప్ప బంధువుల్లా, పెరటివరాండాలో, శోభగా శోగ్గా అమిరేయి. ఇంట్లో ఉన్నవాళ్లంతా వాటిని మేరిసే కళ్ళతో చూస్తూన్నారు. లెక్కదాఖలా అయిపోయిన హీరోలా సత్యమూర్తి అటూ ఇటూ తిరుగుతున్నాడు. కొత్త రాజువి ఆత్మీయు లంతా చూసుకొన్నట్టు పిల్లలతణ్ని చూసుకొంటూనే, ఈ బల్ల నాది, ఈ పీట నాది, నీదికాదు నాది; అది నీది ఇది నాది అని ఓవైపు వాదించు కొంటున్నారు. "వాట్ని ముట్టుకొని అప్పుడే తగ్గలెట్టేకండి" అంటూ వాళ్ళమ్మ కేకలు వేస్తోంది. ఆశపడే ముసలివాడు ఆడపిల్లని చూసినట్టు కాంతయ్య ఆ సామగ్రిని గ్రీడీగా చూస్తున్నాడు.

మధ్యాహ్నంఆటకి పిల్లలు ముగ్గుర్నీ సినీమాకి తీసుకువెళ్తానన్నాడు సత్యమూర్తి. సినీమా అనేసరికి సంతోష పడ్డ చిన్నవాడు, అంతలోనే, "నాన్న అందరికీ డబ్బు లివ్వడే!" అంటూ డీలా అయిపోయేడు.

"అందరికీ బావే అభయం! మరేం భయపడకండి!" అన్నాడు సత్యమూర్తి

మేనల్లుడి జల్సా చూసి కాంతయ్యకి కోపమూ ఈర్ష్యా కలిగేయి "తగలెట్టినప్పుడు నేనూ తగలెట్టేను డబ్బు!" అని తనని తాను సముదాయించుకున్నాడు.

సాయంకాలం సావిత్రీ, ఆమె తమ్ముళ్ళూ, బావా సినీమానించి కబుర్లు చెప్పుకొంటో వస్తూంటే దార్లో అందరికీ హోటేల్కి వెళ్లా లనిపించింది. అక్కడికి వెళ్లేక టిఫిన్ తినా లనిపించింది. కూల్ డ్రింక్స్ తాగా లనిపించింది; ఆ తరువాత బీచికి వెళ్ళాలనిపించింది. నలుగురూ కూడా ఆడుతూ పాడుతూ కేరుతూ ఇంటి కొచ్చేసరికి ఎనిమిది గంటల రాత్రయింది.

"ఇంతసే పేం చేస్తున్నార్రా!" అంటూ వాళ్ళు రాగానే ప్రశ్నించేడు, హాల్లో వాలుకుర్చీలో కూర్చొని డబ్బు లెక్క పెడుతూన్న కాంతయ్య. "బల్లలేవీ, బల్లలేవీ?" అంటూ అతని ముగ్గురు పిల్లలూ పెరటి వరాండాలోకి పరిగెట్టేరు. సత్యమూర్తి హాల్లో ఓ కుర్చీలో కూర్చొని జోళ్లు విప్పుతున్నాడు. పెరట్లోకి వెళ్ళిన పిల్లలు అంతలో హాల్లోకి తిరిగి పరిగెట్టుకొచ్చి "బల్లలేవి నాన్నా?"అంటూ కాంతయ్యని ముగ్గురూ ఒక్కసారే అడిగేరు, ఇంట్లో చిలక



తీరని పగ!

కనిపించకపోతే ఇంటి పిల్లిని అడిగినట్టు.

"ఇవిగో! యాభై రూపాయలు!" అన్నాడు కాంతయ్య చాలా గర్వంగా.

పిల్లలు నివ్వెర పోయేరు.

"ఏఁవీఁ? ఏం టయింది??"

"అమ్మేసేను"

"అమ్మేసేవా?!!" అంటూ పిల్లలు పగలని శోకంతో అరిచేరు,

"హాయిగా చక్కగా అమ్మేసేను" అన్నాడు కాంతయ్య.

పిల్లల ముఖాల్లో హాయిలేదు, కత్తి వేస్తే నెత్తురుచుక్క లేదు. సావిత్రి పిచ్చిపిల్లలా నిలబడిపోయింది. పెద్దవాడు ఏమీ అర్థముకాని వాళ్ళా అటూ ఇటూ చూస్తూ నిలబడి పోయాడు. చిన్నవాడు కళ్ళనిండా నీళ్ళతో నిలబడి ఆ తరువాత అమ్మదగ్గరకొక్కబోలుఏడవడాని కొక్కబోలు లోనికి వెళ్ళిపోయేడు, కాళ్ళు నేలకి వేసి కొడుతూ చప్పుడు చేస్తూ.

సత్యమూర్తి, "ఎంత లాభం; అయితే?" అని తియ్యటి కంఠంతో అడిగేడు.

ఓ పది రూపాయిలు లెక్కపెట్టి వేరుగా తీసి వాటిని కుడిచేత్తో పట్టుకొని,

"నీ క్కావలిస్తే ఇదిగో పది రూపాయలు కట్నం. అది నీకు లాభం" అన్నాడు కాంతయ్య. మేనల్లుడికి ఒక్క పది రూపాయిల నోటు యివ్వడంకంటే పదిఒకరూపాయి నోట్లుఇవ్వడం బావుంటుందనీ, దర్జాగా ఉంటుందనీ ముందే నిర్ణయించుకున్నాడు కాంతయ్య.

"నా కూలి నాకు..." అని ఏదో అనబోయేడు సత్యమూర్తి.

"నీకు కూలి మాత్రం ఇవ్వాలంటే అయిదు రూపాయలే అది!" అన్నాడు కాంతయ్య, అంతకుముందే ఆ సంగతి ఆలోచించిన వాళ్ళా.

"మరైతే పదెందుకు?"

"ఉంచుకోరా! అది నా సంతోషం" అన్నాడు కాంతయ్య.

నా పేర్చెప్పి పిల్లలికి మిఠాయి కొనీ" అన్నాడు సత్యమూర్తి.

"నువ్వేం చెయ్యమంటే అదేచేస్తాను. నీ డబ్బు కాని నాది కాదు." అన్నాడు కాంతయ్య ఆ పదినోట్లూ మిగతా నోట్లలో కలిపేస్తూ.

సత్యమూర్తి కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు. విద్యుత్కాంతిలో అతని నవ్వు ముఖం వింతగా ప్రకాశించింది. ''మాఁవయ్యా'' అని పిల్చేడతను.

"ఏం?" అని చూసేడు కాంతయ్య.

''చెక్కల ఖరీదు — నీ ప్రకారం — పన్నెండ్రూపాయలు. అందులోకూడా కొంతలాభం ఉంది.''

''ఉంది," అన్నాడు కాంతయ్య.

"అదలా ఉన్నీ. అది లెక్కలోకి తీసుకోను. పన్నెండ్రూపాయలు పోగా, నా కూలి అయిదురూపాయలు. మేకులు ముప్పావలా, మొత్తం పదిహేడు ముప్పావలా పోతే మిప్పయ్ రెండూ్రి పాయల పావలాలాభం. కొట్టేశావు మాఁవాఁ!" అన్నాడు సత్యమూర్తి.

నక్క వికవిక నవ్వినట్టు నవ్వేడు కాంతయ్య.

మాఁవాఁ, ఆలాభం ఏంటో తెలుసా?" అని అడిగేడు సత్యమూర్తి.

''తెలివైనవాడివి, చెప్పు! చెప్పు!'' అన్నాడు కాంతయ్య.

"నా కష్టవేఁ నీ లాభం కాదా మాఁవాఁ?'' అన్నాడు సత్యమూర్తి.

''పద పద, కాళ్ళు కడుక్కో. ఒహడునష్టపోతేనే ఇంకొకడికిలాభం.'' అంటూ లేచేడు కాంతయ్య.

''కష్ట పడ్డవాడు నష్టపోతేనే మిగతా వాళ్ళకి లాభాలు." అన్నాడుసత్యమూర్తి

''కష్ట పడ్డందుకు అలిసిపోయేవు. కాస్త భోంచేసి పడుకుందువుగాని" అన్నాడు నవ్వుకొంటూ నట్టింటివైపు నడుస్తున్న కాంతయ్య.

సావిత్రి అంతసేపూ తండ్రివైపే చూస్తూనిల్చుంది, తండ్రి నవ్వూ అతని వాటం చూస్తూండగా, అంతవరకూ జ్ఞప్తికి దొరకని విషయం ఆమె కప్పుడు టక్కున గుర్తుకొచ్చింది.

అదొక ఇంగ్లీషు సినీమా. రెండేళ్ళ కిందట చూసిందామె. అదొక ఘోరమైన కథ. అందులో మంచివాళ్ళని మందు పెట్టి చంపేసి, ఆ శవాల్లో దుర్మార్గులు ప్రవేశించి, ఆ శవాల్ని ఆ విధంగా బతికించి, నానా భీభత్సం చేసేస్తారు ఆ

బతికిన శవాలు మంచివారిగా కనిపిస్తూనే నానా ఘోరాలూ చేసేస్తాయి. అమాయకంగా ఉండే భర్త అలానే కనిపిస్తూ భార్యని బ్రిడ్జిమీంచి ఏట్లోకి తోసేస్తాడు. పతివ్రతైన ఆడమనిషి అలానే నటిస్తూ భర్తని పొయ్యిలో పెట్టి కాల్చేస్తుంది. తండ్రి, వాత్సల్యంతో ఉంటున్నట్టే ఉంటూ కూతురి గొంతు పిసికేస్తాడు. ఇంటిల్లిపాదినీ పెంచి పెద్దచేసిన ముసలినౌఖరు ఇంటిల్లిపాదినీ చంపేసి ఇనప్పెట్టె తెరుస్తాడు. స్నేహితుడు స్నేహంగానే కనిపిస్తూ స్నేహితుణ్ని హతమారుస్తాడు. స్వాములవారు పరమ సాత్త్వికంగా ఉంటూనే భక్తుల్ని భుజించేస్తాడు. ఆ సినీమా కథలోని లోకంలో మంచివాళ్లకి బతుకులేదు. పాములు మనుషులుగా మారి విషానికి నీతిపూత పూసి మాయకి తళుకురంగులు వేసి మానవలోకాన్ని మాపేస్తున్నట్టుగా చూపించేరు. ఆ సినీమాలో, ఆ లోకంలో అదంతా వాళ్ళు డబ్బు డబ్బు డబ్బుకోసం చేసేరు; అన్ని ఘోరాలూ వాళ్ళు అందుకోసమే చేసేరు. ఆ సినీమా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సావిత్రికి భయం వేస్తుంది; నిద్రపట్టదు; హడలెత్తిపోయి అలా కదలకుండా పడుకుంటుంది.

ఇప్పుడామెకి తన నాన్న...

నాన్న కాడితను! నాన్నకాడు! దొంగనాన్న! దుష్టుడు ప్రవేశించిననాన్నశవం!! హమ్మయ్యో హమ్మయ్యో! నాన్న మా మంచినాన్న ఏమైపోయేడు??? నాన్నా! నాన్నా!! నాన్నా...

పూలకళ్ళనుకొని భ్రమించి దగ్గిరగా వెళ్ళి పాముకళ్లని తెలుసుకున్న పావురాపిట్టలా సావిత్రి వజవజ వణికిపోతూ నిలబడిపోయింది.

ఆ సమయంలో సత్యమూర్తికూడా చిన్న పెంకి ఆలోచనలో ఉన్నాకూడా మామయ్యలా ఉంచేనే తనకి మంచిదేమోననే ఆలోచన అతన్లో మెదిలింది; అతని ముఖంలో అతిచిన్న దుష్టునవ్వు ఆటూ ఇటూ పాకింది. అలా ఆలోచిస్తూ మరదలి వివర్ణవదనం చూసేసరికి అతనికి తెలివొచ్చినట్లయింది.

"ఏం సావిత్రీ? ఏవిఁటలా చూస్తున్నావు? ఏవిఁటయింది?" అంటూ ఆమె వైపు నడిచేడతను.

"బావకూడా పాము ప్రవేశించిన బావశవం కాదుకద?!" అని ఎందుచేతనో అనుకొంటూ భయపడ్డ సావిత్రి గజగజా వణికింది.

ఆ రాత్రి జాలిగా అతి జాలిగా భగవంతుణ్ని ప్రార్థించి ప్రార్థించి నిద్రపోయింది సావిత్రి. భగవంతుడామె ప్రార్థన వింటూ నిద్రపోయేడో లేక నిద్రలో ఆమె ప్రార్థన వినలేకపోయేడో ఆమెకి తెలియలేదు.

# పరమానందాయ శిష్యులు

చంద్రగ్రహణం పడుతూంది. చంద్రుడిలో మొర్రి ఏర్పడుతూన్న కొద్దీ ప్రపంచమంతా కాటుకరంగు పూసుకుంటూంది..

అదే సమయం—కొందరు మహానుభావులకు బుద్ధి చెదిరిపోయి, పిచ్చి ఎత్తడానికి!

గిండీ స్టేషన్లో రైలు ఆగింది. ఆరుగురు సోల్జర్లు దిగి, టిక్కట్లిచ్చి, స్టేషను అవతలకు వెళ్ళేరు.

'సార్, సార్' అంటూ రిక్షావాళ్ళు వాళ్ళను చుట్టుముట్టేరు.

ఆరుగురు సోల్జర్లు!

ఆ రిక్షావాళ్ళనందర్నీ పొమ్మని, ఒక్కడ్నే వుండమన్నారు—

'ఎంతమంది ఎక్కుతారు?' అన్నాడు ఆ రిక్షావాడు ప్రాణాలు బిగబట్టి.

'ఆరుగురం ఎక్కుతాం – తీసుకెళ్ళు' అన్నారు ఆ యోధులు,

'మీకో సలాం!' అని ఆ రిక్షావాడు అక్కడనుంచి పోతున్నాడు, ప్రాణాలు దక్కించుకుందు కని.

ఆపారు వాడిని, ఆ సోల్జర్లు.

వాడికి ముచ్చెమట్లు పోశాయి.

ఆరుగురు కలిసి వాడిని రిక్షాలో కూలవేశారు—

ఏం జరుగుతుందో అని కళ్ళు వప్పగించి చూస్తున్నాడు వాడు—

ఆ ఆరుగురు యోధులూ ఆ రిక్షాను యీడవడం ప్రారంభించారు!

రిక్షావాడు నవ్వుతున్నాడు!!

చంద్రుడిలో మొర్రి పూర్తిగా ఏర్పడింది!!!



ఎప్పుడు నా సర్వస్వాన్ని నీలో దాచుకున్నానా!



## కిశోర్ చెప్పినది

శంకర్, వినయుడు, విభూతీ, కాంతీ, నేనూ మేము అయిదుగురమూ కృష్ణనగరం హైస్కూల్లో సెకెండ్ ఫారం చదువుతూ ఉండేవాళ్ళం మేము తరుచుగా కలవటం, మాట్లాడుకోటం కూడా ఉండేది శంకర్ మా అందరిలోకీ పెద్ద అందమైనవాడూ, చురుకైనవాడే కాక మా క్లాసులో ఫస్టు అతనే అందుకనే మా క్లాసులో పిల్లలంతా అతన్ని ఆరాధించేవారు, అతని స్నేహం చేసుకోటానికి తాపత్రయపడేవారు విభూతీ, కాంతీ ఎప్పుడూ అతని ప్రక్కనే కూర్చునేవారు, క్లాసులో బడి వదిలినతర్వాత కూడా అంటిపెట్టుకు తిరుగుతూ ఉండేవారు నేను వయసులో అందరికంటే చిన్న వారి వెంట తిరగాలని నేనూ ప్రయత్నించేవాణ్ణి గని నన్ను చేరనిచ్చేవాళ్లు కాదు నేను దూరంగా ఉండే శంకరుణ్ణి ఆరాధిస్తూ ఉండేవాణ్ణి శంకర్‌కు తెలివికలవాడి ననే గర్వం బాగా ఉండేది అందుకనే అతను అప్పుడప్పుడూ జబర్దస్తీ చేస్తూ ఉండేవాడు - అతని అనుచరులుకూడా అది సహించేవారు

వీళ్ళ ఎదురుపక్ష నాయకుడు వినయుడు వాడికి చదువు సంధ్యలమీద అంత శ్రద్ధలేదు క్రికెట్, ఫుట్‌బాల్ మొదలైన ఆటల్లో నేర్పరి వినయుడు శంకర్ జబర్దస్తీ సహించేవాడు కాదు, అందుచేత అప్పుడప్పుడూ వాళ్ళకు తగువు వస్తూ ఉండేది నాకు లోలోపల శంకర్ మీద అభిమానమున్నా విన

యుడు ఎగతాళి చేస్తాడెమో నని భయంతో అతనితో కలిసేవాణ్ణి కాదు- నేను చదువులో మందమతిని కాను — అతిపరీక్షలోనూ నేను శంకరుడి తర్వాత వస్తూనే ఉన్నాను అందు చేత నన్ను శంకరుడికి ప్రతికక్షిగా నిలబెట్టా అని వినయుడు ప్రయత్నించేవాడు. నాకు నిజానికి చాలా సిగ్గు వేసేది. వినయుడికి లెఖ్ఖలు రావు. అతను చాలాసార్లు నా చేత లెఖ్ఖలు చెప్పించుకు పోయే వాడు; ఇంకా ఇతర క్లాసులో పిల్లలుకూడా నాదగ్గర లెఖ్ఖలు నేర్చుకునే వారు. ఇది చూస్తే శంకరుడికి అసూయగా ఉండేది. అదీకాక ఇంకో కారణ మేమంటే, స్కూలు మాస్టర్లందరికీ నేనంటే చాలా ఇష్టం— బహుశా నా వినయ విధేయతలు చూసి అనుకుంటాను.

ఇలాంటి విరుద్ధ భావాలమధ్య నలుగుతూ కూడా నేనూ, శంకరుడూ బాల్యస్నేహం ఎలా పెంపొందించుకున్నామో ఇక్కడ క్లుప్తంగా చెప్తు తాను. ఎందుకంటే, తరువాయి జీవితంలో మా స్నేహబంధం ఇంకో కొత్త సూత్రంతో పెనవేసుకుని విడని చిక్కు ఒకటి కల్పించింది.

ఒకనాటి సాయంకాలం నేను నదివొడ్డుకు షికారుకు పోయాను. పొద్దు కుంకుతూఉంది. నే నొక మర్రిచెట్టుక్రింద కూచుని సూర్యాస్తమయం చూస్తు న్నాను ఇంతలో నాకు పాట వినిపించింది—తిరిగి చూశాను, శంకర్, కాంతి, విభూతి, అమియ కలిసివస్తున్నారు. కాంతి నన్ను చూసి అభినయిస్తూ జావళీ పాడాడు. నేను కృష్ణుడికోసం విరహవ్యథ పడుతున్న రాధనట! ఈ పాటకు అంతా నవ్వారు, నేనూ నవ్వాను. విభూతి "ఒక్కడివే కూచున్నావే" మని, అడిగాడు. నేను — "సూర్యుణ్ణి చూస్తున్నాను, చూడండి ఎంత ఎర్రగా ఉన్నాడో!" అన్నాను.

"అయితే ఇంతకుముందు సూర్యుడు నల్లగా ఉండేవాడు కామాలు, ఇవ్వాళ ఎర్రగా ఉండటానికి! ఇదేనా శ్రీమతి రాధాకిశోరి కని పెట్టింది?" అన్నాడు కాంతి

కాంతి పరిహాసానికి శంకర్ నవ్వలేదు. అతను సూర్యుడివంకే చూస్తు న్నాడు. ఆతర్వాత కాసేపటికి నావైపు తిరిగి - "నిజంగానే చాలా బాగుంది!" అన్నాడు.

అతని ఈ ప్రశంసకు నా శరీరం పులకరించింది. అతనికీ నాకూ మధ్య ఉన్న ఎడం చాలా తగ్గిన ట్లయింది.

కాంతి అంతమాత్రానికి వదిలేఘటం కాదు - ''కిశోర్‌ను చూసి మీ రంతా కవులై పోయారు, నే నేమయ్యేది ?'' అన్నాడు

శంకర్ గద్దిస్తూ - అన్నాడు ''ఏట్లో పడి చావు ? ఇలాంటి సుందర దృశ్యాన్ని చూసి, ఆనందించే సంస్కారం నీకు లేదు ఇదే నీకు శిక్ష !''

కాంతి తల వొంచుకున్నాడు, శంకర్ స్వభావం తెలుసుకోటం కష్టం ఉన్నట్టు ఉండి మండిపడతాడు కాంతి నోరు మూతపడ్డందుకు విభూతి సంతోషించాడు అతను తన మనోభావాన్ని దాచటానికి - ''సరేగాని, సూర్యుడు అస్తమిస్తేఎవరికి కష్టమో చెప్పండి?'' అని అడిగాడు

కాంతిని సంతోష పెట్టటానికి శంకర్ అతనివేపు చూస్తూ-''నువ్వు చెప్పు ?'' అన్నాడు

కాంతి ముఖం ముడుచుకుని - ''నాకు తెలియదు కిశోర్ గుడ్ బాయ్ వాడినే అడుగు !'' అన్నాడు

''ఏం, ఇవ్వాళ చెప్పలేదా మన సంస్కృత పండితుడు క్లాసులో - సూర్యుడు పద్మబాంధవు డనీ, చంద్రుడు కుముదమిత్రు డనీ'' అన్నాను నేను

శంకర్ శ్లోకం చదివాడు,

గిరౌ కలాపీ గగనే పయోదః
లక్షాంతరేర్కశ్చ జలేషు పద్మాః
ఇందోర్ద్విలక్షం కుముదస్య బంధుః
యో యస్యమిత్రం నహి తస్య దూరం

''శ్లోకం సరేగాని, పాట ఒకటి పాడండి'' అన్నాడు విభూతి

''నువ్వు పాడవోయ్ ఒకపాట !'' అన్నాడు శంకర్ కాంతిని

ఉహుఁ, నా గొంతు రాచుకుపోయింది'' అన్నాడు కాంతి.

''ఉహుఁ, కోప మొచ్చిందా ! అయితే నువ్వు పాడవోయ్, అమియ్'' అన్నాడు శంకర్

అమియ పాట పాడాడు పాట పూర్తి అయినాక అందరం కలిసే ఇళ్ళకు వెళ్ళాము

మర్నాడు మామూలువేళకు స్కూలుకు వెళ్ళాను మొదటి పీరియడు ఇంగ్లీషు మా అసిస్టెంటు హెడ్‌మాస్టరు జనార్దనబాబుగారే పాఠం చెప్పేవారు వారిని చూస్తే పిల్లలకు మహాభయం క్లాసులో ఏమాత్రమూ చప్పుడు చేయకూడదు. వారు రాగానే మాకు కొన్నిప్రశ్న లిచ్చారు మేము

జవాబులు వ్రాసి వారి టేబిలుమీద పుస్తకాలు పెట్టాము ఆయన ఒక పుస్తకం తీసుకుని చూస్తూ ఉన్నాడు ఇంతలో ఎవరో నామీద గుట్టుచప్పుడుగా కాగితపు ఉండ ఒకటి విసిరారు. అది జనార్దనబాబు కనిపెట్టి- ''ఏమిటది ?'' అని గర్జిస్తూ, నా దగ్గరికి వచ్చి ఆ ఉండ తీసుకున్నారు నేనది విప్పి చూశాను - అందులో నిన్న పాడిన జావళీ ముక్కలు పెన్సిలుతో రాసి ఉన్నై మాస్టరుగారు మండిపడుతూ- ''క్లాసులో కూచుని సరసా లాడుతున్నారా ? ఎవరీ పని చేసింది?'' అని గర్జించారు

వారి అరుపుకు క్లాసులో పిల్లలంతా భయపడి మెదలకండా ఊరుకున్నారు ఎవ్వరూ మాట్లాడకపోవడం చూసి వారు నన్ను పిలిచారు నేను గజగజ వణుకుతూ పోయి వారిముందు నుంచున్నాను వారు నన్ను ప్రశ్నలు వేయ నారంభించారు

''ఈ కాగితం నీమీదికే విసిరారా?''

''అవునండి ''

''ఎవరు విసిరారు ?''

''నేను చూడలేదండీ ''

''నీకు తెలుసా ఎవరు విసిరిందీ?''

''నాకు తెలియదండి ''

''కాగితం ఎటునించి వచ్చిందీ ?''

''ఎదురునించండీ ''

అప్పుడు పంతులుగారు నా ఎదురుగా ఉన్న బెంచీమీది పిల్ల లందర్నీ పిలిచి, దస్తూరి చూపించి ఇది ఎవరి దని అడిగారు ఎవ్వరూ తప్పు ఒప్పుకో లేదు అప్పుడు వారు మండిపడి ఆపిల్ల లందర్నీ బెంచీ ఎక్కించి తిన్నగా హెడ్ మాస్టరుగారి గదికి వెళ్లారు ఈ అనుమానింపబడిన పిల్లల్లో శంకరుడూ, విభూతీ, కాంతీ, ఇంకా ముగ్గురూ ఉన్నారు వాళ్లంతా ఉగ్రులై నావంక చూడసాగారు నేను పెద్దతప్పు చేసినవాడిలాగా మెదలకుండా కూచున్నాను అప్పుడు చూడాలి వినయుడి ఉత్సాహం! వాడు- ''హుఁ! క్లాసులో కూచుని సరసా లాడుతున్నారా?'' అని పంతులుగారు అన్న మాటలు వివిధ భంగిమలతో ఉచ్చరిస్తూ పిల్లల్ని నవ్విస్తున్నాడు కాసేపటికి హెడ్‌మాస్టర్ గదికి రమ్మని నాకు పిలుపు వచ్చింది. నేను భయపడుతూ, భయపడుతూ వెళ్లాను. హెడ్‌మాస్టరుగారు నైతికవాది హాస్యాన్నికూడా బూతు గా

తీసుకుంటారు కాని వారిది తొందరపడే స్వభావముకాదు, ముక్కోపి కాదు సాధ్యమైనంతవరకు న్యాయం జరిగేటట్టు చూచేవారు జనార్దన బాబు వారిదగ్గర కూచునిఉన్నారు వారు నన్ను ప్రశ్నలమీద ప్రశ్నలు వేసి నిన్నటి సంతిగ అంతా బయటికి లాగారు దీన్నిబట్టి శంకర్‌నీ, విభూతినీ, కాంతినీ పిలిపించి వాళ్ళ దస్తూరి పరీక్షించారు కాంతి చిక్కాడు హెడ్ మాస్టరుగారు వాణ్ణి— "నువ్వు నిజం చెప్పు, ఈ దస్తూరి నీదా, కాదా?" అని అడిగాడు

"కాదు!" అన్నాడు కాంతి తొణకకుండా.



కాని హెడ్‌మాస్టరు వాడి మాట నమ్మలేదు ఎందుకంటే కాంతి కాగి తప్పు ఉండలో వ్రాసిన తప్పే మళ్ళీ పరీక్షలోనూ వ్రాశాడు అందుచేత హెడ్ మాస్టరుగారు వాడి మాట నమ్మక, అబద్ధమాడినందుకుగాను ఒక రూపాయి జరిమానా వేశాడు ఇక ముందు ఇలాంటి పోకిరీపనులు చేయ వద్దనికూడా హెచ్చరించాడు మే మంతా క్లాసుకు తిరిగివచ్చాము, కాని జనార్దనబాబు ఆ చిన్న శాస్తితో సంతృప్తిపడలేదు ఆయన క్లాసుకు వచ్చిన తర్వాత పిల్లలందరి ఎదటా కాంతి చేసిన తప్పు చాలా గొప్పదనీ, నావోటి మంచి బాలుడు అటువంటి చెడ్డబాలురతో కలిసి తిరిగితే ఇహమే కాకుండా పరంకూడా చెడిపోతుందనీ లెక్చరు ఇచ్చాడు ఆ పీరీడంతా దీనితోనే గడిచింది జనార్దనబాబు వెళ్ళిపోయిన తర్వాత వినయుడు పంతులుగారి గొంతును అనుకరిస్తూ "కాన, నో బాలకులారా! సావధానులు గండు క్లాసులో సరసంబు లాడకుడు" అన్నాడు వినయుడి మాటలకు క్లాసంతా పొట్టలు పగిలేటట్టు నవ్వారు శంకరుడూ అతని అనుచరులూమాత్రం ముఖం తప్పేలలాగా పెట్టుకు కూచున్నారు

ఇది జరిగినతర్వాత శంకరుడూ, అతని మిత్రులు నాతో మాట్లాడటం మాని వేశారు నేనూ వాళ్లతో కలవాలని ప్రయత్నించేవాణ్ణి కాదు

అంచేత నదివొడ్డుకు షికారుపోవటమే మానివేసి ఇంకోవేపు వెళ్ళేవాణ్ణి. కొంతకాలమైనాక నాకు నదివొడ్డుకి షికారుకు పోవాలని బుద్ధిపుట్టింది ఒక నాడు వెళ్ళాను. శంకరుడూ, విభూతీ, కాంతీ ఆ చెట్టుక్రిందే కూచుని నవ్వు కుంటూ ఏదో మాట్లాడుతున్నారు. నేను రావటం చూసి వాళ్ళు నాకు విన బడేటట్టుగా మాట్లాడుకోవటం మొదలుపెట్టారు;

కాంతి అన్నాడు: A good boy always minds his lessons. (మంచి పిల్లవా డెప్పుడూ పాఠములు చదువుకొనును.)

విభూతి :—"He does not play with bad boys. (వాడు చెడుపిల్లలతో నాడుకొనడు.)

శంకరుడు ఈమాటకు నవ్వాడు. విభూతి మళ్ళీ అన్నాడు:— Chandragupta was the grand daughter of Asoka. (చంద్రగుప్త అశోకుని మన మరాలు)

"భేష్, భేష్! ఇంకా ఏమైనా?" అన్నాడు శంకరుడు.

విభూతి :—"Aurangazeb imprisoned Chandragupta and ascended the throne of delhi,"(ఔరంగజేబు చంద్రగుప్తుని బంధించి ఢిల్లీ సింహాసన మును వశపరచుకొనెను.)

ఈ మాటకు అంతా పకపక నవ్వారు. నేను దూరాన ఉన్నప్పటికికూడా వాళ్ళతోపాటు నవ్వకుండా ఉండలేకపోయాను. ఈ సంభాషణ విన్నతర్వాత బహుశా వాళ్ళకి నామీద కోపం తగ్గిఉంటుం దని ఊహించాను. ఐనా శంక రుడు నన్ను పిలవలేదు. కాబట్టి నేను అక్కడ ఆగకుండా వెళ్ళిపోయాను మర్నాడు నాకు బుక్‌పోస్టులో ఒక పుస్తకం వచ్చింది. అది వాగ్దత్త. అప్పుడే వెలువడింది. మా బావగారు నాకోసం పంపారు. నేను పార్శిలు స్కూల్లోనే విప్పాను అది పిల్లలందరి చేతుల్లోకి తిరిగింది. శంకరుడు దానివంక ఆశతో చూశాడు కాని చూడనట్టు నటించసాగాడు.

ఆ తర్వాత కాసేపటికి స్కూలు వదిలారు, నేను పుస్తకం తీసుకుని ఇంటికి వెళ్ళాను. కాని పుస్తకం మా అక్కకు చూపించకుండా చొక్కా చాటున పెట్టుకుని షికారుకు వెళ్ళి వచ్చేప్పుడు శంకరుని ఇంటిమీదుగా వచ్చాను. అప్పటికి శంకరుడు ఇంటికి వచ్చేవేళ అయింది. దూరాన వస్తూ కనిపించాడు కూడా వెన్నెల. నేను ఆ దోవను పోతున్నట్టుగా నటిస్తూ నడుస్తున్నాను శంకరుడు నన్నుచూసి—"ఎవరు? కిశోర్!" అన్నాడు.

నేను 'ఆఁ' అన్నాను. అతను ఆగలేదు; మళ్ళీ మాట్లాడలేదు కూడాను. నేను అతని వెనకనే పోయి – 'ఈ పుస్తకం ఇవ్వాళ పోస్టులో వచ్చింది. కావలిస్తే చదుకుని 'ఇవ్వు' అని అన్నాను.

నామాట విని అతను ఆగి, వెటకారంగా – "ఇవాళ మహా సావాసం చేసుకోవచ్చావే!" అన్నాడు.

నాకు కళ్ళలో నీరు తిరిగింది. "నీకు నే నేమి అపకారం చేశానూ?" అని అడిగాను.

"ఏమీ చెయ్యలేదా? ఆవాళ హెడ్‌మాస్టరు దగ్గర నన్ను అవమానించిందెవరూ?" అని అడిగాడు.

నేను ప్రాధేయపడుతూ "ఆవాళ నా తప్పేమీలేదు. నేను నీమీద ఏమీ చెప్పలేదు. నువ్వే అనవసరంగా నామీద కోపగించావు!" అని చెప్పాను.

కాని శంకరు డేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. నేను ఎంతో ప్రయాస మీద ఏడుపు ఆపుకుని ఇంటికి మళ్ళాను.

దోవలో వినయుడు కనిపించాడు. వాడు అప్పుడే అనుచరులతో ప్లేగ్రౌండ్ నించి తిరిగి వస్తున్నాడు. నేను ప్రక్కగా తప్పుకుపోవా లని ప్రయత్నించాను. కాని వినయుడు నన్ను చూసి చేతులు తట్టి పిలిచాడు. నేను భయపడుతూ దగ్గరికి వెళ్ళాను. వాడు– "ఏమిరా, కిశోర్! నువ్వీమధ్య చాలా గుడ్ బాయ్‌వి అయినట్టుగా ఉన్నావే? ఆటలాడటానికికూడా రావటంలేదు. షికారుకు పోతున్నాకూడా పుస్తకం చంకను వుండాలా?" అని అడిగాడు.

నేను జవా బేమీ ఇవ్వకుండా ఊరుకున్నాను. కాని వినయుడు వదిలే ఘటంకాదు. "ఆ పుస్తకం ఎమిటీ?" అంటూ నా చేతిలోనించి పుస్తకం లాక్కున్నాడు.

"ఈ పుస్తకం ఇవ్వాళ నీకు పోస్టులో వచ్చింది. కాదురా?" అన్నాడు వినయుడు.

నేను 'ఊఁ' అని ఊరుకున్నాను – ఎక్కువ మాట్లాడితే పట్టుబడతానేమోనని. వినయుడు పుస్తకం అటూఇటూ తిప్పిచూసి – "సరే, ఈ పుస్తకం తీసుకుని నువ్వు శంకరుడి ఇంటిముందుగా ఎందుకు వెళ్ళావో చెప్పూ? ఓహో! తెలిసిందిలే–ఇది శంకరుడికి లంచంగా ఇచ్చి సంతృప్తిపరుద్దామనా!" అన్నాడు.

అతని అనుచరు లంతా ఈ మాటకు నవ్వారు. నేను సిగ్గుతో క్రుంగిపోయాను. నేను మెదలకండా ఊరుకోవటం చూసి, వినయుడికి జాలివేసిం

దనుకుంటాను. వాడు నా పుస్తకం నా కిచ్చి - "ఫో, ఇంటికిపో! బాగా చదువు. ఈ అర్ధసంవత్సరం పరీక్షల్లో నువ్వు ఫస్టున రావాలి. శంకరుడికంటే ను వ్వెందులో తక్కువ? వాడు అన్నీ భట్టీపెట్టి రెండు మూడు మార్కులు ఎక్కువ తెచ్చుకుంటున్నాడు. అంతమాత్రంచేత వాడు మొనగాడా?" అన్నాడు.

నేను ఇంటికి తిరిగివచ్చాను. శంకర్‌కూ నాకూ ఏమి సంబంధం! వాడిచేత ఇంత అవమానింపబడటం ఎందుకూ నేను? పైగా వినయుడి చేతకూడా ఎగ తాళి చేయించుకోవలసి వచ్చెగదా! ఆతనంటే నాకు గౌరవ ముండవచ్చును; కాని అతనికి నేనంటే బొత్తిగా ఇష్టమేలేదుకదా! మరి ఎందుకు అతనివెంట పడటం?

నేను అతనితో ఇక కలవకూడ దని ప్రతిజ్ఞ చేసుకున్నాను. కాని, ఆ తర్వాత జరిగిన ఘటన నా ప్రతిజ్ఞను నిలవనివ్వలేదు

## 3

ఊళ్ళో వ్యాపారస్థులు దసరా సందర్భంగ మహావైభవంగా చేసేవారు. ఈ సందర్భంలో నాటకాల కంపెనీవాళ్ళనికూడా పిలిపించేవారు. ఈ నాటకాలకు చాలామంది జనం వచ్చేవారు - ముఖ్యంగా స్కూలు పిల్లలు జాస్తి. ఆ సంవత్సరం నాటకం మొదటి రోజున ముందు కూర్చోటం విష యంలో కొంతమంది పిల్లలు తగాదా పెట్టారు. అందుకని ఆ వ్యాపారస్థులు మర్నాడు అల్లరి జరగకుండా ఉండటానికిగాను స్కూలు పిల్లలలోనే పెద్ద వాళ్ళను పరి వాలంటీర్లుగా ఉంచారు. కాని దీనికి ఫలితం ఎదురు జరిగింది. మా క్లాసులో వినయుణ్ణికూడా వాలంటీరుగా తీసుకున్నారు. వాడికి శంక రుడి ముఠా అంటే గిట్టదు. శంకరుడి పార్టీవాళ్ళకుకూడా వాడు వాలం టీరు కావటం ఇష్టంలేదు. అందుకని వాళ్ళు వినయుడు అడ్డుతున్నా విన కుండా ముందుకు తోసుకుపోవటానికి ప్రయత్నించారు. పెద్ద గలాటా అయింది. పెద్దవాళ్ళు ఎంత బ్రతిమాలినా ఎవ్వరూ వినలేదు. పోలీసులకు కబురు వెళ్ళింది! వాళ్ళు రావటం చూసి శంకరుడి ముఠావాళ్ళు బయటికి తప్పుకెళ్ళారు. కాని వాళ్ళు అంతటితో ఊరుకోలేదు. ఒక గంట తాళిన తర్వాత ఆట బాగా రక్తికట్టుతూ ఉండగా నాటకం పందిరిమీద రాళ్లు పడసాగినై. క్రమంగా అల్లరి బయలుదేరింది. అప్పుడు పోలీసువాళ్ళు దుండ గీండ్రను పట్టుకోటానికి బయలుదేరారు. నిజంగా తప్పుచేసినవాళ్ళు ఎప్పుడో

పారిపోయారు. ఇక దొరికినవాళ్ళు శంకరుడూ, అమియ, సత్యచరణుడూ వాళ్ళను వెంటపెట్టుకుని పోలీసులూ, వ్యాపారస్తుల తరఫున హజారీబాబూ పోలీసు స్టేషనుకు బయలుదేరారు. ఈ రాళ్ళ మూలంగా గ్యాసులైట్లు కొన్ని పగిలిపోయినై. అందుచేత వాళ్ళకు మరీ కోపంగాఉంది. నేను దూరంగా ఉండి ఇదంతా చూస్తున్నాను.

హజారీబాబుగారి ఇల్లు మా ఇంటిదగ్గరే. వారు మా అన్నతో కలిసి చదువుకున్నారు. ఎప్పుడూ మా యింటికి వస్తూ ఉండేవారు. వారిని నేను అన్న అనే పిలిచేవాడిని. నేను వాళ్ళ వెంటపోయి హజారీబాబుగారితో "అన్నా ! నా మాట ఒకటి వినవూ ?" అని అడిగాను.

"ఏమిటీ? నువ్వుకూడా ఉన్నా వేమిటి ఇందులో!" అన్నాడు హజారీబాబు.

''మీ రనుకుంటున్నారా, నే నున్నా నని ?''

వారు నవ్వి - "నువ్వు మంచివాడి వనే నా నమ్మకం ! సరే నువ్వు చెప్పే దేమిటి ?" అని అడిగారు.

నేను శంకర్‌ను చూపుతూ – ''మీ రా అబ్బాయిని ఎరుగుదురా ?" అని అడిగాను.

''ఊహుఁ. నే నెరగను. చూస్తే ఈ ముఠాకు ఇతనే నాయకుడులా గున్నాడు.''

''అతని ఆకారం అలాగే ఉంటుంది. కాని స్వభావం చాలా మంచిది. అతనిపేరు శంకర్. కోర్టు మున్సబుగారి కొడుకు. ఇలాంటి చెడుపని అతను చేసిఉండడని నాకు గట్టినమ్మకం. అతన్ని పొరపాటుగా పట్టుకుని ఉంటారు, పోలీసులు. అతన్ని వదిలిపెట్టండి,'' అన్నాను.

హజారీబాబు కొంచెం మెత్తబడి – ''మున్సబుగారి కొడుకా – నీ స్నేహితుడా – అతను నిర్దోషి అని నీ నమ్మకమా - అయితే వదిలిపెట్టిస్తాను.'' అని, పోలీసులకు చెప్పి వదలిపెట్టించారు.

శంకరుడు ఈ విధంగా విముక్తి పొంది నా దగ్గిరికి వచ్చి, రెండు చేతులూ పట్టుకుని – ''కిశోర్ ! నీలాంటి హితైషి నాకు లేడని ఇవ్వాళ తెలుసుకున్నాను'' అన్నాడు.

నేను నవ్వుతూ – ''అంటే 'రాజద్వారే శ్మశానేచ యస్తిష్ఠతి సబాంధవః' కాని హెడ్మాష్టరుగారి రూంలో నేను శత్రువు ననే భావించావుగా'' అన్నాను..

శంకరుడు నా చెయ్యి తన చేత్తో గట్టిగా పట్టుకుని - "అది నువ్వు మనసులో పెట్టుకోమాకు, కిశోర్! నాది పొరపాటు. ఇవ్వాళ నాకు తెలిసివచ్చింది. ఇక్కణ్ణించి వాళ్ళతో కలవనుకూడా కలవను. కాని ఇవ్వాళటి సంగతి ఎక్కడా చెప్పకు – మా నాన్నకు తెలిసిందంటే నన్నింటోకి రానివ్వరు" అన్నాడు.

"ఎక్కడా చెప్పను. నువ్వు నిశ్చింతగా ఉండు. సరే, ఇక ఇంటికి పోదాము పద - ఇప్పుడు నాటకం చూడాలన్నా అంత బాగుండదు!" అని శంకరుని వాళ్ళ ఇంటికి తీసుకువెళ్లాను. హాజారీబాబు అమియను, సత్యాచరణుణ్ణి వెంటపెట్టుకుని ఠాణాకు వెళ్లాడు.

మర్నాడు తెలిసింది, వాళ్ళను జామీను తీసుకుని వదిలిపెట్టారని. అయితే, వాళ్ళమీద కేసుపెట్టలేదు, సాక్ష్యం లేకపోవటంమూలాన.

ఈ విధంగా శంకర్‌తో నాకు స్నేహ మయింది. అతనంటే నాకు చాలా ఇష్టం. నేనన్నా అతనికి అంతే. క్లాసులో మే మిద్దరమూ ఒకచోటే కూచునే వాళ్ళం. స్కూలు వదిలిన తర్వాత నేను అతని యింటికి వెళ్ళటమో, అతను మాయింటికి రావటమో జరుగుతుండేది. శంకర్ నేనూ స్నేహంగా ఉండటం మొదలుపెట్టిన తర్వాత విభూతిగానీ, కాంతిగానీ నన్ను ఏడిపించే వాళ్ళు కారు. శంకర్ వాళ్ళతో కలవటం బొత్తిగా మానేశాడు. వినయుడు మాత్రం అప్పుడప్పుడు నన్ను దెప్పిపొడుస్తూ ఉండేవాడు; అంచేత అతనికి నేను సాధ్యమైనంతవరకు తప్పుకు తిరుగుతుండేవాడిని. శంకర్‌కు ప్రమీల అని ఒక చెల్లెలుంది. మునిసిపల్ గరల్స్ స్కూల్లో చదివేది. ఆ స్కూలు మా యింటిఅగ్గరే. మా చెల్లెలు కమలతోపాటు అప్పుడప్పుడూ మా యింటికి వచ్చేది. నన్ను 'అన్నా' అనేది. నేను వాళ్ళ యింటికి వెళ్ళితే నన్ను వదిలేదే కాదు. వాళ్ళ అమ్మకూడా నేనంటే చాలా ఇష్టం.

ఆ యేడు సాంవత్సరిక పరీక్షలో శంకరే మొదటివాడుగా వచ్చాడు. లెఖ్ఖల్లో నాదే ఫస్టుమార్కు గాని మొత్తంమీద రెండోవాడిగా వచ్చాను. సంస్కృత పండితుడు మా స్నేహంచూసి 'జంటరత్నాలు' అని పేరుపెట్టాడు; కాని కొద్దికాలానికే మా 'జంట' విడిపోయింది. ఆ సంవత్సరం ఎండా కాలంలోనే శంకర్ తండ్రి అమరేంద్రబాబుగారు బారిసాల్‌కు బదిలీ అయారు. నేను కృష్ణనగరంలోనే ఉండిపోయాను.

జాంసెపాల్ నించి శంకర్ అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూ ఉండేవాడు. నేనూ జవాబు లిస్తూ ఉండేవాణ్ణి. మొదటిరోజుల్లో అతనిదగ్గిరినించి ఉత్తరం రాకపోతే ఎలానో ఉండేది. కాని, కాలం గడిచినకొద్దీ మా ఉత్తరప్రత్యుత్తరాలు తగ్గిపోయినై. అతన్ని చూడకపోతే ఒక్కరోజు ఉండలేక పోవడం పోయి, ఈ నాటికి అతన్ని సంపూర్తిగా మరిచిపోగలిగాను! బహుశా శంకర్ కూడా నన్ను అలాగే మరిచిపోయి ఉండవచ్చు. బాల్యస్నేహంపట్ల విధాత శాపం ఇదేకామోలు!

కాని శంకరుడూ నేనూ మళ్ళీ కలుసుకోవటం విధాత మాచేత ఇంతకంటేకూడా పెద్దనాటకం ఆడించటానికే ననుకుంటాను — అంచేతనే మా పూర్వస్నేహం తెగిపోనివ్వలేదు.

## 4

ఆరేడేళ్ళు గడిచినై. నేను కృష్ణనగరం కాలేజీలో ఇంటరు పాసై కలకత్తా వచ్చి మెడికల్ కాలీజీలో చేరాను. ఎనాటమీ, ఫిజియాలజీలు నేర్చుకోవటంతోపాటు ఈ మధ్య సాహిత్యరంగంలోకూడా ప్రవేశించాను, హాస్పిటల్ 'డ్యూటీ'లో ఉన్నప్పుడు కాలం జరగటంకోసం ఇంగ్లీషూ, బెంగాలీ నవలలూ కావ్యాలూ చదువుతుండేవాణ్ణి. కేవలం చదవటంతోటే ఆగకుండా వ్రాయటంకూడా మొదలు పెట్టాను. మొదట రెండుకథలు రాశాను. సంకోచిస్తూనే వాటిని 'వైజయంతి'కి పంపించాను. అవి సంపాదకుడి ధన్యవాదాలతో తిరిగిరాకుండా అచ్చు పడటమేకాక, సంపాదకుని వద్దనించి ఉత్తరంకూడా వచ్చింది, ఇంకా కథలు పంపమని. నాకు చాలా ప్రోత్సాహం లభించి ఇంకా కొన్నికథలు రాశాను, అవి కూడా అచ్చుపడినై. ఈ మధ్యను 'భారతప్రభ'లో స్త్రీల అభ్యుదయంమీద ఒక వ్యాసం పడింది, నే నా వ్యాసాన్ని ఖండిస్తూ విమర్శ రాశాను. నేను డాక్టరుపరీక్షకు చదవటంచేత స్త్రీ పురుష శరీరతత్వాలను గురించి అనేక విషయాలు చదవవలసివచ్చింది; వాటి నన్నిటినీ ఉదాహరించటానికి అవకాశం చిక్కినందుకు సంతోషించి, రెండు వ్యాసాలు రాసి, ఆ పత్రికే పంపాను. ఈ విధంగా నేను చిన్న విమర్శకుణ్ణికూడా అయినాను.

నేను పాటలడాంగా మెస్‌కు వచ్చి చేరిన మరునాడు, దాదాపు పది గంటల వేళప్పుడు బేథూన్ కాలేజీ బస్సు మా మూలకు వచ్చి ఆగింది. ఒక చక్కటి యువతి మా పక్కగల్లీనించి వచ్చి అందులో ఎక్కింది. నేను రెండో



అంతస్తులో ఉండి ఈ దృశ్యం చూచి నప్పుడు నా శరీరంలో విద్యుత్తు ప్రవహించిన ట్లయింది. ఆ మర్నాడుకూడా అదే వేళకు మళ్ళీ ఆ పిల్ల వచ్చి అదే విధంగా నా శరీరంలో విద్యుచ్ఛక్తి ప్రవహింపజేసింది. నేను ప్రతిరోజూ ఆమెను చూడటంకోసం వేచిఉండే వాణ్ణి — కాలేజీకి సెలవు నాడు మాత్రం ఆ బస్సు వచ్చేదికాదు — నే నా దినం వృథాపోయినట్టుగా భావించేవాణ్ణి. ఈ విధంగా ఆరు మాసాలు గడిచింది.

ఆనాడు ఉదయం ఎవరి ముఖం చూసి లేచానో తెలియదు — నా అదృష్టం పండింది. నేను మధ్యాహ్నం మూడుగంటలకు ఇంటికి వస్తున్నాను. మా మెస్సు దగ్గరికి వచ్చేవరకు "ఎవరూ? కిశోర్ కాదూ!" అంటూ ఒక యువకుడు వచ్చి నా వీపు తట్టాడు. నేను వెనక్కు తిరిగి చూశాను — శంకర్! ఇంత కాలమైనాక మళ్ళీ అతను కనపడేవరకు నాకు ఆనందం పట్టలేక కావలించుకున్నాను. శంకర్ కాసేపు ఊరుకుని— "నువ్వు ఇక్కడ ఉంటున్నావా? నాకెప్పుడూ కనపడలేదే?" అన్నాడు.

"నేను వచ్చి చాలాకాలమయింది. మెడికల్ కాలేజీలో చేరాను ఇదే నేనుండే మెస్! నువ్వెక్కడ ఉంటున్నావు శంకర్?"

"మా ఇంటోనే, భవానీపూర్‌లో అంతా మరిచిపోయావేమిటి? నాన్నగారు సబ్ జడ్జీ చేస్తూ రిటైరయి. కలకత్తాలో ఇల్లు కొని ఉంటున్నారు. నేను లా చదువుతున్నాను. ప్రమీల జ్ఞాపక ముందా నీకు?"

"ఎందుకు లేదు? చిన్నప్పుడు చూశాను. ఇప్పుడు చాలా పెద్దదై ఉంటుంది?"

"దాన్ని చూడదలచుకుంటే నా వెంటరా. ఈ పక్క గల్లీలోనే దాని అత్తగారిల్లు. నేనిప్పు డక్కడికే పోతున్నాను."

"అయితే కొంచెమాగు శంకర్! నేనుకూడా గుడ్డలు మార్చుకుని వస్తాను....సరి. ఇక్కడ నిలబడట మెందుకూ? పైకొచ్చి కూర్చో." అని శంకర్ చేయి పట్టుకుని నా గదికి లాక్కు వెళ్లాను. ట్రంకులోనుంచి ధోవతీ షర్టూ తీసి వేసుకుంటో — "ఒకప్పు టీ తాగుతావా. శంకర్!"




"వద్దురా. నేను టీ తీసుకునేబయలుదేరాను. మళ్ళీ అక్కడికిపోతే ఇంకోమాటు తీసుకోకతప్పదు—" అని లేచాడు.

మేము చేతులు పట్టుకునే నడిచివెళ్ళాము. కొంచెందూరం పోగానే ఒక ఇంటో చొరబడి — "సుకుమార్!" అని కేక వేశాడు శంకర్.

ఒక అందమైన యువకుడు ఇంటోనించి బయటికి వచ్చి "ఈయన ఎవరూ?"

"నేను పోగొట్టుకున్న రత్నం!" అన్నాడు శంకర్.

ఆ యువకుని కేమీ అర్థంకాక మా యిద్దరినీ తీసుకుని ఇంటో అడుగు పెట్టుతుండగా, ఒక యునతి చకితహరిణిలాగా ఆ గదిలోనించి వెళ్ళిపోయింది. నా కాశ్చర్యం వేసినది ఈ యువతే బేథూన్ కళాశాల విద్యార్థిని, విద్యుత్ శిఖ! సుకుమారుడు శంకర్ బావమరిది ఈమె సుకుమార్ చెల్లెలు —నీహారిక.

# నీహారిక చెప్పినది

నేను ఇంటరు పాసై బి. యే. మొదటి సంవత్సరం చదువుతున్నాను. నేను మా ఇంటినించే కాలేజీకి వెళ్ళేదాన్ని. మా నాన్నగారు కాలేజీలో ప్రొఫెసరుగా ఉండేవారు. రెండు సంవత్సరాలైంది వారు చనిపోయి. వారి ప్రయత్నంవల్లనే నా చదువు ఇంతవరకు రావటం. నాకు అన్నా, అమ్మామాత్రం ఉన్నారు. మా అన్న సుకుమార్, నాకంటే రెండేళ్ళు పెద్ద. కలకత్తా యూనివర్సిటీలో యం. ఏ. చదువుతున్నాడు. నేను చిన్నప్పటినించీ మా అన్నను అంత పెద్దగా చూసేదాన్ని కాదు. నువ్వు అనే పిలిచేదాన్ని. అన్నయ్యకూడా నన్ను రకరకాల పేర్లతో పిలిచేవాడు. నేను హిందూకన్యను. అందుకనే మా అమ్మ నాకు త్వరగా పెళ్ళి చేసి పంపివెయ్యాలని ప్రయత్నిస్తోంది. నాన్నగారు బ్రతికివుండగా మా అమ్మ మాటలు వినేవారు కారు. ఇప్పుడు మా అన్న – "ఏమే! నువ్వుకూడా బి, యే. పాసయి నాకు పోటీ వస్తావా? ఇది నేనెంతమాత్రం సహించను!" అని ఎగతాళిగా అంటున్నాడు.

కాని నేనుమాత్రం వివాహం చేసుకోనని నా ప్రతిజ్ఞ. వివాహమంటే ఒక పురుషుని దాసత్వానికి ఒప్పుకోవటమే. అదీ ఒకనాటిదికాదు – చిరకాలానికి ఈ విషయం నేను నా ఈ కొద్దిపాటి జీవితంలోనే అర్థంచేసుకోగలిగాను.

మా ఇల్లు కలకత్తాలోని పాటలడాంగాలో ఉంది. అక్కడ జనసమ్మర్దం అంతగా ఉండదు. మా గల్లీకి ఎక్కువగా కార్లూ, జట్కాలుకూడా రావు. ఐనా అర్ధరాత్రిపూట రెండు కారణాలవల్ల నాకు నిద్రాభంగ మవుతూఉండేది. మా ఇంటి ప్రక్కనే చాకలిగుడిసె ఒకటి ఉంది, వాడి గాడిదె అప్పుడప్పుడూ అర్ధరాత్రి ఓండ్రపెడుతూ ఉండేది; రెండోది మాయింటి కెదురుగానే ప్రాణబాబు అని ఒకాయన ఉన్నాడు. ఆయన యాభై సంవత్సరాలు గడిచినతర్వాత శాస్త్రప్రకారం వానప్రస్థానానికి పోక, సంతానం లేదనే నెపంమీద పదిహేను సంవత్సరాల ముక్కుపచ్చ లారని కన్యను అదే శాస్త్రాన్ని ఆధారం చేసుకుని వివాహ మాడాడు. దాదాపు రోజూ అతను తాగివచ్చి భార్యని బాదుతూ ఉండేవాడు; ఆ పిల్ల ఏడుపుకు నాకు మెలకువ వస్తూఉండేది. నేను అలాగే కళ్ళుమూసుకు పడుకుని ఆ దురదృష్టవంతురాలిని గురించి ఆలోచిస్తూ ఉండేదాన్ని. ఆ పిల్లపేరు మాలిని; చక్కనిదికూడా; నా ఈడుదే; మే మిద్దరమూ పిట్టగోడ దగ్గరకువచ్చి మాట్లాడుకుంటూకూడా ఉండేవాళ్ళం. కాని చిత్ర

మేమంటే ఆపిల్ల భర్తకు విరుద్ధంగా ఏమీ చెప్పేదికాదు – రాత్రిళ్ళు అంత ఏడ్చినా, పగలు ధోరణి చూస్తే, ఎంతో సుఖపడుతున్నట్టుగా కనిపించేది. నే నామె 'స్లేవ్ మెంటాలిటీ' (దాసీమనోభావం) చూసి ఆశ్చర్యపోయేదాన్ని. మానవుని స్వాతంత్ర్యం లోపింపజేసి పంజరంలో చిలకలాగా తయారుచేస్తుంది. ఇతర సంఘాల్లో ఈదాస్య శృంఖలాల్ని ఛేదించటానికి మార్గం ఉంది. కాని హిందూ సంఘంలో లేదు. ఒకమాటు ముడిపడితే దాన్ని త్రెంచటానికి బ్రహ్మదేవుడి తరం కాదు! స్త్రీజాతిపట్ల జరిగిన ఈ అన్యాయాన్ని తలుచుకున్నప్పుడెల్లా నా మనస్సు విద్రోహం చేస్తూ ఉండేది. ఈ విషయమై నేను మా అన్నతో ఎంతో తర్కించేదాన్ని - పోట్లాడేదాన్ని. అంచేతనే మా అన్న నాకు 'అమెజాన్' రణరంగిణి అని పేరు పెట్టాడు.

మా భాగ్య విధాతలైన పురుషజాతిమీద నాకు కోపం కలగటానికి ఇంకా చాలా కారణాలు ఉన్నై. స్త్రీ పురుషుల మధ్య ఉన్నది ఎలికా పిల్లీ సంబంధమేనా ? స్త్రీ పురుషుడి భోగానికేనా సృష్టించబడింది. మా కాలేజీలో చదువుతున్న యువకులని చూస్తే నా కిదే బోధపడుతూ ఉండేది. మేము కాలేజి గేటుదాటి బయటికి వచ్చేవరకు మా కాలేజీ బస్సు వాకిట్లో సిద్ధంగా ఉండేది. అక్కడ ఫుట్‌పాత్ మీద మమ్మల్ని చూడటానికి ఎంతోమంది కుర్రవాళ్ళు నోట చొంగకార్చుకుంటూ నిలబడేవాళ్ళు. అందులో చాలామంది ఘరానా కుటుంబాలకు చెందినవాళ్ళేనని వాళ్ళ వేషాలే చెప్పుతూ ఉండేవి! "ఈ దేశంలో స్త్రీలు అంతఃపురాల్లోనించి బయటికిరారు; అంచేత బతికిపోయారు. లేకపోతే ఈ నరరూప వ్యాఘ్రాలు వాళ్ళని తినేవే" నని అనుకునేదాన్ని. ఒకనాడు ఈ విషయమై మా అన్నతో వాదన జరిగింది. "మనదేశపు ఘోషా ఆచారమే దీనికి కారణం. మగవాళ్ళకు ఆడవాళ్ళు బయట కనబడే అలవాటులేదు కనుకనే ఆడవాళ్ళు కనపడగానే అంత విడ్డూర్యంగా చూస్తారు. ఆలా లేనిచోట్ల ఈ విడ్డూర్యంకూడా లేదు" అన్నాడు మా అన్న. ఇది కొంతవరకు నిజంకావచ్చు, కాని అంతా కాదు.

ఒకనాడు వోగమ్మత్తు జరిగింది. నాకు లతిక అనే కాలేజీ స్నేహితురాలుంది. ఆమె ఐ. సి. యస్. ఆఫీసరు మిస్టర్ సి. కె. బోసు కూతురు ; అందమైనది; చక్కగా అంకరించుకోవటమంటే అమెకు ఇష్టం. ఆధునిక సమాజంలో బాగా తిరగనేర్చింది. ఆ నాడు మే మిద్దరమూ ఒక సినిమాకు పోయాము. మేము సినిమా చూసి బయటికి వస్తూవుండగా ఇద్దరు ముగ్గురు

యువకులు. ఒరగంట మమ్మల్ని చూస్తూ ఏదో గుసగుస లాడుతున్నారు. లతిక వాళ్ళు బెదరిపోయేటట్టు వాళ్ళ దగ్గిరికిపోయి "ఇదిగో మీ ఎదటికివచ్చి నుంచున్నాను. ఏమన్నా అనదలచుకుంటే నాతోనే అనండి !" అన్నది. ఆమె యుద్ధానికి సన్నద్ధం కావటంచూసి వాళ్ళు విస్తుపోయి ఒకరిమొహాలు ఒకళ్ళు చూసుకోసాగారు. లతిక మళ్ళీ - "ఛీ మీరు పెద్దమనుషులుకారా ? చదువుకో లేదా ?" అన్నది. అప్పు డందులో ఒక కుర్రవాడు లతికకు నమస్కరించి- "క్షమించండి. మేము మీ సంగతి ఏమీ మాట్లాడుకోవటంలేదు" అన్నాడు. నేను పోయి లతిక చేయిపట్టుకు లాక్కువచ్చాను.

అన్నయ్య అంటాడు:— "మగవాళ్ళు ఆడవాళ్ళవల్ల ఆకర్షింపబడితే అందులో వాళ్ళ తప్పేముంది ? భగవంతుడు తన సృష్టిని కొనసాగించటం కోసం మగవాళ్ళదృష్టికి ఆడవాళ్ళు అసలే అందంగా కనపడేలాగ చేశాడు. అంతటితో అగక ఈ ఆడవాళ్లు ఇంకా నానావిధ అలంకారాలతో మగవాణ్ణి ఆకర్షిస్తూ ఉంటారు. పాపం వాళ్ళు ఆకర్షింపబడక ఏమవుతారు ?"

కాని నేను అన్నయ్య వాదన వొప్పుకోను. భగవంతుడు స్త్రీజాతిని ఇంత నీచమైపనికోసం సృష్టించా డంటే నేను నమ్మను ! మగవాళ్ళ మాదిరిగా ఆడ వాళ్ళకూ వ్యక్తిత్వమూ, స్వాతంత్ర్యమూ ఉంది. మగవాళ్ళ మాదిరిగా వీళ్లు కూడా తమ జీవితాన్ని సార్థకం చేసుకోగలరు. మగవాళ్లు తమ స్వార్థసిద్ధి కోసం స్త్రీలను కాళ్ళక్రింద తొక్కిపట్టి ఉంచారు. ఇప్పుడు స్త్రీలు విద్యనేర్చు కుని తమ స్వాతంత్ర్యంకోసం పెనుగులాడవలసిన అదను వచ్చింది. ఈ చర్చ ఏమైనా కానీండి - నేనుమాత్రం హిందూ శాస్త్రాలకు ఎదురుతిరిగి పెళ్ళి చేసుకోకూడ దని నిశ్చయించుకున్నాను. ఈ నిర్ణయం మీకు ఇదివరకే చెప్పానుకూడా. అయితే నే నీ విషయాలు అన్నయ్యతో తర్కించటంతోనే ఆగలేదు - ఒకటి రెండు వ్యాసాలు 'భారత-ప్రభ'కు రాశానుకూడా; కాని అందులో నా పేరు ఇవ్వలేదు - మారుపేరు ఇచ్చాను. అవి అచ్చు అయి నాయికూడా.

## 2

ఒక నాడు మా అన్నయ్య సాయంత్రం షికారునించి తిరిగివచ్చి - "నీరూ! నీ కొక కానుక తెచ్చాను ఇవ్వాళ-ఇదుగో." అని భారతప్రభ పత్రిక నా కిచ్చాడు. నేను పత్రిక మొదటిపేజీ తిప్పి విషయ సూచికలో 'స్త్రీవిద్య-దాని ఫలితాలు' అనే వ్యాసం ఉండటంచూసి, గబగబా ఆ వ్యాసం చదివివేశాను. చదువుతుంటే నా వొళ్ళు మండిపోయింది. రచయిత ఇలా అంటున్నాడు :

[సశేషం]



మావాడి ప్రణయ కథలో నేను జోక్యం కలిగించుకోకుండా ఉండాలని చాలా ప్రయత్నించాను, కాని సూర్యమే నన్ను బలవంతంగా అందులోకి లాగాడు; నెలరోజులు ఆలోచించి మరీ రాసిన తన ప్రణయ లేఖ చూపించాడు :

"కమలా,

నన్ను వివాహం చేసుకోటానికి నీ కేమన్నా అభ్యంతరం ఉందా ?

నీకి ఉత్తరం రాయకుండా ఉండాలని నెల్లాళ్ళనించీ ప్రయత్నిస్తున్నాను. లాభం లేకపోయింది. నిన్ను కోరకుండా ఉండాలని నేను చేసిన ప్రయత్నమంతా వృధా అయిపోయింది.

నన్నే అడిగితే, నాకన్న అన్ని విధాలా మంచివాణ్ణీ, అందమైన వాణ్ణీ, ధనికుణ్ణీ, తెలివిగలవాణ్ణీ, పెళ్ళాడమని సలహా ఇస్తాను.

—సూర్యం ''

"ఎట్లా ఉంది ఉత్తరం?" అన్నాడు సూర్యం.

నే నాలోచించి, ''నీలాగే ఉంది. పోస్టులో వేసిచూడు'' అన్నాను.

దానికి వచ్చిన సమాధానంకూడా మావాడు నాకు చూపాడు. నన్నా జవాబు పైకి చదవమన్నాడు.

''సూర్యంగారూ,

మీ ఉత్తరం గురించి ఏమనుకోవాలో నాకు తెలీదు. నన్ను మీరవమానం చేయటానికి ప్రయత్నిస్తున్నట్టు భావిస్తున్నాను. మీ రింకా మంచిగా, అందంగా, ధనికులుగా, తెలివిగా లేనందువల్ల మిమ్మల్ని పెళ్ళాడలేను

—కమలాదేవి.''

---

కొడవటిగంటి కుటుంబరావు

నేనా ఉత్తరం పూర్తి చెయ్యగానే సూర్యం విరగబడి నవ్వసాగాడు. వాడికి మతి చెడిందని నా కనుమానం తగిలింది. ఎందుచేతంటే వాడు కమలను ప్రేమించాడు. తన ప్రేమను విమర్శించుకున్నాడు. దాని బలాన్ని పరీక్షించి, అది గట్టి ప్రేమే నని నిర్ణయించుకున్నాడు, అట్లాంటి ప్రేమ ఇట్లా పరిణమించినందుకు నాకు విచారమేసింది.

నేను వాడి భుజం తట్టి, "ఫరవాలేదులేరా, ఓ నెల్లోజుల్లో నువ్వా అమ్మాయిని మరిచిపోతావు — కాస్త ప్రయత్నిస్తే" అన్నాను.

వా డింకా నవ్వసాగాడు.

"ఆ పశువునా?" అన్నాడు నవ్వుతూనే "దానికోసం నెల్లోజు లకారణంగా హైరానుపడ్డాను. చెప్పుతో కొట్టక సముదాయిస్తావేం."

నా గుండెమీది బరువు తీసినట్టయింది.

తరవాత రెండు నెల్లకు కాబోలు కమల వివాహం అయింది. ఆమెభర్త కొత్తగా ఐ.సి.యస్. పరీక్ష పాసయి ఎక్కడో డిప్టీకలెక్టరుగా ప్రవేశించాడు. చూపులకు దొరక్లేనే ఉంటాడు.

మా సూర్యంలో కలిగిన మార్పు నేను నాలుగైదు రోజుల అనంతరం గాని గమనించలేదు: వాడాహారనిద్రలు విసర్జించాడు. వాడి నవ్వు విని ఎన్నో సంవత్సరా లయినట్టుంది. వాణ్ణి చూస్తేనే భయం వెయ్యసాగింది.

"ఏమిట్రా, సూర్యం?" అన్నాను.

"ఆ కమల—" అన్నాడు.

"ఆ కమలమీద మళ్ళా వ్యామోహం కలిగిందా ఏమిటి?" అన్నా ఆశ్చర్యంతో.

సూర్యం తల అడ్డంగా తిప్పాడు.

"కమల అన్నమాట నిజం. ఆ ఉత్తరం రాసి నే నావిణ్ణి అవమానించాను."

అప్పట్లో నువ్వట్లా అనుకోలేదే!".

"అప్పటి కది అవమానం కాదు. ఈ పెళ్ళివల్ల అది అవమానంగా పరిణమించింది."

"ఎట్లా?"

"కమల కెటువంటి మొగుడు దొరికాడో చూడు! కమలని ప్రేమించటానికిగాని ప్రేమించా నని చెప్పి ఉండటానికిగాని నా కే మధికారం ఉంది?"

"కమలను పశు వన్న వాడివి కాదూ?"

"అప్పుడు — నాకు సమాధానం రాసినప్పుడు కమల పశువే!"

సూర్యానికి నిజంగా పిచ్చి ఎత్తిందనే, ఇప్పటికీ నాకు విశ్వాసం.... ....!




మధురం లేచిపోయిందనే సంగతి మొదట యెవరు చెప్పారో జ్ఞాపకం లేదు. గాలిలో పరుగెత్తు కొచ్చినట్టు వచ్చింది ఖబురు. రమణరావు లేవదీసుకు వెళ్ళాడో వెంకట్రావు లేవదీసుకు వెళ్ళాడో ఖాయంగా తెలియదు. కొంత మంది రమణరావు అని. కొంతమంది వెంకట్రావు అని కొంతమంది ఇద్దరూ కలసి అని.

అప్పటికి రెండు రోజులనుంచీ కాలేజీకి సెలవవటంచేత నాకు వార్త వచ్చేటప్పటికి సాయంత్రం 5 గంట

లయింది. అప్పటి కాలేజీలో పిల్ల లంద రికీ, వాళ్ళో సగంమందికీ ముఖ్య విషయం మటుకు పాకింది. దీంట్లో విశేషం యేమిటంటే మధురం బి. యే. జూనియరు చదవటమూ గాదు, మా కందరికీ కావలసిన క్లాసుమేటు కావ టమూ కాదు. ఆమె మా ఇంగ్లీషు ప్రొఫెసరు రామనాథంగారి కుమార్తె కావటం. ఇట్లా జరుగుతుందనే సంగతి ఆయనకే గాదు కాలేజీలో మా కెవరికీ తెలియకుండా మేనేజ్ చేశా రంటే మాకు బహు పెద్ద ఆశ్చర్యంవేశింది.

వాళ్ళ రూముకు వెంటనే పరుగె త్తాను అది రామనాథంగారి యింటి దగ్గిరగా వాళ్ళ బజారులోనే వుంది. గదిలో వెంకట్రావు వున్నాడు. అతని చుట్టూరా అయిదారుగురుమంది మన స్నేహితు లున్నారు. నా వెనకటితేనే ఇంకా చాలామంది రానందుకు ఆశ్చర్యం వేశింది.

వెంకట్రావు పెద్ద హీరోలాగా కూర్చు న్నాడు — తానే ఇంతపని చేసినట్టుగా. మొత్తంమీద యేమి చేసినా యేమి చెయ్యకపోయినా కొంత తెలిసి వుండాలి అనుకున్నా మనిషి తరహానుబట్టి, వీడి దగ్గరనుంచి ఎట్లాగైనా ఇన్ఫర్మేషన్ లాగాలె

"ఏమి టిది ?" అన్నా.

"ఏమి టిది యేమిటి ?" అన్నాడు వెంకట్రావు

"మా దగ్గిర బుకాయించకు."

"అమ్మతోడు — యెంతవొట్టుపెడితే అంతవొట్టు. మీ దగ్గిర ధ స్తా నా ? మీ కెంత తెలుసునో నా కంత తెలుసు" అన్నాడు. కాని మేం యెవ్వరం నమ్మ లేదు. ఒకళ్ళిద్దరం వుంటే యేమన్నా చెప్పేవాడేమో. పది పదిహేను మందిమి వున్నామాయను, కొంచెం సంకోచించి నట్టు కనపడ్డాడు. కాని అక్కడ అపాట్ల వొదిలిపెడితే కడుపుబ్బరంపుట్టి చస్తా డేమోనని కనికరించి నేనే ప్రశ్నలు వేసి లాగుదామని చూచాను.

"వాళ్లు లవ్ చేసుకుంటూన్నట్టు నీవు యిదివరకు యేమన్నా అనుమాన పడ్డావా ?"

"ఆమె రమణగాడ్ని ప్రేమిస్తున్నట్టు కలలోగూడా అనుమానపడలేదు; కాని రమణగాడూ నేనూ అస్తమానం మధు రాన్ని ప్రేమిస్తూండేవాళ్ళం. వాడు నాకు అందకుండా యెగరగొట్టేశాడు."

రమణగాడు చివరమాటు యెక్కడ కనపడ్డాడు ? ఎప్పుడు కనపడ్డాడు ? ఒక్కడే కనపడ్డాడా? వీటికి సమాధానం చెప్పు."

"నా కేమీ తెలియ దంటే నా దగ్గర నుంచి ఇన్ఫర్మేషన్ లాగాలెనని చూస్తూ న్నారే మీరు? సరే కానీండి చివరి మాటు రమణగాడిని ఈ రూము దగ్గర రాత్రి షుమారు 2 గంటలకు బండిలో

మధురంతో కూర్చుండగా చూచాము. మీకు సంతృప్తి అయిందా ?''

"వారే ! వీడికి అంతా తెలుసురో ! మన్ని బుకాయిం చేస్తున్నాడ్రా !'' అన్నాడొకడు.

"మనకు అంతా చెప్పేదాకా వదలి పెట్టొద్దురా !'' అన్నాడు ఇంకోడు.

''వారే, బ్రదర్ ! లాభంలేదు చెప్పాలిసిందే'' అన్నాను.

అప్పుడు వెంకట్రావు అన్నాడు— "మీ రందరూ నే చెప్పేది పరమ రహస్యంగా అట్టేపెడతా మని చేతిలో చెయి వేస్తే నాకు తెలిసినంత మటుకూ చెపుతాను. రామనాధంగారుగూడా అడుగుతే నా కేమీ తెలియ దని ప్రమాణం చేసి చెప్పాను. యేమిటి. మీరందరూ ప్రామిస్‌చేస్తారా!''

మేము యావన్మందిమీ తప్పకుండా రహస్యంగా అట్టేపెడతా మని తలలు వూపాము. అప్పుడు వెంకట్రావు పూసగుచ్చినట్టు అంతా చెప్పాడు.

*　　*　　*

మన రమణగాడి సంగతి మీకు తెలుసుగా—ప్రతి ప్రొఫెసరు ఇంటికి వెళ్ళటం. దణ్ణాలుపెట్టి వస్తూంటం.

ఇట్టా ఉంటే అసలు మూలం యెట్లా వచ్చిందంటే వారం రోజులక్రిందట వీడు వాళ్ళింటి కెళ్ళినప్పుడు మధురం "కిప్స్" యివ్వమని అడిగింది. సరేలే అన్నాడు. అన్నవా డేం చేశాడు, ఆ పుస్తకం సరిగా ఇవ్వక దాంటో ఓ ఉత్తరం పెట్టాడు. అప్పుడు నాతో ఆలోచించకుండా నాకు తెలియకుండా చేశాడు. దాంట్లో యేమని రాశాడు, "Dear M. I love your అని ఒక ముక్కరాసి దాంటో పెట్టాడు ఆ పుస్తకం యిచ్చేశాడు.

అప్పటినుంచీ యేంచేశాడూ, అయింటి ముందరగా వెళ్ళదాం రారా అంటే రాడు. అసలు కాలేజీ గూడా రెండు రోజులు యెగ్గొట్టాడు. ఏదో పెద్దభారం తన మీద పడ్డట్టుగా దిగాలపడి కూర్చున్నాడు. ఏమిట్రా అంటే యీ కాస్తముక్కా బయటపెట్టాడు. ఇహ వీడ్ని కాలేజీలోంచి డిస్‌మిస్ చెయ్యటం ఖాయం అనుకున్నా.

కాని అంతమటుకూ యేమీ బయటకు రాలేదు. మధురంమటుకు నన్ను చూస్తే సురసురలాడుతూ మొహం అటు తిప్పుకునేది. అప్పుడు అనుకున్నా యిది వుత్తరం సంగతి యెవరికీ బయట పెట్టలేదని. పైగా రామనాధంగారు నన్ను పిలిచి "రమణరావు రాలేదేం?" అని అడిగాడు. "ఏదో వొంటో కొంచెం సుస్తిగావుండి రాలేదండి" అని తడువుకోకుండా చెప్పాను. ''అలాగా, పాపం! రేపు ఒక్కసారి మాయింటికి రమ్మన్నానని చెప్పు'' అన్నాడు. అక్కడితో నాకు మరికాస్త ధైర్యం వచ్చింది. ఈ సంగతంతా రూముకు వచ్చి రమణగాడితో చెప్పాను.

వాడికీ ధైర్యం వచ్చింది. చావుతప్పి కన్ను లొట్టపోయి బయట పడ్డాడో లేదో అప్పుడే మొదలుపెట్టాడు. మధురానికి తనమీద ప్రేమ వుందనీ, అ సంగతి తనకు మొదటినుండీ తెలుసుననీ. ఈ విధంగా అప్పుడు నేను గదమాయించాను "చాల్లే, వెధవా, నోరు మూసుకొని వుండు. లేకపోతే నేనే వెళ్ళి ఆ రామనాధంగారితోనూ ప్రిన్సిపాల్తోనూ చెప్పి, మధురం చెయ్యటానికి జంకుతూన్న పని నేను చేసేస్తాను." అంత గట్టిగా చెప్పినతర్వాత నోరు మూసుకున్నాడు.

మొన్నాడు పొద్దున్న రామనాధంగారు పిల్చారు. వెళ్ళరా అంటే కదలడే! "నేను వెళ్ళను. ఏదో ప్రయివేటుగా దొబ్బులు పెట్టటానికి రమ్మన్నాడు," అంటాడు. రామనాధంగారి చేతనో లేకపోతే మధురం చేతనో దొబ్బులు పెట్టిస్తేనే బాగుంటుం దని నాకు తోచింది. అందుకని వూరుకోక వాడు వెళ్లేదాకా చంపాను. ఇహ వాడు తప్పనిసరిగా బయలుదేరాడు!

* * *

రమణ వెళ్ళి వరండాలో నిల్చొని "రామనాధంగా రున్నారా?" అని యెవరికన్నా వినపడుతుందేమో అన్నట్టు నెమ్మదిగా అడిగాడు. అదృష్టవశాత్తు మధురం పక్క గదిలోనే వుంది. "లేరు" అని జవాబు చెప్పింది. బతికి బయట పడదామని చూస్తుండగా మధురం యెవరో చూట్టానికి బయటకు వచ్చింది. చూస్తే పీడు; తప్పించుకు పారిపోతున్నాడు. "మిష్టర్, ఇట్రా" అంది మధురం. చేతులూకాళ్ళూ చల్లబడ్డయి రమణగాడికి. మెల్లిగా గదిలోకి వెళ్ళాడు. పుస్తకమూ వుత్తరమూ తీసి—

"ఏమి టీ వుత్తరం?"

...............

"ఇట్లా వుత్తరాలు రాయగూడ దని నీకు తెలియదూ?"

...............

"మన ప్రిన్సిపాలు యెంతమందిని డిస్మిస్ చేశాడు?"

...............

"ఈ పాట్లి యీవుత్తరం మా నాన్నగారికి చూపిస్తేచాలు, నీవు యేమవుతావో ఆలోచించుకున్నావా?"

...............

"నీవు బి. యే. చదువుతున్నావే, యింతమాత్రం జ్ఞానం లేకపోయిందా?"

...............

"ఎప్పుడూ యిట్లాంటి పని చేయ నని ప్రామిస్ చేస్తావా?"

...............

"లేకపోతే దీన్ని యిప్పుడే మా నాన్నగారి కిచ్చి ప్రిన్సిపాలుగారికి పంపించనా?" అంది మధురం.

ఇంతవరకు రమణగాడు ఒక్కమాట గూడా మాట్లాడలేదు. బెల్లంకొట్టిన




రాయి లాగా వింటూ దూలాలవంక చూస్తూ నిల్చున్నాడు. ఇప్పుడు తప్పని సరిగా మధురాన్ని క్షమాపణ కోరి తన ప్రాణం కాపాడుకోవలసి వచ్చింది. "తెలియక చేశాను, నన్ను నీవు యేం చేసినా సరే" అన్నాడు. దాంట్లో గూడా కొంచెం వియోగం.

మధురం ఆ పత్రం తానే చింపి ముక్కలు ముక్కలుచేసి పుస్తకం రమణ గాడికి యిచ్చి "యీ తడాకు తప్పించు కున్నావు. యిహ కబడ్దారీగా వుండు" అన్నది.

దాంతో మనవాడు బతుకు జీవుడా అని బయటపడ్డాడు. రూముకు వచ్చే

టప్పటికి సగం ప్రాణాలు చచ్చి వచ్చాడు. ఏమయిందిరా అంటే యెంత సేపటికీ చెప్పడు నేను వాణ్ణి బెదరించి జరిగిన కథ అంతా లాగాను తగిన శాస్తి అయింది కదా అని సంతోషించాను

ఈ కథ యింతటితో ముగిసింది కదా అనుకుంటే ముగియలేదు తలవని తలంపుగా కొత్తకొత్త డెవలప్మెంట్స్ వచ్చినయి మొన్నటికల్లా

* * *

మొన్నాడు రాత్రి – అంటే నిన్న రాత్రి అన్నమాట – రమణగాడు యిదంతా యిట్లా వచ్చిం దనీ, యిట్లా చెయ్యబో తున్నా మనీ నాతో వచ్చి చెప్పిందాకా నా కేం తెలియదు, నమ్మండి

బి యస్ రావు, ఐ సి యస్ ఒకాయన వున్నట్ట బహుశా మీకు తెలియదు ఆ రావుగారికీ యీ రామనాధం గారికీ కొంత ముఖాముఖీనీ, కొంత పోస్టుద్వారానూ వుత్తర ప్రత్యుత్తరాలు జరిగినవి నిన్న పోస్టులో ఆ రావుగారి దగ్గరనుంచి ఓ వుత్తరం వచ్చింది, దాంట్లో "మీ మధురం నాకు నచ్చింది వివాహం చేసుకోటానికి వొప్పుకున్నాను 10 వ తారీఖున పెళ్ళి చేసుకోటానికి వస్తున్నా" అని రాశాడు

అంతవరకూ మధురానికీ, తల్లికీ యీ పెళ్ళి ముచ్చ టేమీ తెలియవు రామనాధం గారు యేమీ ఖాయం గాంది యెందుకులే ముందస్తిగా చెప్పటం అని వూరుకున్నాడు. బి. యస్. రావుగారు రెండు వారాల కిందట పెద్ద హడావిడిగా వచ్చి రామనాధంగారి యింట్లో ఒకరోజు వుండి మధురాన్ని చూచి పోయినాడుగాని యింట్లోవాళ్ళకి యిందుకు వచ్చా డని ఏమీ తెలియదు

రామనాధంగారు యీ వుత్తరం చదువుకోగానే మధురమూ, తల్లీ భోంచేస్తూంటే వచ్చి అన్నాడు "యేమే, మన మధురానికి గొప్ప సంబంధం కుదిరింది రెండువేల రూపాయల జీతగాడు – మన అమ్మాయిని చేసుకోడానికి వొప్పుకున్నాడు "

"అంటే మొన్న పదిరోజులనాడు మన యింటికి వచ్చిన ఆయనా యేం ?"

"అవును ఆయనే !"

"సరేలే – నల్లగా తుమ్మ మొద్దులాగా–యాభై యేళ్ళన్నా వుండవూ ఆయనకు ? ఇంతికూ మన మధురాన్ని కనుక్కున్నారా ? ఈడు వచ్చిన పిల్ల పెద్ద చదువు చదువుకుంటూంది – మనంకూడా అందరి మోస్తరుగా చేస్తే నవ్వుతారు "

"నీవు ముందస్తిగానే దానికి నేర్పు దానికిమటుకు తెలియదా యేమిటి ? నెలకు రెండువేలు వస్తూవుంటే యెవరన్నా వద్దంటారూ?–యేమే అమ్మ, నీ అభిప్రాయం ఏమిటి "

ఇంతవరకూ తల్లిదండ్రుల సంభాషణ తల వంచుకుని వింటున్నది మధురం ఆధాట్టుగా రామనాధంగారు యీ ప్రశ్న




జడ్జి – "నీవు దొంగతనం చేయలేదంటావే మరి ఆ ఇంట్లో ఎందుకు దూరావ్?"
దొంగ – "అది నా ఇల్లనుకున్నానండి "
జడ్జి – ''అయితే ఆ యింటి యజమానురాలును చూసి ఎందుకు పారిపోయ్యావ్?''
దొంగ – ఆమెను చూసి మా ఆవిడ అనుకున్నానండి?''

---

వేసేటప్పటికి తనకు జవాబు దొరకలేదు అసలు చిన్నప్పటినుంచి తండ్రి అంటే కొంచెం బెరుకు అందులో యిట్లాంటి విషయాలు తండ్రితో యెప్పుడూ మాట్లాడి యెరుగదు కనక మౌనమే అవలంబించింది ఆ మౌనాన్ని అంగీకారంగా తీసుకున్నాడు రామనాధంగారు

''ఆయన 10 వ తారీకు పెళ్ళి చేసుకోటానికి వస్తున్నాడు, కనక మనం సిద్ధంగా వుండాలి ఏముంది శివిల్ మారేజి చేసేద్దాము'' అన్నాడు

"సరేలే! అప్పుడే యిందాకా వచ్చిందీ? మొత్తంమీద మీదండీ నేర్పు ఇంటో వేను ఇంకా చవ్వాగదా, నాతో అన్నా చెప్పరాదూ? ఎవడిక్కావాలె. మీ యిష్టంవచ్చినట్టు చేసుకోండి తండ్రీ కూతుళ్ళు'' అంది

"నీ దొక యేడుపు ఇప్పటి నంగ

తులు ఏమీ తెలియవు పెద్దదాన పైనావు నీ కెందుకు వూరుకోవే అంటే వూరుకోవు వెధవగోల" అన్నాడు

''చాల్లేండి మీ మాటలు నేను ముసలి దాన్నయితే, యెవరినన్నా చిన్నదాన్ని పెళ్ళి చేసుకోండి, ఈడూజోడుగా వుంటారు "

"ఇహ చాలు నోరుమూసుకో "

* * *

సాయంత్రం నాలుగయింది టెన్నిసు ఆడుకుందాం గదా అని రమణా నేనూ కాలేజీ కెళ్ళాం

"ఏదో మీటింగల్లే వుంది ఒకసారి లోపలికి వెళ్ళొద్దామా యేం ?" అన్నాడు రమణగాడు

"నా న్సెన్స్, ఏమిటి వెళ్లేది ? టెన్నిసు ఆడుకుందాం లెద్దూ" అన్నా

"అట్లాకాదు, వూళ్ళో ఆడ జనం అంతా వచ్చారు ఒక్కసారి వెళ్ళి చూస్తే మర్యాదగా వుంటుంది" అన్నాడు వాడు

చేతుల్లో బాట్లు ఆడించుకుంటూ కాలేజీ హాలుకు దారి పట్టాం

దాంటో ఓ పెద్ద మీటింగు గొప్ప గొప్ప సంఘసంస్కర్తలం అనుకునేవాళ్ళందరూ చేరారు మొగవాళ్ళతో ఆడ వాళ్ళతో కిటకిట లాడుతూంది హాలు మా యిద్దరికీ కష్టంమీద లోపల నిల్చోటానికి చోటు దొరికింది

రామనాధంగారు అప్పటికి అరగంట సెపటినుంచీ ప్రెసిడెన్షల్ ఎడ్రస్ యిస్తున్నారు.

"ఈ వివాహాలవల్ల కలిగే ఘోరాలు ఇంతకంటె ఇప్పుడు యెక్కువగా విశదీకరించటం అనవసర మని నేను గట్టిగా వూహిస్తాను

ఇటీవల జరిగిన సెన్సెస్ ప్రకారం యిండియాలో సంవత్సరానికి 4,250 000 బాల్యవివాహాలు జరుగుతూన్నయి అనీ అందులో 3,240 000 మంది బాలవితంతవులు అవుతున్నారనీ, అందులో 150,000 మందికి పునర్వివాహా లవుతున్నయి అనీ తేలింది చూచారా గుండె బద్దలయిపోతూంది

"అలాంటి వన్నీ రూపుమాపి యిండియాలోంచి పోవాలంటే, హిందూదేశంలో స్త్రీలకు పునర్వివాహం, విద్య, స్వేఛ్ఛ—యివి ముఖ్యఅవుసరాలు స్వేచ్ఛ అనగా స్వతంత్ర బుద్ధి, అనగా స్వతంత్రశక్తి, అనగా free and independent thought "

ఇట్లా పోతూంది ధోరణి రామనాధం గారికి పోతూంటే ''యిహ చాల్లేరా ! డబ్బాలాగా వుందిరా !" అన్నాడు రమణగాడు

కాని హాలంతా నిశ్శబ్దంగా వుంది, ఆయన్ను చూసి అయితేయేం, ఆయన లెక్చరు చూసి అయితేయేం రామనాధం గారంటే గొప్ప సంఘసంస్కర్త చిన్నప్పుడనంగా బ్రహ్మసమాజంలో చేరి

జంధ్యం, బొట్టూ తీసేశాడు కనక పెద్ద పేరు పడ్డ బ్రహ్మసమాజికు డాయెను (అసలు కాలేజీలో వుద్యోగం కూడా సమాజంవల్లనే అని అందరికీ తెలిసిన రహస్యమేనాయెను ) పైగా యీ మీటింగుకు ప్రెసిడెంటుకూడా ఆయను_అంతా నిశ్శబ్దంగా వింటున్నా రంటే ఆశ్చర్యం లేదు

అంతవాడిని పట్టుకుని యీ రమణ గాడు.డబ్బాలాగా వుంది అంటే మొత్తం మీద కొంచెం జాలివేసింది అప్పుడన్నాను "యిప్పుడు డబ్బాలాగా వుందని అంటున్నావుగాని మొదట నేను వద్దురా అంటే విన్నావు? అసలు నీవు యెందుకొచ్చావో తెలుసులే, చివాట్లుతిన్నా సిగ్గు రాలేదు నీకు మధురం వచ్చిందేమో చూతా మని వచ్చావు ఆమె రాలేదు, యిహ పోదాం పద అంటున్నావు."

మధురంకోసం వచ్చా నంటే నేను వొప్పుకోను గాని ఆమె రాకపోవటం కొంత వింతగానే వుంది'' అన్నాడు రమణ

ఇంతలో దిక్కులు చూస్తున్న ఓ పెద్దమనిషి మావంక చూచి "సైలెన్స్ ప్లీజ్'' అని కేకేశాడు

ఇక్కణ్ణించి ఇహ వెళ్ళితేనే మర్యాద దక్కుతుం దన్నా, ఇద్దరం బయట పడ్టానికి చూస్తూంటే ఇంతట్లోకే రామనాధం గారు రమణరావును చూచి, రమ్మని సంజ్ఞచేసి, కాగితాలేవో బల్లమీదపెట్టాను,



అవి అవుసరంగా కావాలి' అన్నాడు. రమణగాడు ఏమనుకున్నాడో సంకోచించకుండా బైలుదేరాడు.

* * *

రమణగాడు అట్లా బయలుదేరి వెళ్లి రామనాధంగారి యింట్లో మధురాన్ని వొంటరిగా కలుసుకున్నాట్ట

ఇహ యిక్కడి నుంచీ మీకు డిటేల్సు సప్లయి చేయలేను నాకు రమణగాడు చెప్పింది కొంత, నేను వూహించింది కొంత

రమణగాడు బల్లమీది కాగితాలు తీసుకుంటుంటే మధురమే మొదలు పెట్టి వుంటుంది

"విన్నావా?"

"ఎమిటి?"

"వచ్చే 10 వ తారీఖు నాకు..

"ఏమిటి?"

"మారేజి "

"ఏమిటీ? —ఏమిటీ? — మారేజా? —ఎవరికి?"

"నాకే "

"ఎవరు?"

"ఏమి తెవదు? —పెళ్ళికొడుకా? — ఎవరో బి యస్ రావుట "

"ఆఁ?" నోరు కొంచెం సేపు అట్లాగే తెరుచుకొని వుంది రమణగాడికి

"ఏమిటీ ఆశ్చర్యం? నీకిష్టంలేదా యేమిటి?'

"నీ కిష్టమే?"

"ఎందుకు? కాకపోతే యీ పెళ్ళి మంచి నన్ను తప్పిస్తావా?"

"తప్పించమంటే తప్పిస్తాను ''

"ఎట్లా?

''ముందు నేనే పెళ్ళి చేసుకుంటాను

'లేకపోతే ''

"నన్ను పెళ్ళి చేసుకోక పోయినా తప్పిస్తాను నీ ఇష్టం '

"నాకు యెట్లాగైనా యిష్టమే నీ యిష్టం యెట్లాగో అట్లాగే చెయ్యి "

అప్పుడు మధురాన్ని కనీసం రెండు ముద్దులయినా పెట్టుకొని వుంటాడు అవకాశం దొరికితే వొదిలిపెట్టే రకం కాదు మన రమణగాడు

అప్పటికి ఆపి కాగితాలు తీసికొని పరిగెత్తుకెళ్ళి రామనాధంగారి కిచ్చి మళ్ళీ పరుగెత్తుకొని వచ్చి మధురాన్ని కలుసుకున్నాట్ట అప్పుడు యేమి జరిగిందో నేను బొత్తుగా యేమీ చెప్పలేను

రెండుగంటల రైలుకు బండి తీసుకొచ్చి రూము దగ్గర నిలబెడితే మధురం వచ్చి కలుసుకునేటట్టు యేర్పాట్ల ప్రకారం అంతా సక్రమంగా జరిగిం దని నేను వేరే చెప్పక్కర్లేదు

* * *

తెల్లవారింది మమ్మల్నిద్దరినీరమ్మని ఖబురు పంపిస్తే నేను వెళ్ళాను రామనాధంగా రింటికి రామనాధంగారి ముఖంలో ప్రమాదకరమైన కాంతి కనిపిస్తోంది రామనాధంగారి భార్య కంటిలో తడి కనిపిస్తోంది యెవరో రామనాధంగారి స్నేహితుడు గామాలును యింకో ఆయన వున్నాడు వుండాలిసిన అదుర్దా అంతా ఆయన ముఖంలో వుంది మొత్తంమీద లోపల ప్రవేశించి నప్పటి నుంచీ ఆ యింటిలో గాలి సులభంగా పీల్చుకోలేకపోయినాను

'రమణరావు యేడి?' అని అడిగాడు రామనాధంగారు

"నిన్న సాయంత్రమునుంచీ నాకు కనిపించలేదు "

"ఎక్కడికి వెళ్లాడు?'

'ఏమో నాతో చెప్పి వెళ్ళలేదు '

ఆ రెండో ఆయన అన్నాడు — "నిన్ను కాలేజిలోంచి డిస్మిస్ చేస్తారు నిజం చెప్పకపోయినావంటే "

"ప్రమాణం చేసి చెపుతున్నాను. నిన్న సాయత్రం నుంచీ కనిపించ లేదండి" అన్నా

"రామదాధంగారూ! ఇహ యెందుకూ? ఇది ఆ రమణరావు పనే అయితే అతను మీ యింటికి రావటం అలవాటు వుందా యేం?"

'ఎప్పుడన్నా వస్తూవుండేవాడే ఇందుకోసం వస్తున్నాడని నాకేం తెలుసు? నిన్న సాయంత్రం కూడా కాయితాలు తీసుకురమ్మని యింటికి పంపాను దాంతో వచ్చింది యీ ప్రమాదం''

అసలు ప్రమాదం అదికాదు నేనంటే మీకు కోపం వస్తుందేమో కాని యెన్నే ళ్ళోచ్చినా పెళ్ళి చెయ్యకపోవడం మొగపిల్లలతో పాటు చదివించడం— ఏమయినా చెప్పండి చిన్నప్పుడే పెళ్ళి చెయ్యడం మంచిది'

అప్పుడు రామనాధంగారి భార్య అందుకుంది— అసలు తప్పు దాంది కాదు తప్పంతా రామనాధం గారిదే ఎవ్వరితో చెప్పకుండా ఆ ముసలి సంబంధం తీసుకొచ్చారు దాంతో హడలేసి పరుగెత్తింది"

"పరే, యిదికూడా ఒకటి చేశారూ! ఇహ మీ బ్రహ్మసమాజ మేమిటి! మీ సంఘ సంస్కారణ మేమిటి! అన్నాడు స్నేహితుడు

రామనాధంగారికి మొహాన నెత్తురు చుక్క లేదు చిన్నబుచ్చుకున్నాడు అప్పుడు ఆ స్నేహితు డన్నాడు — 'నేనొక సలహా చెపుతాను అట్లా చెయ్యండి మీ అమ్మాయికి ఎన్నో ఏడు!"

"పంధొమ్మిదో యేడు"

అయితే కిడ్నాపింగు క్రింద పవికి రాదుగాని యెబ్డక్షన్ క్రింద ఆ రమణరావు మీద కేసు పెట్టు!"

మీ సలహా బాగాలేదు లోకానికంతా యిట్లా జరిగిం దని తెలియబరుచుకొని తలకాయ యెత్తుకోకుండా చేసుకోడానికి చెబుతున్నారు ఇప్పుడే నేను బయలు దేరి వెళ్ళి వాళ్ళిద్దరినీ కొంపకు తీసుకొస్తాను ఇహ మీరందరూ దయచెయ్యండి" అన్నాడు రామనాధంగారు

అప్పుడు పే మందరం వచ్చేశాం. నామటుకు నేను రామనాధంగారి ప్రతిష్ఠ, మధుకం ప్రతిష్ఠ ముఖ్యంగా రమణగాడి ప్రతిష్ఠ కాపాడటాని కని యెవరికీ చెప్ప దలచుకోలేదు ఇంతలోనే ఊరంతా యెట్లా తెలిసిందో నాకు బోధపడకుండా వుంది అని వెంకట్రావు తన కధ ముగించాడు



# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

జ రి గి న క థ

*[సరోజిని కేశవరావులు మాధవిని చూచి ఆమెకు కొన్ని కానుకలు ఇచ్చి తిరిగి ఇంటికి చేరారు ఆదిలక్ష్మి అందుకు వారిని మందలించగా వారు లక్ష్యం చేయకపోవడంతో ఈ సంగతి ఆదిలక్ష్మి శ్యాంసుందరులు అనంతయ్యాగారికి కొండెము చెప్పినట్లుగా నూరిపోశారు ]*

— ఇక చదవండి

ఆ మాటలపై అనంతయ్యకు నమ్మకం కలిగిందో లేదో మరి !

అసలు ఒక విషయం ఇప్పుడు నేను కనిపెట్టాను బావగారూ మీకైతే నాపై ఇష్టం లేదుకానీ నేనెప్పుడూ మీ మంచి కోరేవాడినే అయినా పైకి నాలా నిష్కర్షగా మాట్లాడేవా డంటే ఎవరికీ ఇష్ట ముండదులెండి '

అనంతయ్య మాట్లాడలేదు

"నీ కంఠశోషే గాని ఆయన వినే దేమైనా వుందా ? ఎందుకు వూరుకో' అంది ఆదిలక్ష్మి

' నీకు తెలియదు అక్కయ్యా, పాపం బావగారు లోపల చాలా బాధపడ్తున్నారు" అని శ్యాం అనంతయ్యవైపు తిరిగి అన్నాడు

"అసలు ఆ పాణి మనవాడి మద్దత్తు చూచుకొనే అలా బిఱ్ఱబిగిశాడు లేకుంటే మనం చెప్పినట్టు విని మహాప్రసాదమని మనింట్లోనే పడివుండును అటు వాళ్ళిద్దర్నీ మనకు తెలియకుండా దగ్గరచేసి భార్యా భర్త లిద్దరూ చాటుచాటున నూరిపోసి మనకు కాకుండా చేశారు ఇటు మనతో చాలా ప్రీతిగా ప్రవర్తిస్తూ ఏమీ ఎరుగనట్లు వుంటున్నారు అసలు ఈ ఇంట్లో వాళ్ళు వుంటే తమకు అడ్డని అలా యుక్తిగా తప్పించుకున్నారు మధువనం మాధవీ మందిర మవీ అలాగైతే తమకే వుంటా యని ఈ పథకం పన్నారు అటు వాళ్ళపై ప్రేమ వున్నట్టు నటిస్తూ రాకపోకలు సాగించి ఆ విధంగా మనపై అయిష్టం కలిగిస్తున్నారు ''

"నిజమేరా నీదెంతతెలివి? నాకెప్పుడూ అంతవరకూ తోచనేలేదు" అంటూ తమ్ముడిని ప్రశంసించింది ఆదిలక్ష్మి

అనంతయ్య ఒక్కసారి తలెత్తి చూచి తల పంకిస్తూ వెళ్ళిపోయాడు అతడి వదనంలో ఏ భావమూ వ్యక్తం కావడంలేదు విన్నవిషయాన్ని ఒంట బట్టించు కోవడానికే ప్రయత్నిస్తున్నట్టున్న అతడి ముఖకవళికలు చూచి ఇద్దరూ తృప్తి పడ్డారు

'ఛ అతిరహస్యం అతిబహిరంగ మైపోయింది, ఎలాగ? నాన్నగా రేమంటారో? పెద్దగొడవే జరిగేటట్లుంది" అని భయాందోళనతో సతమత మవు తున్నారు సరోజనీ కేశవరావులు అంతలో నౌఖరు వచ్చి చెప్పాడు "కోడలమ్మ గారిని అయ్యగారు పిలుస్తున్నారు" అని గుండెలు అరచేతిలో పెట్టుకుని నక్కుతూ నక్కుతూ వెళ్ళింది సరోజని

'పిల్చారట?" భయంగా మందస్వరంతో అడిగింది గుమ్మంలో నిల్చుని

కళ్ళు మూసుకుని వాలుకుర్చీలో పడుకున్న అనంతయ్య కళ్ళు విప్పి లేచి కూర్చున్నాడు 'ఇలా లోపలికి రామ్మా"

విందలూ, మేఘ గర్జనలూ వినవలసి వస్తుం దనుకున్న ఆమె ఒక్కక్షణం ఆశ్చర్యపోయింది, లోపలికి వెళ్ళి కొద్దిదూరంలో నిల్చుంది నమ్రతగా

'బిందు ఎలావుంది? కులాసాగా కనపడిందా?"

అది కలో నిజమో నిర్ణయించుకుంటూ క్షణకాలం అట్లే నిల్చుండిపోయింది

'దాని కక్కడ సౌఖ్యంగా వుందా? సంతోషంగా కనిపించిందా?"

బిడ్డపై మమకార వాత్సల్యాలే ఆ గొంతులో స్పష్టంగా నిండుగా ధ్వనించాయి ఏ మూలనో కొద్ది దీనత్వం కూడ మిళితమైవున్నట్టు తోచింది, కాని ఎక్కడా ఆగ్రహం అహంకారం లేవు

సుఖంగా సంతోషంగానే వుం దని చెప్పి ఆ పితృ హృదయానికి ఊరట కలిగిం పడం తన విధిగా తలంచింది సరోజని కాని యదార్థం చెప్పి ఆ మనస్సులో కొంత జాలి ఉదయించగల దనే ఆశతో

'బాగానే వుందండి, కాని ఇక్కడ సాగినట్లు సాగదుకదాండీ?" అంది

ఏం? దానిచేత పనిపాటలు చేయిస్తూందా అత్తగారు? ఉలికిపాటుతో ఆందోళనగా అడిగాడు

మరి సామాన్యకుటుంబం కాదాండీ? చేసుకోనిదే జరుగదు "

'అయ్యయ్యో, దానికిక్కడ మంచినీళ్ళు ముంచుకుని త్రాగటమైనా నేర్పలేదే?'

అవి విచారిస్తున్న అతడికంఠం గాద్గదిక మైంది ఏమైనా చిక్కిందా ?

"కొద్దిగా చిక్కిందండీ అన్ని విషయాలకంటె మన మెవ్వరం కన్పించడం లేదనే బెంగే ఎక్కువగా వున్నట్టుంది "

"ఎలాటి బట్టలు కట్టుకుంది ? ఇక్కడున్నట్టే వుందా ?" కనీసం అదైనా అనుకూల సమాధానం రావాలని ఆశిస్తూన్న ట్లున్నాయి అతడి ముఖరేఖలు

కాని సరోజని చల్లగా చెప్పింది "ఏదో అంతంతమాత్రమే ఇక్కడున్న ట్లెలా గుంటాయండీ ? '

"హుఁ ఇక్కడ ముఖమల్ పరుపులమీదే పవ్వళించింది, పారిస్ సిల్కులే కట్టింది ఎన్నడూ పాదం కింద మోపలేదు దానిఖర్మ నా ఖర్మ " నుదురు కొట్టుకున్నాడు అతడు మరేమీ మాట్లాడకపోవడం చూచి సరోజని మెల్లగా అంది. "మనం ఆశించినా బాధపడినా బిందు సౌఖ్యంకోసమే పోనీ, జరిగిందేదో జరిగి పోయింది మనం ఇచ్చే దేదో ఇచ్చి చూస్తూంటే బిందు ఎక్కడైనా సౌఖ్యంగా వుంటుంది మామగారూ

వీల్లేదు ' ఆ కంఠంలో అంతవరకూ ఉన్న బాధా సౌమ్యతా లేమయ్యాయోమరి, ఒక్క గావుకేక పెట్టాడు రానియ్యి దాని కలాగే బాగా బుద్ధి రానియ్యి అప్పుడు కాని తనతప్పు తెలిసిరాదు ఆ రోజున — తెల్సుకుని వచ్చిననాడు నేనుమాత్రం నిరాదరిస్తానా ? నెత్తిన వుంచుకు పూజించుకుంటాను నా తల్లిని

నివ్వెరపాటుతో చూడసాగింది సరోజని

"సరే, వెళ్ళమ్మా ఒక్కసారి అబ్బాయిని కన్పించమన్నా నని చెప్పు '

సరోజని చెప్పిన విషయాలు విని ఆశ్చర్యపోయాడు కేశవ్ కొంతధైర్యమూ కలిగింది ఊరికే ఆందోళన పడ్డానే ఎంతైనా ఆయన తండ్రికాదా మేము బిడ్డలం కామా ? అనుకుంటూ వెళ్ళి ధైర్యంగా నిల్చున్నాడు, "ఏం నాన్నా ?" అంటూ,

"మధ్యాహ్నం ఎవడి నడిగి పోయావ్ "

ఆ ఉరుము విని నిజంగా ఉలిక్కిపడ్డాడు కేశవరావు అగ్నికణాలలా వున్న ఆ నేత్రాలను చూడలేక కలవరంతో తలవాల్చుకు నిల్చున్నాడు

"ఏమన్న దా మూర్ఖురాలు ?" అదే తీవ్రతరమైన కంఠస్వరం

"ఎవరండి ?" మెల్లగా ప్రశ్నించాడు

"అదే నీ చెల్లెలు !"

"మీకు నమస్కారాలు చెప్పమంది భార్యాభర్త లిద్దరికీకూడ మీపై గౌరవమే.



"మళ్ళీ ఎప్పుడు కలుస్తావోయ్ ?
"ఏ ఫ్రెండు దొరకనప్పుడు "

---

మీ ముద్దు చెల్లింపక తామే అపరాధు లయ్యా మనీ, ఎప్పటికైనా తిరిగి కలుస్తా మనీ ఆశతో ఉన్నా మనీ అన్నారు "

విజయగర్వంతో చూచాడు అనంతయ్య "అవును అన కేం జేస్తారు ? అప్పుడే అయితే సగం బుద్ధి వచ్చిం దన్నమాట ; ఇంకా బాగా రావాలి ''

కేశవ్ మాట్లాడలేదు

' ఇంతకూ నువ్వు డబ్బెంత తీశావ్ ? '

"పదిహేనువందలు "

' ఎవరి అనుమతితో ?"

" "

''నా మాటకు సమాధానం ?''

"తర్వాత తర్వాత మెల్లగా చెప్పవచ్చు – మీరే ఒప్పుకుంటా రనుకున్నాను, ఆ మాత్రం స్వతంత్ర ముందనుకున్నాను ''

"అలాగా ? ఏంజేశా వాడబ్బు ?''

ఒకలిప్తపాటు తటపటాయిస్తూ వుండిపోయాడు ''ఇదివర కొకసారి వెళ్లాను, బిందును చూడటానికి '

"ఇదివరలో ఒకసారి వెళ్ళావా ?"

"అవును అతిసాధారణ దుస్తులు ధరించి అదొకమాదిరిగా వుంది చూడలేక పోయాను

"అందుకని ?"

"ఆ డబ్బుతో మంచిదుస్తులూ పూలూ, పళ్ళూ కొని తీసుకువెళ్ళాను మీ కోడలు తన నగలను కొన్నిటిని ఇచ్చింది "

"ఏమి టలా చేయడంలో అర్థం ?

"మనం ఘనంగా ఇవ్వవలసిన కట్నకానుకలూ, అరణాలూ లేనేలేవుకదా చేతనైనంతలో నేనైనా అమ్మాయికి సౌకర్యాలు కలుగజేద్దా మని "

"ఊఁ అయితే నేనే అంత కరినుడినీ నువ్వుమాత్రం ప్రేమకలవాడవూనా ?"

" . "

"నువ్వు చేసినపని నా కెంత చిన్నతనమో ఆలోచించావా ?'

" "

"తండ్రి చచ్చిపోయా డనుకున్నావా ? చచ్చిపోవా లనుకున్నావా ?"

"నాన్నా !"

"ఎందుకు నీకు నా మీద గౌరవం పోయింది ? ఇదివరలో ఎప్పుడైనా ఏమైనా నాకు తెలియకుండా చేశావా ?"

'తెలిస్తే ఇవ్వనివ్వ రనే భయం తప్ప గౌరవం లెకకాదు నాన్నగారూ "

"అయితే గౌరవమింకా వుందంటావు ? నిల్పుతావా ?"

"ప్రమాణ పూర్తిగా '

"అయితే చెయ్యి ప్రమాణం ఇం కెప్పు డా గడప త్రొక్క నని ఏ పరిస్థితుల లోనూ వెళ్ళ నని '

" "

"చెయ్యవా ? మరెప్పుడైనా ఇటువంటి పని జరిగితే ఇక నేను తండ్రినీ కాను, నువ్వు కొడుకువూకాదు నే నాశించిన మార్పు దానిలో రావాలి అంతవరకూ రాక పోకలు జరుగరాదు ఇయ్యి మాట "

భారంగా నిశ్వసిస్తూ అన్నాడు కేశవ్ "ఇస్తున్నాను ఎన్నడూ మీమాట జవ దాటను "

కొద్దిక్షణాలు బరువుగా దొర్లిపోయాయి

ఆ నిశ్శబ్దాన్ని అనంతయ్యే భంగపరిచాడు "సరే రెండవసంగతి ఆ నాలుగు వేలూ ఏం చేశావు ?"

దిగ్భ్రమ పొందిన కేశవ్ హీనస్వరాన అడిగాడు "ఏ నాలుగు వేలు ?"

"బిందు వివాహానికి ముందు ఆఫీసు ఇనప్పెట్టెలోంచి మాయమైనవి ! పెళ్ళి ఖర్చులకోసం, ముందు జాగ్రత్తకోసం ఆ పాణి కిచ్చావుకదూ ?''

"ఏమిటి నాన్నా ? ఏ ప్రమాణం చేయమంటే అదే చేస్తాను భగవత్సాక్షిగా ఆ డబ్బువిషయం నే నెరుగను "

గుంభనంగా నవ్వాడు అనంతయ్య ''అది ఆరా రాలేదుకనుక తెలియదు ఇప్పుడు వెంటనే ఆరా వచ్చింది గనుక తెల్సింది అంతేనా ?''

"నాన్నా !" పౌరుషంగా తలెత్తాడు కేశవరావు ''అంతగా అవసరమైతే పుత్రుడి హోదాతోనే తీసుకోగలను మీకు జ్యేష్ఠకుమారుడినీ, ఉత్తరాధికారినీ, వ్యాపార మంతా చేతిలోవున్నవాడినీ – చాటుబ్రతుకూ, దొంగతనమూ ఖర్మం నా కేల ?" సరే, ఇంతవరకూ ఎలాగూ వచ్చిందిగనుక ఆ దొంగ ఎవరో మీకు పట్టిఇస్తాను ఇంతకాలం అది మన వ్యాపారానికీ, మన కుటుంబానికీ కూడ తగదని భావించి ఉపేక్షజేశాను కాని అది తగదని ఇవ్వాళ మీరు స్పష్టంగా చెప్పారన్నమాట ఇది మరచిపోను" అంటూనే అక్కడినుండి అతివేగంగా వెళ్ళిపోయాడు

## *51*

కేశవరావూ, సరోజినీ వెళ్ళిపోయాక వా రిచ్చిన సూట్ కేస్ తెరచిచూచింది మాధవి మిగిలిన కుటుంబ మంతాకూడ అక్కడే వున్నారు రెండు చక్కటి ట్వీడ్ సూటింగ్ క్లాత్ లు రెండుమూడు వందలు ఖరీదుచేసే పెద్ద పట్టుచీరలు రెండూ, సాదా వాడకానికి మామూలు సిల్కుచీరలు ఒక డజనూ అందుకు తగిన జాకెట్లూ వున్నయి

"ఆ భరిణ ఏమిటి ?" అంటూ పెట్టెలో ఒక మూలగా వున్న భరిణను తీసి జానకమ్మ తానే స్వయంగా స్వతంత్రంగా తెరచిచూచింది 'ఒక నెక్లెస్, రెండుపేటల గొలుసు ఒకటీ, నాలుగుజతల గాజులూ, ఉంగరం, చెవులకమ్మలు, జడగంటలు !'

అవన్నీ చూచిన మాధవిలో ఏ మార్పూలేదు పాణీ రఘులు కొంచం ఆశ్చర్యం ప్రకటించారు

అందరికంటె ఎక్కువగా సంతోషించినది జానకమ్మ "పెద్దవాళ్ళకు తెలియక పోయినా చిన్నవాడు తెల్సుకున్నాడు బాధ్యతలు అవును, ఎవరో ఒకరు మంచి చెడ్డలు కనుక్కోకుంటే ఎవరిపిల్లను వాళ్ళు పూర్తిగా వదలుకుంటా రేమిటి?" అంటూ "ఏదమ్మా బిందూ, ఒక్కసారి ఆ నగలన్నీ పెట్టుకుని ఆ ఆకుపచ్చరంగు పట్టుచీర కట్టుకో చూడాలనుంది లక్ష్మీదేవిలా వుంటే," అంది

"ఆఁ. ఎందుకులెద్దుమా ఇప్పుడు ?' అంటూ "పద్మా, ఇందిరా రండి ఇందులో మీ క్కావలసినవి తీసుకోండి" అంది మాధవి "సూటింగ్ క్లాత్‌లు రెండూ పాణీ రఘుల దగ్గర వుంచి 'మీవి మీరు తీసుకోండి'' అంది ఆ మాటలకు జానకమ్మ ముఖం మరింత విప్పారింది

పద్మ ఎగబడబోతుండగా చటుక్కున ఇందిర అంది మా కెందుకు వదినా మొన్న అన్నయ్య తెచ్చినవి ఉన్నాయిగా ? నువ్వు ఉంచుకో "

"అవును వాళ్ళ కెందుకు ? నువ్వు అమ్మచెప్పినట్లు ఆ నగలు పెట్టుకుని కాస్త ఒక్కసారి ముస్తాబవ్వు వదినా లక్ష్మీదేవిలా వుంటే చూడాలనుంది ఆ పెళ్ళిలో ఒక్కసారి చూచా నంతే ఆ వేషంతో మళ్ళీ చూడాలనుంది అన్నాడు రఘు

అప్పటికీ మాధవి కదలలేదు "తీసుకోండి పద్మా ఉన్నవన్నీ ఒక్కళ్ళే తీసు కుంటారా ఎక్కడైనా ?' అంది

'సరే, ఒక్కొక్కటి తీసుకొంటాం మరి మాట్లాడకు' అంటూ ఇందిర తానే రెండుచీరలూ జాకెట్లూ వేరే తీసింది తనకూ పద్మకూ మిగిలినవి పెట్టెలో వుంచి మూతవేసి మాధవిగదిలో పెట్టేసివచ్చింది ఇందిర

జానకమ్మ లేచి మాధవిదగ్గరకు వచ్చి ఆమె వారిస్తున్నా వినకుండా ఆ నగలన్నీ స్వయంగా అలంకరించింది జడవేసి చివర గంటలు వేసింది కేశవరావు తెచ్చిన పూలదండలు తానే తీసి మాధవికీ కూతుళ్ళకూ తలలో అందంగా అమర్చింది "వెళ్ళి ఆ చీరకూడా కట్టుకురా" అంది మాధవిని

''పోనీ మీరూ కట్టుకోండి అమ్మాయ్, వదినకూడా అప్పుడు కట్టుకొంటుంది" అన్నాడు చక్రపాణి

ఇక తప్పలేదు ముగ్గురూ గదిలోకి పోయి ఆ నూతన వస్త్రాలు అలంకరించు కున్నారు ఇందిరా పద్మకూడ తమ కున్న కొద్దిపాటినగలు పెట్టెలోంచి తీసి అలంక రించుకున్నారు

అప్సరసలలా వెలుపలికివచ్చిన ఆ ముగ్గుర్నీ చూచి ప్రేక్షకులు ముగ్గురుకూడ ఆనందభరితు లైపోయారు

"నా తల్లులు ముగ్గురూ మూడు స్వర్ణప్రతిమలుకదూ , ఎవరు సాటి?'' అని ఆనం దాతిరేకంతో ఆ ముగ్గుర్నీ ఒక్కసారే చుట్టేసి వారి సిరస్సులను ప్రేమతో మూర్కొన్నతల్లిని తిలకించి చక్రపాణీ రఘూ ఒకరిముఖా లొకరు చూచు కున్నారు

పైకి అనలేదుకాని ఇద్దరూ లోలోపల ఒక్కలాగే అనుకున్నారు 'పెద్దవాళ్ళకు



"డాక్టరుగారూ నిన్నటినించీ నాకు కడుపులో నెప్పికూడా ఎక్కువైందండీ "
'మీరు మీ డాక్టరుగారిదగ్గరనే కడుపుతోబాటు నేత్రపరీక్షకూడ చేయించుకోండి నేను అడ్వొకేట్ ని "

---

కావలసినది వ్యక్తీ వ్యక్తి విలువా కాదు ఆ వెనుక నున్న కట్నకానుకలూ, ఆస్తి పాస్తులూ పెట్టుపోతలే వారికి ప్రధానం ?'

అత్తగారి ప్రవర్తనలో పరివర్తన గమనించిన మాధవికూడా సరిగా అలాగే అనుకుంది 'కేవలం ధనమూలప్రపంచం !'

## 52

సాయంత్రం సమయంలో రఘూ చక్రపాణీ ఎక్కడికో వ్యాహ్యాళిగా పోబో తూండగా శ్రీహరీ వెంకటేశమూ కరుణాకరమూ, రుక్మిణీ వచ్చారు చక్రపాణి వారిని సాదరంగా ఆహ్వానించి రఘుకు పరిచయం చేసి కూర్చోబెట్టాడు

"కూర్చోరేమండీ మాష్టారూ మీకు ముందుగా తెలియపరచనందుకు క్షమించాలి ఇది మీకు మేము నలుగురమూ సంయుక్తంగా సమర్పించుకొనే పెండ్లికానుక,'' అంటూ అందమైన అయిల్ పెయింటింగ్ చిత్రపటం బహూకరించారు కృతజ్ఞతతో అందుకున్నాడు చక్రపాణి 'మనస్సుంటే చాలదటయ్యా ? ఇంత శ్రమ పడాలా ?'' అన్నాడు చిరునవ్వుతో ఆ పటాన్ని పరీక్షగా చూస్తూ –

బోధివృక్షపు నీడను శాంతమూర్తి బుద్ధుడు అతనిముందు మోకరిల్లిన 'సుజాత', ఇరు పార్శ్వాలా భక్తిశ్రద్ధలతో కొలుస్తూన్న అంగుళీమాలుడు, బింబిసార చక్రవర్తి ! అడుగున అందంగా వ్రాయించబడిన అక్షరాలు –

'బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ఒకమూల మిత్రులు నలుగురి పేర్లూ వ్రాయబడ్డాయి
నవ్వాడు చక్రపాణి "ఎందు కిచ్చా రిది నాకు ?"

మిత్రులు కొంచెం సిగ్గుపడ్తూ చెప్పారు, "లోకం హృదయంలో ఆ తథాగతు డెలా చిరంజీవి అయ్యాడో మా హృదయంలో మీరూ అలాగే నాటుకుపోయారు అనేకుల లోని మాలిన్యాల్ని ఆ బుద్ధభగవానుడు కడిగివేసినట్లే మీరూ మాలోని చెడుగుణాలు ఏరిపారేశారు అందుకే మీ కీ బహూకృతి "

"మీ కున్న అభిమానం అటువంటదయ్యా, నా దేముంది ?' అన్నాడు చక్రపాణి

రఘు హాస్యంగా అన్నాడు "మీరు మిత్రులంతా చాలా గొప్పవాళ్లే ఇన్నాళ్లూ ఈ ధర్మమూర్తి కెటువంటి పేరు పెట్టాలో తెలియక ఆలోచిస్తున్నాను నేను. మీరు తగిన పేరే సెలెక్టు చేశారు "

"నిజం ఆ పేరే తగుతుంది ఈ బుద్ధమూర్తిగారికి' అంటూ మాధవీ రుక్మిణీ కలసి హాస్యం చేశారు చక్రపాణిని

"కానివ్వండి మిత్రు లంతా ఒక టయ్యారు తమ్ముడు కూడా మీలోనే జేరాడు ఒంటిగాడిని ఏమన్నా పడాలి" అన్నాడు పాణి నవ్వుతూ

కొద్దినిముషాలు సరస సల్లాపాలు జరిగాయి తర్వాత మెల్లగా వెంకటేశం చెప్పాడు "మేష్టారూ మీకు మా యింట్లో చిన్నపార్టీ ఏర్పాటు చేశాం పార్టీ అంటే మరెవరూ వుండరు మేము ముగ్గురం మీ దంపతులూ, రుక్మిణీ, రఘునాథ రావుగారూ అంతే దయుంచి మా అభ్యర్థన కాదనకండి '

చక్రపాణి మాధవి వైపు చూచాడు

గ్రహించిన వెంకటేశం అన్నాడు "అంగీకరించండి మాధవిగారూ ఇది ఒక్క మీ వివాహ సందర్భంలోనే కాదు, శ్రీహరీ కరుణాకరం వెళ్ళిపోతున్నారు అందుకు '

'ఏం ?' ఆశ్చర్యంగా ప్రశ్నించాడు చక్రపాణి

"కరుణాకరం తండ్రిగారికి తిరుపతి ట్రాన్స్ఫరైంది అంచేత అతడు కూడా అక్కడ సీటు సంపాదించాడు శ్రీహరి తండ్రిగారికి జబ్బుచేసింది ఆయనను వైజాగ్ హాస్పిటల్‌కు తీసుకువెళ్తున్నారు అందుచేత ఇతడు తాత్కాలికంగా చదువు నిలుపు జేసి వెళ్ళిపోతున్నాడు "

"అయ్యో నా కిక్కడ మంచి విద్యార్థులైనా, మిత్రులైనా మీరే కదా ? విడిపోతున్నాం'' అంటూ విచారం వెలిబుచ్చాడు చాక్రపాణి

"ఎక్కడున్నా ఇక మన మనసులలో ఈ స్నేహం ఇలా నిత్యనూతనంగా నిలచిపోతుంది కదండీ" అన్నాడు కరుణాకరం

మరి ఆలస్యం చేయకుండా అందరూ పార్టీకి వెళ్లారు

విందు అనంతరం శ్రీహరినీ కరుణాకరాన్నీ రైలుకు సాగనంపి తిరిగి వచ్చేసరికి హృదయ మేదో భారంగా తయారైంది మాధవికీ చక్రపాణికీ కూడా పాణికీ ఆ విద్యార్థులకూ గల అనుబంధ చరిత్ర అంతా తెలిసిన రఘునాధ్ కూడ కొంచెం బాధ పడ్డాడు ఆ అనిర్వచనీయ బాధాత ప్త హృదయాలు మరింత బాధపడవలసి వచ్చింది ఇల్లు ప్రవేశించగానే

హాలులో జానకమ్మ శ్యాంసుందర్ కూర్చుని అత్యంత ఆత్మీయంగా సంభాషించుకుంటున్నారు ఆతడి మాటలకు పద్మ విరగబడి నవ్వుతూంది

మనస్సులో ఇష్టం లేకపోయినా పైకి ప్రకాశంగా పలుకరించాడు చక్రపాణి శ్యాంసుందర్ని ప్రక్కనే వున్న రఘుకు పరిచయం చేయబోతూండగా కొద్ది వెనుకగా వున్న మాధవి త్వరత్వరగా ముందుకు వచ్చింది

"ఎందు కొచ్చావ్ ?'' అని తీవ్రంగా ప్రశ్నించింది

శ్యాంసుందర్ నివ్వెరపోయాడు

'మాధవీ ?" అంటూ భర్తా అత్తగారూ వారించబోయినా విన్పించుకోలేదు మాధవి "ముందు బయటకు నడు" అంది శ్యాంసుందర్ని తీవ్రంగా

"నా మీ దెందుకు కోపం బిందూ? మీవాళ్ళంతా నిన్ను వదలుకున్నా నేను ఎంతో ప్రేమతో చూడవచ్చానే !"

శాంతంగానే ఆయినా కఠినంగా చెప్పింది మాధవి "నీవంటి విషపురాశివి నమ్మే తెలివితక్కువ మాధవినికాను అక్కడా ఇక్కడా తంపులుపెట్టి బ్రతుకుతున్నావు! నువ్వుచేసిన ఘాతుకాలు మాకు తెలియవే దనుకున్నావా ? గెటవుట్ "

శ్యాం కోపం అణచుకొంటూ జానికమ్మవైపు చూచాడు ఆమె కోడల్ని ఏదో మందలిస్తూంది కాని లాభంలేకపోయింది పాణి రఘుల దెస చూచాడు వారు మరో దిక్కుగా చూస్తున్నారు, తమ కేమీ పట్టనట్టు గ్రహించాడు శ్యాం, ఇక తన టక్కరి జిత్తులు లాభించ వని

"ఏం బిందూ ? అంత తెగించావ్ ? నే నెవరో్న తెల్సుకదూ ?"

"ఆహా, తెలియకేం ? నీచపుపనులు చేస్తూ చెప్పుదెబ్బలు తినే హీనుడవు "

"బిందూ !" ఈ సారి తన అసలు వ్యక్తిత్వం ప్రదర్శించాడు శ్యాం "నేను కక్ష కట్టా నంటే నువ్వూ నీ సంసారం ఎందుకూ పనికిరాదు జాగ్రత్త "

ఈ సారి రఘు ఇక కోపం పట్టలేకపోయాడు "యూ స్కౌండ్రల్ మా ఎదుటే మా వదినను బెదిరిస్తావా ? గెటౌట్ అంటూ ఒళ్ళుతెలియని కోపంతో శ్యాంను ఒక్క లెంపకాయ కొట్టాడు ఆ కోపంతో ఇంకా విజృంభించేవాడే కాని అంతలో చక్రపాణి అడ్డుకున్నాడు తమ్ముడిని

"మిష్టర్ శ్యాం మర్యాదగా వెళ్ళు మళ్ళీ ఈ గడప త్రొక్కకు' అన్నాడుపాణి

కళ్ళు తిరిగిపోయాయి శ్యాంకు సరే ఇందుకు తగిన ప్రతీకారం చేస్తాను గుర్తుంచుకోండి అంటూ పొగలు సెగలు గ్రక్కుతూ వెళ్ళిపోయాడు

ఆ తర్వాత ఇక జానకమ్మ సణుగుడుకు అంతులేకపోయింది "అయినవాళ్ళంతా ఒదులుకోగా వచ్చిన ఒక్కమనిషినీ అందునా పెద్దమనిషిని అలా అవమానిస్తావా? నా యింటి కొచ్చినవాడిని నాతో మాట్లాడ్తూన్నవాడిని పొమ్మనడానికి నువ్వెవరివి ? అప్పుడే ఇల్లంతా, పెత్తన మంతా నీ దన్నట్టు మాట్లాడ్తున్నావే !'

"అంతంత పెద్దమాటలు ఉపయోగించకండి వాడి అసలుగుణం మీకుతెలియదు వట్టి నీచుడు అన్ని విషయాలోకూడా అప్పుడు మీ అబ్బాయిగార్ని కొట్టించింది అతడే మీకుతెలియదుమరి ! ఆ బాధ నా గుండెలలో పట్టివుంది మనుష్యులను బాధించడం విడదీయడమే చేతనౌను వాడికి అటువంటివాడిని జేరదీయకూడదు '

దానితో జానకమ్మ సంభాణ క్రొత్తవిధంగా మళ్ళింది 'అవును నువ్వు మా వాడిని ఏ క్షణంలో పట్టుకున్నావో అప్పుడే వాడికి కష్టాలు ప్రారంభ మయ్యాయి '

''అమ్మా !'' రఘు గంభీరంగా అదిలించాడు తల్లిని

ఆవిడ దూకుడు కొంచం తగ్గిందికాని, వాగుడు తగ్గలేదు "అవును నే నేమన్నా ననీ ? ఉన్నమాటే అయినా దాని ఉపాయం నాకు తెల్సు దాని పుట్టింటి గొడవ లన్నీ మనకు చెప్పిపోతున్నాడనీ, మొన్న చీరలూ నగలూ యిచ్చినందుకు నీ అన్ననీ వదిననీ నీతండ్రి చంపినంతపని చేశాడట మరి నీముఖం చూడరా దని ఒట్టు వేయించుకున్నాడట నీ చిన్నన్న వూరినించి వచ్చారట వాడినికూడా ఇటు రాకుండా కట్టుదిట్టం చేశాడట చేతనైతే వాళ్ళమీద చూపించు ప్రతాపం, వీడిమీ దెందుకు ?''

మరి వినలేక గదిలోకి నడిచింది మాధవి. ''వాడు మిమ్మల్ని కొట్టించాడు అనే సంగతి నే నే క్షణంలోనూ మరచిపోలేను అందుకే చూడగానే అంత అవేశపడ్డాను కాని అది అత్తగారికి కోపకారణ మౌతుందని అనుకోలేదు ' అంది భర్తతో



'అతన్ని చుడ్డానికి సిద్ధంగా ఉన్నానని రమ్మని చెప్పు ''

' ఆవిడధోరణి కేంలేద్దూ నీకు నామీద అంత ప్రేమ ని నేను ఎంత మురిసి పోతున్నానో వర్ణించలేను మరి । ' అన్నాడు ప్రేమగా చక్రపాణి

ఈ రెండు మూడు రోజులనుండీ మాధవిపై జానకమ్మ ఒలకబోస్తూన్న కృత్రిమ ప్రేమానురాగా లన్నీ ఎగిరిపోయి మళ్ళీ మామూలుపరిస్థితి తయారైంది

మరో నాల్గురోజు లుండి రఘు వెళ్ళిపోయాడు

"నువ్వు ధైర్యంగా వుండాలి వదినా ఈ ముసలాళ్ళ మాట లవీ లెఖ్ఖజేసుకోకు మరీ అంత ముఖ్యవిషయ మేమైనా వుంటే నాకు వ్రాయి, సందేహించకు "అన్నాడు

అలాగే, కావి మీరు మీ అన్నగారి ఉద్యోగం అక్కడ యూనివర్సిటీకి ట్రాన్స్ఫర్ చేయించడానికి ప్రయత్నించండి ఈ ఊళ్ళో వుండడం చాలా సిగ్గు చేటుగా వుంటూంది అన్నయ్యల్ని కూడా రానివ్వకుండా చేసేశారు నాన్నగారు అదీగాక దుష్టుడు శ్యాం ఒకడు ముఖ్యంగా పద్మను కాస్త దారిలో పెట్టాలంటే మీరే వుండాలి" అంది మాధవి

నిజమే, తప్పకుండా ప్రయత్నిస్తాను వెళ్ళిన దగ్గర్నుంచీ అ ప ని మీ దే వుంటాను మీకు ఉత్తరం వ్రాస్తాను తర్వాత," అంటూ తల్లికి కూడ కొంత హితబోధ చేసి వెళ్ళాడు రఘు "వదినని మరీ బాధపెట్టకమ్మా, ఒక కుటుంబం వాళ్ళం — మనలో మనం సామరస్యంతో వుండాలిగాని ఇరుగూపొరుగూ, ఊరూవాడా కాదు మనకుముఖ్యం" అని

"పద్మా, పదినమాట కెదురాడకు, గుమ్మం కదిలినట్టు తెలిసిందా ఊరుకోను "

"అన్నయ్యా, నువ్వు మరీ అంత ధర్మరాజులా కాక కాస్త ఇది భూతల మని గుర్తుంచుకుని మెలగు "

"ఇందిరా, బాగా చదువుకోమ్మా నీకు పెద్దచదువులు చెప్పిస్తాం "

అందర్నీ హెచ్చరించి, సలహా లిచ్చి వీడ్కోలు తీసుకున్నాడు రఘునాథ్

## 53

చైత్రం గడచి వైశాఖం ప్రవేశించింది దినకరుడు ద్విసహస్ర నేత్రాలను తెరచి చూస్తున్నట్టుగా ఎఱ్ఱని ఎండలు నిప్పులు చెరగి పోస్తున్నాయి కోకిలల కుహూ కుహూ నాదాలు మనసును రంజింప జేస్తుంటే మరొకవంక మధుమాసపు ఎండలు శరీరాన్ని తపింపజేస్తున్నాయి మామిడిచెట్లు నవమధువులలా చూడ ముచ్చటగా వున్నాయి

మధుమాసపు తీక్ష్ణతలోనే గ్రీష్మాతపం దోబూచులాడుతూంది

అనంతయ్య కొంచం పెద్ద వయస్సు కావటం వలన వేసవి తాపానికి తట్టుకో లేకుండా వున్నాడు అదీకాక ఏమిటో ఈ మధ్య అతడికి ఏ పని చేసినా త్వరగా అలసట వచ్చేస్తూంది అందువల్ల అధికభాగం ఇంటివద్దనే గడపివేస్తున్నాడు వ్యాపార మంతా కేశవరావే చూచుకుంటున్నాడు ప్రతి ఏటా శ్రీరామనవమి వేడుకలు భారీఎత్తునచేసే అనంతయ్య ఆ ఏడు ఎందు కలా మౌనం దాల్చాడో ఎవరికీ తెలియకుండా వుంది

ఆనాడు కృష్ణఏకాదశి

కేశవరావు సౌధోపరిభాగంలో పయనించివున్నాడు చల్లగాలి కోసం జగ మంతా తిమిరాంధకారంలో వుంది

ఏదో ఆలోచనలలో ఉన్న అతడికి తండ్రి దగ్గరనుంచి పిలుపు వచ్చింది త్వరత్వరగా లేచి క్రింది గదిలో నున్న అనంతయ్య దగ్గరకు వెళ్ళాడు

"ఏమిటి మధ్యాహ్నం నువ్వు ఆఫీసునుంచి నాకు పంపించిన కవరు ?" అనడిగాడు అనంతయ్య

"మీరు విప్పి చూడలేదా మరి ?"

"చూచాను వ్రేలిముద్రలు "

"ఆఫీసు ఇనుపపెట్టె పైనా లోపల తలుపుల మీదా ఉన్న క్రొత్తవ్రేలి ముద్ర లవి "

అర్థంగానట్టు చూస్తున్న అనంతయ్యకు కేశవరావు మరింత వివరంగా చెప్పాడు

''ఆ పెట్టెమీద ఎప్పుడూ వుండేవి మన ఇద్దరి వ్రేలిముద్రలే, మనమే వాడుతాం గనుక మ రెవరూ ఎన్నడూ తాకలేదు, అవసరం లేదుకూడ మరి అటువంటప్పుడు మన ఇద్దరి వ్రేలుముద్రలు మినహా మ రెవరివీ దానిపై కన్పించరాదు,''అంటూ ఒక్క-లి పాటు ఆగాడు మరుక్షణలోనే మహారహస్యం చెప్పేశాడు "కాని వున్నాయి "

''ఎవరివి ?''

''స్వపరభేదం లేకుండా మన ఇంట్లోనూ ఆఫీసులోనూ పనిచేసే అందరితోబాటు మన ఇంట్లో అందరి వ్రేలిముద్రలూ పరీక్షకు పంపించాను నిపుణుడిదగ్గఱకు కడకు మాధవీ చక్రపాణు లిరువురివీ కూడ పంపాను ''

''ఎవరి వవి ?'' ఏ మాత్రం ఆలస్యం భరించలేకుండా వున్నాడు అనంతయ్య

''శ్యాం సుందర్ వి "

"ఆ( !'

"అవును నా కీ అనుమానం ఇదివరకే వుంది కాని అలక్ష్యంగా వదిలేశాను, అతడు ఉపయోగించే వస్తువులమీద – అంటే సిగరెట్ కేస్ పౌడరుడబ్బా మొదలైనవాటిమీద వున్న ముద్రలూ అవీ సరిపోయాయి '

"ఆ( !"

' అవును ఓర్పుగా ఆరా తీస్తే బహుశః అత డా పని చేస్తూండగా చూచినవాళ్లు లేదా చేయటానికి సాయపడినవాళ్ళు కూడ పట్టబడవచ్చు కాని అంత రట్టు చేసుకోవడం మంచిదికాదేమో నని ఊరుకున్నాను – మీరు ఆరా తీయమంటే తీస్తాను "

"ఇంకా ఎందుకు, ఆధారం దొరికాక ?"

" "

"మరి వాడిని దయచేయమని చెప్పక ఎందుకు ఇంకా యింట్లో ?"

కేశవరావు మాట్లాడలేదు

' మరెన్నడు ఈ గడప త్రొక్క-వద్దనిచెప్పు నీచుడు పైగా అందరిమీదా అయినవీ కానివీ చాడీలు చెప్పటం వెంటనే దయచేయమను "

"ఆపని మీరు చేస్తేనే బాగుంటుంది '

"ఎంచేత ?'' కోపం వచ్చింది అనంతయ్యకు

"పూర్వం అయితే మీకంటె నామాటకూ నాకే జడిసేవారు అందరూను కాని మీ రిప్పుడా విలువను పోగొట్టేశారు అంచేత ఆపని మీరే కానివ్వండి నేను కేవలం నిర్దోషి నని నిరూపించుకోవడానికే ఈ మాత్రమైనా చేయవలసివచ్చింది'' అంటూనే వెళ్ళిపోయాడు కేశవ్

"సరే భయమా ? నేనే చెప్తాను " కోపంగా లేచాడు అనంతయ్య

శ్యాం గదిలో చూస్తే అత డక్కడ లేడు ఆదిలక్ష్మి గదిలో అక్కా తమ్ము ళ్ళిద్దరూ ఏదో మంత్రాంగం చేస్తున్నారు

'అక్కయ్యా నా కెంత అవమానంజరిగిం దనుకున్నావ్ ? నన్ను వాడు లెంప పెట్టు పెడతాడా తీర్చుకుంటానులే ఈ కక్ష '

' ఏం తీర్చుకుంటే ఏం ప్రయోజనం ? అయినా ఇప్పుడు అల్లుడాయె ఇష్ట మున్నా లేకున్నా నావ్వేసింది ఆదిలక్ష్మి

"ఇదివరకటిలా కొట్టించినా చేసినా ఒకవేళ ఛస్తే నా కూతురి పసుపుకుంకా లుండవంటావ్ ? సరేలే అటువంటి పనులు చేయను చూమకో తర్వాత నీకే తెలుస్తుంది మంచి పథకం ఆలోచించి వుంచాను "

' ఏమో దురుసుస్వభావం ప్రాణహానిమాత్రం తేకుసుమా ఎవరికీ ముఖ్యంగా మన పిల్లా అల్లుడూను మనమాట విననందుకు అనుభవించవలసినదేకాని అలా గని బొత్తిగా ఉసురు పెట్టలేం కదా ? అయినా పాపం దాని తప్పేముందిలే బిందు పసిపిల్ల అంతా ఆ తండ్రీకొడుకులూ ఆ పంతులూ పన్నిన పన్నాగం

'అందుకేగా అనుభవిస్తున్నారు బాగా మోతీ చచ్చింది పంచకళ్యాణి చచ్చింది అవైతే బెంగతో చచ్చా యనుకో కాని మిగిలిన రెండుపనులూ నేను చేసినవి మధు వనం ఎండబెట్టించేశాను బావకు వెఱ్ఱివెత్తించి పెళ్ళి మర్నాడే అంత అందమైన పెళ్ళి పందిళ్ళకీ నిప్పంటించాను ! భగభగా కాలిపోయాయి నా గుండె భగభగలు చల్లారాయి ''

ఆదిలక్ష్మి దిగ్భ్రాంతురాలైంది దుర్మార్గుడా పందిళ్ళకు నిప్పంటించింది నువ్వా ? నీకు చేతు లెలా వచ్చాయి ? దానితోపాటు ఈ మేడకూడ అంటుకుపోతే ఏంచేద్దుం ? '

"ఉష్ నెమ్మది నే నంత ఆలోచన లేనివాడినా ? ఇల్లంటుకో నిస్తానా ? అటు వంటి నిదర్శనాలు చూపకపోతే బావగారికి నమ్మకం కలిగించడం ఎట్లా ? ఇదంతా బిందు వెళ్ళిపోయిన మూలాన ఈ అరిష్టాలు జరుగుతున్నాయనే నమ్మకం ఆయనలో నాటుకుపోవాలి, అందుకు కారణమైన ఆ పాణిగాడిమీద ఆయనకు కోపం రావాలి, అప్పుడు నాకళ్ళు చల్లగా వుండాలి వాడిమీద మనకక్ష తీరాలి "

''ఏమోరా శ్యాం నీ పను లేమీ నాకు నచ్చడం లేదు ఏది ఏమైనా ఇక యిప్పుడు వాళ్ళు కూతురూ అల్లుదేకదా ? అలా కక్షపట్టి లాభ మేమిటి ? '

''ఛ ఊరుకో అక్కయ్యా వరి బేలవాళ్ళు, అందుకే ఆడవాళ్ళ కేమీ చెప్ప కూడ దంటారు మీరూ మీ ఆఐశ్వర్యం ఏపా టని ధిక్కరించిపోయినవాడిని ఆమాత్రమైనా ఊదరగొడితే కాని దారిలోకి రాడు దెబ్బకు దెయ్యం వదలినట్టు మరి ఈ బాధలు పడలేక మనమే గతి అని మనయింటి కొచ్చి వాలా్తడు ''

శ్యాం ప్లేటు మార్చడంతో ఆదిలక్ష్మి నమ్మేసింది ' ఓహో ! అలాఅయితే సరే నేను వద్దనలేదు ''

గదితలుపు భళ్ళున తెరుచుకోవడంతో సంభాషణ ఆగిపోయింది

రౌద్రాకారంతో ప్రవేశించిన అనంతయ్యను చూచి నిర్ఘాంతపోయారు

ఒరేయ్ దౌర్భాగ్యుడా నడువు నా యింటినుంచి ''

''బావగారూ!''

''ఛీ, బావ ఇంకా ఆలోచన వుందట్రా నీకు? విన్నాను ఇప్పుడే నీ ఏడుపు లన్నీ మరొక డెవడైనా అయితే అడ్డంగా నరికిపారేద్దును ఇంకా నిన్ను గనకే కాస్త క్షమించాను మర్యాదగా నడు ''

' ఏమండీ ? మన శ్యాం'' సర్ది చెప్పబోయింది ఆదిలక్ష్మి

'ఛీ మూర్ఖురాలా నోర్మూయ్ లేకుంటే నువ్వూ పో వాడితో ''

ఆదిలక్ష్మి వెంటనే నోరు మూసుకుంది కిక్కురుమనకుండా శ్యాం బయటకు నడిచాడు

''ఇంటికి సగంశని వదిలింది'' అనుకుంటూ తన గదిలోకిపోయాడు అనంతయ్య

మేడ పై భాగం నుంచి అంతా గమనిస్తూనే వున్నారు సరోజనీ కేశవరావులు

కుమార్తెను గురించి ఆలోచనలూ బాధా ఇవాళ మరీ అధిక మయ్యాయి అనం తయ్యకు రాత్రంతా నిద్రేపట్టలేదు ఎప్పుడో ఆఖరిజామున బహుళైకాదశీ చంద్రో దయాన్ని చూస్తూ ఆలోచనా భారంతో అలసి నిద్రించాడు పదికళలు తరిగి క్షీణ వర్ణంతో ఉదయించిన ఆ చంద్రుడు విర్జీవంగా నవ్వుకున్నాడు

## 54

రోజు రోజెల్ల ఎండ తీక్షణమై బాధించింది పక్షులు ప్రాణాపాయ భయంతో ఆకులమాటునుండి బయటకే రాలేదు అంభా అనే గొడ్ల అరపులకు ఆపుదలయే లేకపోయినది పచ్చని ఆకులన్నీ ఎండి మాడిపోయాయి చెట్లన్నీ తలలు వాల్చాయి చిన్న కుంట్లలో చెరువులలో బావులలో నీరు ఇంకిపోతున్నది నేల బీటలువారటం ప్రారంభిస్తున్నది

పగలు రెండుజాములు దాటిన తర్వాత ప్రొద్దువాటారి. సూర్యుని ఎండలోని ఎఱుపుదనమైతే తగ్గింది కాని గాలిలో వెచ్చదనం హెచ్చింది. ఆ వేడిగాడ్పుకు జడిసి జనం సాయంత్రమైనా బయటకే రాలేదు.

కనుచీకటి వేళకు కొంత వేడి తగ్గి చల్లబడినట్లే అన్పించింది కాని శరీరాని కెక్కడా సుఖంలేదు."

వీధిలో ఎవరో పిలుస్తున్నట్లు విన్పించి లోపల పనిలో వున్న మాధవి ఇవతలికి వచ్చింది.

సరోజనిగా రిమ్మన్నా రని ఒకమనిషి ఒక ఉత్తరం ఇచ్చి త్వరత్వరగా వెళ్ళి పోయాడు.

"బిందూ,

ఆనాడే కాని మళ్లీ నేనక్కడికి రాలేదని బహూశః నువ్వు బాధపడ్తున్నా వను కుంటాను. కాని ఏం జేయను? మళ్ళీ అక్కడకు వెళ్ళరా దని ఆంక్ష పెట్టారు మామగారు. శ్యాం చెప్పేశాడు ఆయన కసలుసంగతి. అతడి కెలా తెలిసిందో మరి! అలాగని నాన్నగారికి నీమీద కోపమూ లేదు. ఎంతో ప్రేమతో వివరంగా నీ విషయా లన్నీ అడిగి తెలుసుకున్నారు. ఏమిటోమరి ఆయన మనస్సు, తెలియదు!

నాకు బాధనిపించినా ఇక్కడి విషయా లన్నీ తెలియజేయడం అవసర మను కుంటాను. మధువనం పూర్తిగా ఎండిపోయింది. పంచకళ్యాణి రాత్రి చచ్చిపో యింది. నువ్వు వెళ్ళిన దగ్గర్నుంచీ అది తిండే తినలేదు. సరే, మోతీ ఇదివరకే చచ్చిపోయింది కదా? విలపించడమే కాని నీకు కబురంపుదా మంటే మాత్రం ససేమిరా ఒప్పుకోరుకదా! అదేం మనుష్యులో! అత్తగారుకూడ నీ విషయంలో ఇదివరలోఅంత తూష్ణీభావంతో లేరు, కొద్దిగా మార్తున్నట్టున్నారు. అప్పుడప్పుడు నీ ప్రసక్తి తెచ్చి ప్రేమగా మాట్లాడ్తున్నారు. చక్రపాణిగారిపై మాత్రం ఇంకా నిండా కోపంగా వుంది.

సరే, అవన్నీ అటుంచు. వెనుకొకసారి మన ఆఫీసు ఇనప్పెట్టెలో నాల్గువేలు రొక్కం మాయ మైంది, జ్ఞాపకముందా? ఆ తర్వాత నీ పెళ్ళి జరిగిన పంది రంతా కాలిపోయింది, కారణం తెలియలేదు; కాని ఇప్పుడు తెలిసింది. ఆ రెండుపనులూ శ్యాంసుందరే చేశాడని తెలిసి తక్షణం ఇంట్లోనుంచి వెళ్ళగొట్టేశారు. పీడ వదలిం దనుకున్నాం, కాని అధికమైనట్లుంది. ఇవ్వాళ మధ్యాహ్నం మన నూలు నిల్వచేసే గిడ్డంగులు తగులబడిపోయాయి. వాడి పనే అని అనుకుంటున్నాము. సుమారు అరవై డెభై వేల నష్టముంటుందని అంచనా వేస్తున్నారు ఆమాట వినగానే మామ



గారు స్పృహతప్పిపోయారు ఇప్పుడు బాగానే ఉన్నా రనుకో, కాని నా కేమిటో భయంగా వుంది ఎప్పు డే అపకారం తలపెడతాడో ఈ దుష్టుడు తెలియకుండా వుంది చక్రపాణిగారిని కాస్త జాగ్రత్తలో వుండమను నిర్లక్ష్యంగా తీసిపారేయ వద్దు నామాట వాడు మనందరిపై త్రాచుపాములా పగబట్టాడు బహు జాగ్రత్తలో వుండాలి మరొక విషాదవార్త మీ చిన్నన్నయ్యకు కుదిరిన వధువు హఠాత్తుగా మశూచి వచ్చి చనిపోయిందట ఈ విషాద పరంపర అంతా ఏమిటో, హఠాత్తుగ దైవం మనపట్ల ఇంత నిర్దయ ఎందుకు పూనాడో తెలియడం లేదు

ఈ పరిస్థితులలో మీ రొకసారి వచ్చి పరామర్శించి వెళ్ళడం సబబు— అది మీ భాధ్యత వారు రానిస్తారో లేదో అన్నది తర్వాత సంగతి "

నీ వదిన, సరూ

కళ్ళు తిరిగిపోయాయి మాధవికి దుఃఖం పెల్లుబికింది

'ఇందుకే కాబోలు నాన్నగా రంత బాధపడ్డారు నన్ను పంపించడానికి ఆయన అన్నట్టే అనేక అనర్థాలు వాటిల్లుతున్నాయి ఛీ, ఎంత తెలివితక్కువపని చేశాను ? నేను నా సుఖం చూచుకోవడంవల్ల ఎన్ని ప్రాణాలు పోతున్నాయి ? ఎందరు క్షోభిస్తున్నారు ఇందర్నీ బాధించిన బ్రతుకూ ఒక బ్రతుకేనా ?'

ఆ విచారసాగరంలో మునిగిపోయి బాహ్యప్రపంచాన్నే విస్మరించే విల్చున్న ఆమెకు చీకట్లు దట్టమై రాత్రి ప్రవేశించిన సంగతే తెలియలేదు లైటు వేసుకోవాలనే జ్ఞానమే లేకపోయింది అటువంటిస్థితిలో వున్న ఆమెకు సన్నగా ఏదో సంకేతంలాగా వినవస్తూన్న ఈల చెవుల సోకగా దృష్టి పరిసరాలమీదకు తిరిగింది వీధి గుమ్మంముందు అటుఇటు తచ్చాడుతున్నాడు ఆ ఈః వేస్తూన్న వ్యక్తి అంతలో పద్మ హడావుడిగా లోపలినుండి వచ్చి ఆ వ్యక్తిదగ్గరకు పోయి అతడితో ఏదో మాట్లాడడం ఒక్క సెకనులో జరిగిపోయాయి పని అయిపోగానే ఆ వ్యక్తి త్వరత్వరగా నడిచిపోతున్నాడు పరీక్షగా చూచింది మాధవి 'శ్యాం' విస్మెర పోయి, విశ్చేష్ట అయ్యింది

లోపలికి పరుగుపరుగున వచ్చి లైటువేసి ఆత్రంగా చేతిలోని చిన్నచీటీ చదువుకోసాగింది పద్మ

విషయం అర్థమైన వెంటనే ఆ చెయ్యి ఎట్టుకుంది 'ఏమి టిది ?" అంటూ

అప్పుడు మాధవిని గమనించిన పద్మ ఒక్కక్షణం ఖంగారుపడి వెంటనే తేరుకుని గట్టిగా పెనగులాడింది

"చూడనీ అదేమిటో వదలను నేను "

"ఏమీలేదు నీ కెందుకు ?'

అలా గనుకుంటూనే ఇద్దరూ పెనగులాడుతున్నారు తన చేతిలో ఉత్తరం క్రింద పారేసి ఒక చేతితో పద్మ పిడికిలి గట్టిగా పట్టి రెండవచేతితో విప్పి ఎలాగైతేనేం ఆ చీటీ లాగేసింది మాధవి

రేపు మధ్యాహ్నం నదివొడ్డున మామిడితోపులోకి రా '

చదువుతూండగానే సమయం చూచి చమత్కారంగా తిరిగి లాగేసింది పద్మ మళ్ళీ మాధవి తీసుకునేలోగానే దానిని ఉండచుట్టి వెంటనే నోట్లో వేసుకుని మింగేసింది

'ఎంత అరితేరిపోయావ్ సిగ్గులేదు నీకు ?' అంది మాధవి

"ఇంకెప్పుడూ చెయ్యను వదినా గొడవ పెట్టకు "

వెంటనే లోపలినుంచి జానికమ్మా ఇందిరా ప్రవేశించారు "ఏమి టాగొడవ" అంటూ

మాధవి చెప్పేలోగా పద్మ 'చూడమ్మా ఉత్తరం నేను చదుతున్నా నని నా చెయ్యి గిల్లేసి తిట్టి లాగేసుకుంది! అంది ఏడుపు ముఖంపెట్టి

మాధవి నిర్విణ్ణ అయ్యింది

జానకమ్మకు కారణం దొరికింది కోడల్ని సాధించటానికి 'దాని ఉత్తరాలు తగులడా నీకెందుకమ్మా అవి? ఎందుకు తీశావు? అయినా దాని అధికారమై పోయింది అత్తమీద గౌరవమా? ఆడపడచుమీద గౌరవమా? ఏమీలేదు"

కాని ఇందిర నమ్మలేదు ఆ మాటలు 'ఛ ఉండమ్మా వదిన అటువంటిది కాదు' అంది

మాధవి అసలు సంగతి చెప్పింది

కాని పద్మ 'అబద్ధం అబద్ధం" అంటూ నెత్తీ నోరూ బాదేసుకుంది

జానకమ్మ అంది 'నా కూతుళ్ళ కటువంటి గుణాలులేవు నీలాటి వగలాడీలు కారు వాళ్లు ఎందు కలా ఆడిపోసుకుంటావ్?'

'తిరుపతి కొండలమీద విహారాలూ సినిమాలూ — తనుకదూ అన్నయ్యతో తిరిగి తిరిగి బుట్టలో వేసుకుందీ? అందుకు అందరూ అలాగే అనుకుంటుంది అంది పద్మ

మౌనంగా గదిలోకి వెళ్ళిపోయింది మాధవి అనుసరించింది ఇందిర

'నేను నిజం చెప్పాను ఇందూ' అంది మెల్లగా

"ఆదేమిటి వదినా? నీ మాట నేనూ నమ్మలే దనుకుంటువా? అది అలాంటిదే ఇప్పు డేది దారి?

"మీ అన్నయ్యతో చెప్తే?"

"అమ్మయ్యో!" భయపడిపోయింది ఇందిర ''మనమే జాగ్రత్తగా కాద్దాం రేపు ఎక్కడికీ వెళ్ళకుండా అడుగడుగునా వెంటాడుదాం'

"ప్చ్ లాభం లేదు ఇంత పెంకెవాళ్ళను మనం బాగుచేయలేం' అంటూండ గానే చక్రపాణి రావడంతో ఇందిర లేచి వెళ్ళిపోయింది

మాధవి భర్తను చూచి లేచి నిల్చుంది పాణి మౌనంగా పై ఉత్తరీయం తీసి స్టాండుపై పడవేసి దొడ్లోకి నడిచాడు అతడి తీరు అర్థంకాక మాధవి కూడా ఆలోచిస్తూ వెనువెంటచే వెళ్ళింది

ఇద్దరూ వెళ్ళి దొడ్లో తులసి అరుగుమీద కూర్చున్నారు కొద్దిదూరంలో.

ఆనాడు దశమి అప్పుడే చంద్రోదయ మౌతున్నది కొంఅవడిన కళలతో ఎట్లాగో అప్పుడే తూర్పుదిశ నుండి పైకి లేస్తూన్న ఆ అసంపూర్ణ చంద్రబింబాన్ని చూస్తూన్న మాధవీ పాణీ లిరువురికీ ఎందుకో లోలోన అనిర్వచనీయమైన ఆవేదన. భయం కలిగాయి

"అలా గున్నారేం ?' అనడిగింది మాధవి చక్రపాణిని

'చాలా దారుణం జరిగిపోయింది నావల్ల నిర్జీవంగా పలికింది పాణి కంఠం

ఏమి టది •

"నేను బి ఎ పబ్లిక్ ఎగ్జామినేషన్ పేపర్లు దిద్దుతున్నాను కదూ ?

"అవును ! అయితే ?'

'పదిరోజులక్రితం ఒక రెవరో వచ్చారు జ్ఞాపకముందా? వాళ్ళ అబ్బాయికి ఫలానా నెంబరుకు లోటు వచ్చిన మార్కులు కలుప మనీ మార్కుకు వందరూపాయలు లంచ మిస్తా మనీ ?'

"అవును మనకు లంచంవద్దు రెండు మార్కు లేకదా దయదలచి కలుపరాదా? అన్నాను కదూ నే నావేళ ?'' జ్ఞాపకం చేసుకుంటూ అడిగింది మాధవి

'ఆc, వాళ్ళే మార్కులు వేయకుండా లంచం పట్టకుండా అంత నిక్కచ్చిగా వున్నందుకు కక్షగట్టి ఏమైనా చేస్తారేమో అనుకున్నాను కాని ఇంత దారుణం జరుగుతుం దనుకోలేదు పరీక్ష పోయిందనే అభిమానంకొద్దీ ఆ కుఱ్ఱాడు రైలుకింద పడి ఆత్మహత్య చేసుకున్నాడట ! దాని కంతకూ నేనే కారణం' బాధగా జుట్టు పీక్కున్నాడు

ఆ వార్త వినగానే ఏదో ఆవేదన కలగడంతో మాధవినుండి మాటలు కర వయ్యాయి కొంత సేపు కడకు మెల్లగా అంది, "మనవల్ల అని అనుకుంటాంగానీ అందులో మన తప్పేముందీ? నిజాయితీగా వున్నాం అంతే అతడి ఖర్మ అది, అలా జరగవలసివుంది " పాణి మాట్లాడలేదు

తర్వాత సరోజని ఉత్తరం విషయం చెప్పింది మాధవి అతడు మరీ బాధ పడ్డాడు అది విని "ఒకనాడు వెళ్దామా ? చూచివద్దామా ?" అన్నాడు అతడే

'రానిస్తారా ?'

"పోనీ అదీ చూద్దాం'

లేచి లోపలికి వెళ్ళిపోతూన్న వారికి బాధగా పైకెక్కిన కళాహీన చంద్రవంక వెక్కిరిస్తున్నట్లు కన్పించింది

## 55

వైశాఖ పౌర్ణమి. వెన్నెలలు విరయగాసినాయన్నమాటే కాని ఎక్కడా కళా కాంతులు లేవు. వెలతెల పోతూవుంది వెన్నెల. వేసగి కాకలకు మాడిమాడివున్న ధరిత్రిపై ఎక్కడా ఒక్క పచ్చని చెట్టూ, చేమా, చిగురుటాకూ లేవు, ఆ వెన్నెలను లీనం చేసుకుని ప్రకాశించడానికి. బొగులు బొగులు మంటూ పాడుపడ్డ గృహంలాగా వుంది ఎందువల్లనో ఆ ప్రకృతి.

ఉన్నట్లుండి అర్ధరాత్రివేళ నల్లని మేఘ మొకటి క్రమంగా విస్తరిస్తూ దట్టమై ఆకాశాన్నంతా క్రమ్మివేసి భూతలాన్ని చీకటిమయం చేసింది. గాలికూడా మెల్లగా రాసాగింది. ఆ గాలి క్రమంగా ఝంఝూమారుతమై సాగిసాగి ప్రళయమారుతంగా ఆకృతి దాల్చింది. ఆ మహావాయువు వేగవీచికాపరంపరలలో వృక్షశాఖాగ్రాలు కళపెళ ధ్వనులతో విరగ నారంభించాయి. కొన్ని తరుమూలాలు పెకలించబడి నిలువునా నేల కూలసాగాయి. అంబరవీధిలో ఆ గాలి తాకిడికి ఛిద్రుపలైన మేఘ శకలాలు భయంకర యుద్ధం ప్రారంభించాయి. ఆ సమరంలో ఉద్భవించిన పిడుగులు ఏ పాపమూ ఎరుగని వసుధమ గడగడలాడించి భయపెడ్తున్నాయి. పదునైనకత్తి అంచులాగా ఒక్కొక్క వాయువీచిక పదేసి పూరికొంపల కప్పులను చెక్కివేయసాగింది. హోరున విజృంభించిన వాన క్షణంలో భూమిని జల ప్రళయంలో ముంచినట్టు ముంచివేసింది. అనేక ఇండ్లూ, భవంతులూ కూడా నేల కూల సాగాయి."

అర్ధరాత్రి చెలరేగిన ఆ ప్రకృతి విలయతాండవం ప్రాభాత సూర్యుని పరికించి భయంతో నిలచిపోయినట్లు ఆగిపోయింది; శిధిల గృహంలా కన్పించసాగింది — వేలకూలిన చెట్లలతో, మరణించిన పశు పక్ష్యాదులతో, నాశనమైన గృహాలతో బుఆదమయంగా వున్న భూదేవి.

నానావిధ ఫల పుష్ప వృక్షాలతో నిత్యం పచ్చగా కళకళ లాడ్తూండే అనంతయ్య మేడ ఆవరణ అంతా సౌందర్యం కోల్పోయి మదపుటేనుగు నాశనం చేసి వదలిన అడవి లాగా కన్పిస్తూంది.

నీరసంతో మనోవ్యధతో శయ్యాగతుడైన అనంతయ్య చుట్టూ ఆదిలక్ష్మి కేశవరావు, సరోజని, నారాయణరావు, గుమాస్తాలు కూర్చుని వున్నారు. అప్పుడే వైద్యుడు వచ్చి పరీక్షించి మందిచ్చి వెళ్ళాడు. ఆ నీరసంతోనే అనంతయ్య ఓపిక చేసుకుని మెల్లగా గుమాస్తాలతో ఏవో అవసరవిషయాలు మాట్లాడుతున్నాడు.




అంతలో గుమ్మంవద్ద ఎవరో వచ్చిన అలికిడి కాగా అందరి దృష్టులూ అటు తిరిగాయి ఆగంతకులను చూచిన అందరి వదనాలూ ఒక్కసారి సంభ్రమాశ్చర్యాలతో వెలిగిపోయి అంతలో భయసందేహాలతో ముకుళించుకుపోయాయి

"బిందూ" అంటూ కేశవరావూ సరోజనీ ఎదురు వెళ్ళారు

"రండి బావగారూ'' అని నారాయణరావు ఆహ్వానం పలుకుతూ చక్రపాణి వద్దకు ఎదురేగాడు ఆదిలక్ష్మి ముఖంకూడ ఆనందంగానే వుంది కూతుర్ని చూచి

''చిన్నమ్మగా రొచ్చారు అమ్మాయిగారు వచ్చారు ' అంటూ గుమాస్తాలూ నౌకర్లూ ఆనంద కోలాహలం లేవదీశారు

కాని ఎటువంటి భావమూ ప్రదర్శించక కఠినత్వం మూర్తీభవించిన పాషాణ మూర్తిలా వుండిపోయాడు ఒకే ఒక వ్యక్తి అనంతయ్య - ముఖం చటుక్కున ప్రక్కకు త్రిప్పుకున్నాడు ' అడుగు ముందుకు వెయ్యవద్దు పో ఎవరి నడిగి నా ఇంట్లో అడుగుపెట్టావు తిరిగి ?

అశనిపాతంలా వున్న ఆ మాటలకు శిలాప్రతిమలా చేష్టలు దక్కి నిలుచుని పోయారు అందరూ

' లంకాపురిలో సీత జన్మించి అరిష్టాలు తెచ్చింది నువ్వు పుట్టి నా యింట్లో నాశనం తెచ్చావు పో నాకు చూపెట్టకు నీ ముఖం" గజగజ వణికిపోతూ కేకలు

వేస్తూన్న అనంతయ్యను అందరూ సాంత్వనపఱచి నచ్చజెప్పబోతున్నారు. కాని ఆ ప్రయత్నాలు విఫలమే అయ్యాయి.

అసలే నీరసంగా వున్న అనంతయ్య అధికావేశానికి తట్టుకోలేక స్పృహతప్పిపోయాడు. అందరూ ఆత్రంగా అతడిని యథాస్థితికి తెచ్చేప్రయత్నంలో నిమగ్నమయ్యారు. పది నిముషాలలో అతడికి తెలివి వచ్చింది. అందరూ ఊరట జెంది చుట్టూ కలియజూచారు. అక్కడెక్కడా మాధవీ చక్రపాణీల జాడలేదు.

ఇంటికి తిరిగి వచ్చిన మాధవి ఆవేదనావమానాలతో కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్వసాగింది.

"ఎందు కేడుస్తావ్ బిందూ ?" అనునయ వాక్యాలతో ఓదార్చ ప్రయత్నించాడు చక్రపాణి. "అందుకే పిలవనిదే పుట్టింటికైనా వెళ్ళవద్దని ఏనాడో ఆ పార్వతీదేవే చెప్పింది లోకానికి. సర్వవిజ్ఞురై వుండీ, తన కుమార్తె లోకమాత అనీ శక్తిస్వరూపిణి అనీ తెలిసివుండీ పుట్టింటికి వచ్చి నట్టింట్లో నిలచిన ఆమెను ఆలోచనా రహితంగా అవమానించాడు. ఆ దక్షుని కంటె విజ్ఞులమా మేము ? ఆ దాక్షాయణి కంటె అధికులా మీరు ? వారసత్వం ఎక్కడికి పోతుంది ? విచారించకు, మరచిపో."

## 56

మహాతపము పాలికించుతూ ప్రళయాకారంతో గ్రీష్మం ప్రవేశించింది. రోహిణీ కార్తి ఎండలు అక్షరాలా రోళ్ళు బద్దలు కొడ్తూన్నాయంటే అతిశయోక్తికాదు. దేహ దహ్నమూ, ప్రాణ దహ్నమూ అయిన ఆ ఘోర మార్తాండ తాపానికి జడిసిన జనావళి ఏరోజు కారోజే 'ఈ దినం గడుస్తుందా ?' అని భీతి జెందసాగారు.

జేష్ఠమాసపు సాయంత్రం. సాయంత్ర మైనదన్న పేరేకాని ఎక్కడా చల్లదనపు ఛాయలే జాడలేవు. వడగాడ్పు ఈ చెవినుండి ఆ చెవికి కొట్టసాగింది.

ఇంకాజనం ఇండ్లలోనుంచి బయటకే రావడం లేదు.

~~చక్రపాణి కుటుంబం అంతా అప్పుడే~~ మధ్యాహ్న నిద్రలనుండి మేల్కొన్నారు. కాని ఇంకా ప్రక్కలు వదలి లేవలేదు. బద్ధకంగా పడుకునే వున్నారు. ఆ కబురూ ఈ కబురూ చెప్పుకుంటూ. అంతలో దగ్గరలో ఎక్కడినుంచో పెద్దపెట్టున శోకాలు వినరావడంతో ఎక్కడి బద్ధక మక్కడే వదలిపోయి అందరూ ఆత్రంగా వీధిలోకి పరుగు పెట్టారు.

"అయ్యో, రుక్మిణీ వాళ్ళింట్లోనుంచి వినవస్తున్నాయి ఆ ఏడ్పులు. పాపం ఏం జరిగిందో గాని !" అంది ఇందిర.

"నడవండి చూద్దాం" అని ఆందోళనతో అటు నడిచాడు. చక్రపాణి వడివడిగా. జానకమ్మ "మన కెందుకు వెధవగొడవ ? వెళ్ళొ" ద్దని వారిస్తున్నా వినిపించుకోకుండా మాధవీ, ఇందిరాకూడ అతడి వెనుకనే వెళ్ళారు.

ఏముంది చూడటానికి ? హృదయ విదారకమైన దృశ్యం ! చూపరుల గుండెలను కలచివేసి ప్రాణా లెగిరిపోయేట్టు చేసే దృశ్యం ! రుక్మిణి శవంచుట్టూ జేరి ఆత్మీయులంతా విలపిస్తున్నారు. "రుక్మిణీ" అంటూ ఇందిరా మాధవీ కూడ ఒక్కసారి ఆ నిర్జీవ కళేబరంపై వాలిపోయి రోదించారు.

"ఏం జరిగింది ?" ఎలాగో ప్రశ్నించగలిగాడు పాణి.

చుట్టూ జేరిన జనంలో ఎవరో చెప్పగా తేలిన సారాంశం : వెంకటేశం హఠాత్తుగా గుండె ఆగి మరణించాడు ఆ ఉదయం. ఆవార్త విన్న రుక్మిణి వెంటనే అక్కడకు పరుగెత్తిపోయి చూసింది. ఇంకా ఆ శవం అక్కడనుండి కదలనే లేదు. తక్షణం ఇంటికి తిరిగి వచ్చి ఏదో మ్రింగింది. ఎవరికీ తెలియదు. ఆఖరిదశలో గిలగిలా కొట్టుకుంటూంటే వైద్యునికోసం పరుగెట్టారు. డాక్టరు వచ్చేసరికి ప్రాణాలు పోయాయి. వెంకటేశం దేహాన్నీ తన దేహాన్నీ ఒక్కచోటే కలిపి అంత్యక్రియలు చేయమని కోరుతూ ప్రాణాలు విడిచిందట రుక్మిణి.

కండ్లు తిరిగిపోయాయి చక్రపాణికీ మాధవికీ. ఎవరిని ఎలా ఓదార్చాలో, తమని తా మెలా ఓదార్చుకోవాలో తెలియలేదు. నిత్యం నవ్వుతూ నవ్విస్తూండే ఆ చైతన్య స్రవంతి రుక్మిణి ఏమైపోయిందో ఎక్కడా ఆలోచనకు అందలేదు. అంతటి సౌమ్య హృదయుడు వెంకటేశం ఎక్కడికి వెళ్ళిపోయాడో ! 'జీవితం బుద్బుదప్రాయం. ఎందుకు బ్రతుకుతున్నామో, ఏం చేస్తున్నామో ఎక్కడినుండి వస్తున్నామో, ఎక్కడికి పోతున్నామో మనకే తెలియదు.'

శవాలను తీసుకుపోయేసరికి రాత్రి ఏడుగంట లైంది. మాధవీ, ఇందిరా ఇంటికి తిరిగివచ్చి స్నానాలు చేశారు. జానకమ్మ బలవంతం మీద, ఖననభూమికి వెళ్ళిన చక్రపాణి ఇంటికి తిరిగివచ్చేసరికి రాత్రి పదకొండు దాటవస్తోంది. నూతిదగ్గర స్నానంచేసి వచ్చి మౌనంగా పడుకున్నాడు. అతడూ, మాధవీ, ఇందిరా కూడా భోజనాలు చేయలేదు. ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు కూడా.

"ఎవళ్ళో ఏదో అయితే మధ్యన మన కేమి టీ సంత ? నిండు ఇంట్లో ఎందుకీ అభోజనాలు ?" అని జానకమ్మ సాధిస్తూనే వున్నా ఎవరూ లెఖ్ఖ జేయలేదు.

ప్రాణస్నేహితులనూ ఆత్మబంధువులనూ కోల్పోయినప్పుడు అనుభవించే

బాధ అనుభవజ్ఞులకె కాని తెలియదు. నిండు శరీరంలో ఒక భాగం దూరమైనట్టే, శరీరంలోని జవసత్వాలు లాగివేయఁబడినట్టే వుంటుంది.

ఆనాడు ఆకసంలో చంద్రోదయమే కాలేదు. జగమంతా తిమిరావృతమై వుంది. గాలి స్తంభించిపోయింది. దూరాన ప్రవహిస్తున్న నది మీది నుండి మత్స్య మాంస సంబంధ దుర్వాసనా మిశితమైన వెచ్చని గాలి అప్పుడప్పుడు ఒక్కొక్క విసురు విసరి ఊరుకొంటూంది.

ఎవరి సుఖదుఃఖా లెలా వున్నా కాలచక్ర పరిభ్రమణం నిలిచిపోదు. క్రమంగా ప్రాగాకాశంలో శుక్రతార దర్శన మిచ్చింది. విడిగా తూర్పురేఖ లుదయించాయి. ఉషోదయాన్ని పక్షిగణాల కలకలారావాలు వెన్నంటాయి.

తెల్ల ఆవుల గుంపులాగా తెలతెల బోతూన్న ఉషస్సును నిర్లిప్తంగా తిలకిస్తూ, ఆలోచనాదూరమై మైదానంలాగా మత్తుగా పడిఉన్న మెదడుతో మెలకువగానే పడకుని ఉన్నాడు చక్రపాణి. ఉన్నట్టుండి ఉవ్వెత్తుగా శోకాలు విన్పించగానే కొంచం కలవరపడ్డాడు కాని, మళ్ళీ రుక్మిణి కుటుంబంవారే ఏడుస్తున్నా రనుకుని మెదలకుండా పూరుకున్నాడు. లేవా లనిపించలేదు.

కాని ఒక్క నిముషం గడవగానే ఆ ఏడ్పులు తమయింట్లోనేనేమో అనే అనుమానం రాగా ఖంగారుగా లేచాడు. లేస్తూండగానే ఒక్కసారిలా రా అన్నయ్యా" అని ఒక్క గావుకేక పెట్టింది. దానితో మత్తూ అంతా ఒదలిపోయి ఖంగారుతో శయ్యపైనుండి లేవగానే వీధి కిటికీనుండి లోపలికి వచ్చి రెపరెపలాడ్తూ ఎగురుతూ, ఎగిరిపోకుండా పైన రాయిపెట్టబడి వున్న ఒక తెల్ల కాగితం అతడి దృష్టి నాకర్షించింది. సందేహిస్తూనే తీసి చూచాడు.

"ఒరేయ్ పాణీ,

నా బిందును చేసుకొని కులుకుదా మనుకున్నావు కదూ ?

కక్ష తీర్చుకున్నాను. పోయి దిక్కున్నచోట చెప్పుకో. చెప్పాను కదూ నేను త్రాచుపాము నని ? జాగ్రత్త. మమ్మల్ని వెతికించా లనే వెట్టి ప్రయత్నాలు చెయ్యక నోరు మూసుకుని పడివుండు. లేకుంటే ఇంకా బాధ లనుభవించగలవు.

— శ్యాం"

అర్థంకాక ఆతురతగా బయటకు పరుగెట్టాడు చక్రపాణి.

"పద్మ కనపడడం లేదురా నాయనా. ఇరుగుపొరుగిండ్ల కెక్కడికి వెళ్ళలేదట." అంటూ జానకమ్మ మరింత బిగ్గరగా ఏడువసాగింది.

విస్మెరపోయి చూస్తూన్న చక్రపాణి చేతిలో ఉత్తరాన్ని ఇందిరా మాధవీ తీసుకు చూచి మరింత విస్మెరపోయారు.

"ఆ దుర్మార్గుడి నింటికి రానివ్వకూడదంటే మీకు కోప మొచ్చింది చూశారా?" అంది మాధవి అత్తగారితో.

ఏడుపు మాని మ్రింగేసేట్టు చూచింది జానకమ్మ ఆమెను. "ఛీ. నోర్మూయ్. శనిలా పట్టావు ఈ ఇంటికి. నువ్వు ఎప్పుడైతే నా కొడుకు జీవితంలో ప్రవేశించావో అప్పుడే మాయింటికి కష్టాలు ప్రారంభ మయ్యాయి. ఇంకా ఏంచెయ్యనున్నావో శక్తిలాగ మమ్మల్ని. నువ్వు నా కొడుక్కి ఏదో మందుపెట్టి పెళ్ళాడావు. నీ మేనమామ నా కూతుర్ని తీసుకుపోయాడు. ఎంతకైనా తగినవాళ్ళే!"

"అవును. తండ్రి అలాగ, కొడు కలాగ, ఇప్పుడు కూతు రిలాగ. ఆనవాయితీ ఎక్కడికి పోతుంది? ఇవ్వాళ క్రొత్తగా ఏడవడం దేనికి?" ఏడుపు విని ప్రోగైన ఇరుగూపొరుగూ తలోమాటా అంటూ ఎవరిదారిన వారు పోయారు.

మాధవి ముఖం చేతులతో కప్పుకుని రోదిస్తూ గదిలోకి పోయింది.

చక్రపాణి ముఖం భూమిలోకి క్రుంగిపోయింది. ఏమీ మాట్లాడకుండా ఎవరివైపు చూడకుండా త్వరత్వరగా జోళ్ళు తొడుక్కుని ఎక్కడికో వెళ్ళిపోయాడు.

ఇల్లంతా భయంకర నిశ్శబ్దం ఆవరించింది.

"అందరిచేతా ఇంకా నవ్వించుకొనడానికి కాని ఎందు కా ఏడుపు? నువ్వే దాన్ని చేతులారా అలా చేశావు. ఇప్పు డందరం అనుభవించాలి" అని ఇందిర అదలించడంతో జానకమ్మ నోరుమూసుకుని నిశ్శబ్దంగా ఏడుపు సాగించింది.

ఇందిర వెళ్ళి గదిలో ఏడుస్తూన్న మాధవిని ఓదార్చింది. "ఊరుకో వదినా; అమ్మ మాటల కేం?"

"అందు కేడవడంలేదు ఇందిరా. ఇక ఈ అవమానాన్ని మోస్తూ మన కుటుంబమంతా బ్రతికినన్నాళ్ళూ ఏడ్వవలసిందే."

"ఏంగొడవ జరుగుతుందో నని పెద్దవాళ్ళ ఎదుట దాస్తాం భయంతో కొన్నికొన్ని విషయాలు. దానితో ఇంతంత అనర్థాలు జరిగి అవమానాలు చుట్టుకుంటాయి. ఆవాళ ఆ చీటీ గొడవ అన్నయ్యకు చెప్తే ఇవాళ యింత జరుగకపోనేమో?"

"ప్చ్. అలా అనుకుంటాం కానీ బుద్ధిలేని వాళ్ళనీ, అందుకుతోడు వెనుక మరో బుద్ధితక్కువ మద్దత్తు ఉన్నవాళ్ళనీ ఎవరూ బాగు చేయలేరు. ఆపలేరు. వాళ్ళంతే."

"మీ అన్నయ్య ఎక్కడి కెళ్ళారు?"

"వెతకడానికి ఖాబోలు. పాపం ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో ! రాత్రి భోజనం కూడ చేయలేదు.''

ఇంట్లో వున్న మనకే ఇంత అవమానంగా వుంది, అందరిలోనూ ఆయ నెంత చిన్నతనం అనుభవిస్తున్నారో ! ఎక్కడని వెతకుతారు? ఎవరి కేమని చెప్తారు ?''

"ఏం చేస్తాం ? మన ఖర్మ. చచ్చిం దనుకుని పారేసి మరచిపోవడానికి వీలు లేదు. ఛస్తే ఒక్కబాధే – నలుగురి సానుభూతీ, ఓదార్పూ వుంటాయి. ఇటువంటి పనికి అందరి హేళనలూ ఎదుర్కోలేక చచ్చిపోవాలి.''

'ఏమైనా తెల్సిందామ్మా. అయినా అప్పుడే ఎలా తెలుస్తుంది ?'

'ఎక్కడని వెతుకుతారులే. ఈ పాటికి మద్రాసో బొంబాయో పోయే బండెక్కేసి ఎంతదూరం పోయారో !'

'ఇంట్లో నగలూ, నాణాలూ ఉన్నాయా, అవీ మాయమయ్యాయా పిల్లతో బాటు!'

'అయినా ఇంద రుండి అంతగా ఒక్కళ్ళూ చూచుకోక ఏం చేస్తున్నారు ?'

ఒక్కొక్కళ్ళే అమ్మలక్కలు వస్తూ పోతూ నిసిరే విసుర్లు భరించలేక వీధి తలుపు మూసేసింది ఇందిర విసుక్కుంటూ.

అప్పుడు వదినా ఆడపడచులకు నగల అజ వచ్చింది. చూడగా, నగలూ. చీరలూ కూడలేవు. ఆ రోజున మాధవికి అన్న తెచ్చి యిచ్చిన చీరలూ, నగలూ ఆ సూట్ కేస్‌తో సహా మాయ మయ్యాయి. "విన్న మనం రుక్మిణి పోయిన విచారంలో వున్నాం. ఏమీ చూచుకోలేదు. ఈ మొద్దు దాని ప్రయత్నంలో అది వున్నట్లుంది'' అంది ఇందిర. మాధవి ఏమీ మాట్లాడలేదు.

ఏడ్చి ఏడ్చి అలసి నిద్రపోయింది జానకమ్మ.

తొలిరోజు రుక్మిణి పోయిన విచారంలో భోజనాలు చేయలేదు; ఈ రోజు అసలు ఇంట్లో వంటే లేదు. నీరసంగా అంతా తలోమూలా మేను వాల్చారు, లోలోన దిగుళ్ళతో.

మధ్యాహ్నంవరకూ గడచిపోయింది. చక్రపాణి తిరిగి రాలేదు. పోస్టుమాన్ వచ్చి ఒక ఉత్తరం ఇచ్చిపోయాడు.

''అరె, మీ అన్నయ్య దస్తూరీలాగే వుందీ !'' అంటూ మాధవి ఉత్తరం తెర చింది, ఇందిరకూడ ప్రక్కన జేరింది చదవటానికి.

"బిందూ !

ఇక ని న్నింత చనవుగా సంబోధించే అదృష్టంలేదు. చంద్రబింబంలాటి నీ వదనం చూస్తూ సకల బాధలూ మరచిపోయే అవకాశం లేదు. ఈ బాధావమానాల

మధ్య ఇక తలెత్తుకు బ్రతుకలేను. నేను వుంటే నాతో బాటు నీకూ ఈ బాధలు తప్పవు. అతి సుకుమారులైన హృదయ శరీరాలు రెండూ కూడా ఈ బాధ లనుభవించలేవు. నాబోటి మందభాగ్యుని వివాహమాడి నువ్వు చాలా తెలివితక్కువగా ప్రవర్తించావు. నన్ను మరచిపో ప్రయత్నించు. నేను లేనినాడు నీవారు నిన్ను తప్పక ఆదరించగల రనే నమ్మక ముంది నాకు.

అమ్మా ఇందిరా అంటావా? రఘు వచ్చి వాళ్ళను తీసుకుపోతాడు. ఇప్పుడే వాడికికూడ ఉత్తరం వ్రాశాను. ఎవర్నీ నొప్పింపలేని, ఆజ్ఞాపించి మార్చలేని నేను ఈ కుటుంబంలో వుంటే ఎంతో లేకున్నా అంతే. కుటుంబానికి రఘు సరియైన సారథి.

బిందూ! నీకు తీరని అన్యాయాన్ని చేస్తున్నాను. క్షమించు, నన్ను మఱచిపో. ఇక నాకై ఎదురు చూడకు. పిరికివాడి నని నవ్వుకుని వదిలెయ్యి. నిరాశతో క్రుంగిపోక నీ జీవితాన్ని నిత్య సంతోషమయమూ, అర్థవంతమూ చేసుకోవడానికి ప్రయత్నించు. ఇంతకంటె వివరించలేను. అర్థం జేసుకో.

— పాణి."

అన్నయ్యా! ఎంతపని చేశావ్? అంటూ విలపించసాగింది ఇందిర. అది విని వచ్చిన జానకమ్మ అసలే గజగజ లాడిపోయింది. ఆవిడ అహంకార మంతా ఈ దెబ్బతో పూర్తిగా మటుమాయ మైపోయింది.

బిందూ! నా తల్లీ. మన కెన్ని కష్టా లొచ్చాయే! అంటూ మాధవిని కౌగలించుకుని కన్నీరు కార్చింది.

కాని మాధవి ఉలుకలేదు, పలుకలేదు. అలా రాయిలా స్పందనంలేకుండా కూర్చుండిపోయింది. నోటినుండి ఒక్కమాట వెలువడలేదు, కంటినుండి ఒక్క బాష్పబిందు వైనా రాలేదు.

కదలకా మెదలకా మాటా పలుకూ లేక నిశ్చేష్టయై కూర్చున్న ఆమెను చూచి జానకమ్మా, ఇందిరా కూడ ఖంగారు పడ్డారు.

ఇందిర గబగబా చన్నీరు తెచ్చి వదిన ముఖాన చల్లబోయింది. మాధవి మృదువుగానే వారించింది ఆమెను. "ఎందు కిందిరా ఈ శైత్యోపచారాలు? నా కేమీ అయిపోలేదు. భయపడకు. పాషాణాన్నైపోయినాను నేను. ఇక న న్నేవీ ఏం చెయ్యలేవు."

## *57*

మంచికంటె చెడు తేలికగా దావానలంలా ప్రాకిపోతుంది. జరిగిన విషయా లన్నీ అనంతయ్య కుటుంబానికి క్షణంగా తెలిశాయి. ఎవరిమట్టుకు వారే నీరు కారి

పోయారు. అహంకార మంతా నశించిన ఆదిలక్ష్మి బావురుమంది. "ఇక నా కూతురి గతి ఏమి" టంటూ.

"ఎంతో అదృష్టవంతురాల వనుకున్నాను మాధవీ. నీ జీవిత మెలా గై పోయింది ?" అంటూ సరోజినీ విలపించింది.

కేశవరావు పసివాడిలా కదలికదలి ఏడ్చాడు.



అనంతయ్య శిలా ప్రతిమే అయ్యాడు. చూస్తూండగా అతడి ముఖం అరవై లంఘనాలు జేసినట్టు పాలిపోయింది. "నా సుఖం సరేసరి; నీ సుఖమైనా నిలుపుకో లేకపోయావా బిందూ ?" అంటూ ఆక్రోశించాడు.

క్షణాలలో కర్తవ్యం స్ఫురింపజేసుకున్నాడు కేశవరావు

సరోజనీ త్వరగా నాతో రా అన్నాడు ఆమె వెంటనే వచ్చి చెంత నిలచింది

నాన్నగారూ వెళవు అమ్మా నమస్కారం అంటూ నడక సాగించాడు సరోజని అనుసరించింది



షాక్ తిన్నట్టే అయ్యాడు అనంతయ్య

"అయ్యో ఎక్కడికిరా కట్టుబట్టలతో ?" అంది ఆదిలక్ష్మి వెనుకనే వెళ్ళి.

"కేశవ్ ఎక్కడికి ? ఏమిటి నీ ధోరణి ?" అడిగాడు అనంతయ్య తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో

కేశవరావు ఆగాడు వెనుదిరిగి మెల్లని స్వరంలో చెప్పాడు 'నా చెల్లెలు అంత కష్టదశలో వుంటే ఇక్కడ నేను రాజభోగా లనుభవించలేను ఒకప్పుడు మీకు మాటయిచ్చాను మరి ఆ గడప త్రొక్కనని అలా జరిగితే మరి నా ముఖం చూడనన్నారు మీరు అందుకే సెలవు కోరుతున్నాను బిందు ఇంతకష్టం అనుభవిస్తూన్న పరిస్థితులలో మీకు ఇచ్చిన మాట నిలుపుకోలేను వెళ్తున్నాను నా శక్తిమేరకు నా చెల్లెల్ని సుఖపెట్ట ప్రయత్నిస్తాను

అనంతయ్య అప్రతిభుడే అయ్యాడు

ఒక్కక్షణం చూచి సమాధానం రాక నడక సాగించారు కేశవ్ దంపతులు

అయ్యో మాట్లాడ రేమండీ ? అంది ఆదిలక్ష్మి

అనంతయ్య తల వాల్చి నిలబడ్డాడు

"పిల్ల లంతా వెళ్ళిపోతే ఈ అయిశ్వర్య మంతా ఇంకెందుకు ? మనమీద వేసి తగలేసుకోవడానికా ? ఇక ఈ పిచ్చి పట్టుదలతో నేను గడపలేను ఎవ రేమనుకున్నా నాకు లెఖ్ఖలేదు నా కూతుర్ని నా ఇంటికి తెచ్చుకుంటాను" అంటూ కొడుకూ కోడలు వెంట ఆదిలక్ష్మికూడ బయలేరింది

"ఈ బుద్ధి ముందే వుంటే అస లింతవరకూ రాకేపోను, మొండి పట్టుదలతో నువ్వు కూర్చుంటే ఆలోచన చెప్పేవాళ్ళులేక నే నింత తెలివితక్కువవాడి నయ్యాను నా కూతురు నాకు మాత్రం శత్రువా ?' అంటూ అనంతయ్య కూడా నడిచాడు

నిష్కారణంగా వ్యాపారంలో అపారనష్టం వాటిల్లడంతో ఐశ్వర్యంయొక్కచంచలత్వమూ నిత్యంమాధవితోపాటు తమకండ్లఎదుట చలాకీగాతిరిగే రుక్మిణినిమిషంలో కన్ను మూయడంతో జీవితపు క్షణభంగురత్వమూ బాగా అవగాహన అయ్యాయి అనంతయ్యకు ఇవికాక నారాయణకు కుదిరిన వధువు హఠాత్తుగా మఱణించడం పెంపుడుజంతువులు మోతీ పంచకళ్యాణీ గతించడంకూడా ఆయనకు దుఃఖకారణాలే

'భగవంతుని చేతిలోని కీలుబొమ్మలం ఎప్పుడు సుఖమో ఎప్పుడు దుఃఖమో తెలియదు ఇక మనంకూడా ఉన్న కొద్దిపాటి జీవితాన్ని అర్ధరహితమైన పట్టుదలలతో నరకం చేసుకోకుండా వివేకంగా బ్రతికి సంతోషాన్ని సృష్టించుకోవాలి' అనుకున్నా డతడు అందుకే అంతత్వరగా మనస్సునుండి కఠినత్వాన్ని దూరంచేసి పూర్వపు మృదుత్వాన్ని కొనితెచ్చుకున్నాడు

తల్లిదండ్రులలో పరివర్తన చూచిన కేశవరావు వదనం అంతివిచారంలోనూ ఆనందప్రపుల్ల మైంది

' అశ్వంగాడిమీద ఎప్పటికైనా కక్ష తీర్చుకుంటాను" ప్రతిజ్ఞచేశాడు నారాయణ

(సశేషం)

---

Printed and Published by A Sudhakar Rao from Yuva Press 5 9 88
Public Garden Road Hyderabad 1 Controlling Editor Sri CHAKRAPANI

M.K.N. ప్రొడక్షన్స్ వారి...

# కలియుగ భీముడు

మాటలు-పాటలు: అనిసెట్టి, సంగీతం: పామర్తి

ఎడిటింగ్: బి. గోపాలరావు, దర్శకత్వం: మహమ్మద్ హుస్సేన్






ఇప్పుడు నడిరోడ్లలో ఎండబెడుతున్నావా?

